# ప్రబోధ చూడామణి యను క్షరాక్షరోపాధి ద్వయ దోష రహిత పరమతత్త్వ కందములు

రచయిత : శ్రీమత్‌భాగవత కృష్ణదేశిక ప్రభువులు

వ్యాఖ్యాత : శ్రీ విజ్ఞానంద శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి



పరిపూర్ణ దర్శనాచార్య సదానంద

శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు

వీరి ధర్మపత్ని శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ గారు

ఓం

శ్రీగురుభ్యోన్నమ:

# ప్రబోధ చూడామణియను క్షరాక్షరోపాధి ద్వయ దోషరహిత పరమతత్త్వ కందములు

## పీఠిక

శ్రీ మద్రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారు, దుందుభినామ సంవత్సర మాఘశుద్ధ పౌర్ణమి నాటికి అనగా 1784 సం॥ లకు క్షరాక్షరో పాది ద్వయ దోష రహిత పరమ తత్వకందములు 250, రచించినట్లుగా తెలియు చున్నది. అనగా కందార్ధ రచన 1765 సం॥కు కందపద్యరచనకు మధ్య కాలము సుమారు 19 సం॥ లుగా వ్యత్యాసము తెలియుచున్నది. కందములు వ్యాకరణ శాస్త్రరీత్యా ఛందోబద్ధమైయున్నవి.19సం॥ లు విరామము తరువాత పరిపూర్ణ బోధను గూర్చి ఇంకను విస్పష్టముగా పద్యములందు తెలియబడుచున్నది.

కం॥ 3 నందు "అర్ధము తెలియక గ్రంథము వ్యర్ధంబని నిందజేయు వ్యర్థుల మాటలే వ్యర్ధములని", గ్రంథ అర్ధము 'సద్గురుని వలన' బాగుగ వినుడీ అనియును కం॥ ఏకందము కా కందమే మాకంద ఫలరస రుచిని, మరిపించు రుచిన్ మీ కందము లైనను వినుడీ కందము లన్నియు సత్కవీంద్రులారా!

**కం॥ కథ కాదు జనన మరణవ్యథమానుటకై రచిస్తి వరకవులారా!**
**మథియించి చూచి దిద్దుడీ, పథమే మాత్రము దప్పి పారకయుండన్॥**

పరిపూర్ణ బోధయందు ఒక నిర్దుష్టమైన విధానమును పైపద్యముల ద్వారా ఇందు చెప్పబడుచున్నట్లుగా, గ్రంథకర్తగారు పేర్కొన్నారు.రహస్యమై గురుగోప్యమై, భ్రాంతి రహిత విధానమునకు, సరియైన మార్గముగా సూచింపబడుచున్న కంద పద్యములయందు క్షరాక్షరోపాధి ద్వయ

దోషరహిత పరమ తత్వకందములు అను పేరున, దీని నిర్మిత విధానము విశదీకరించబడుచున్నది. కావున ఈ శబ్దార్థములను, అందలి విశిష్టతను, పాఠకులు ముందుగా గ్రహించవలసి వున్నది.

కందార్థములయందలి అంశముల కంటెను కందములయందు యింకనూ నిర్దుష్టమైన విధానము చెప్పబడుచున్నది.

కథకాదు జనన మరణవ్యథ మానుటకై రచియిస్తి అని, సూరి జనులే ఈకందము సారము గనువారు గాని అని, తక్కిన బోధల వలె యిది చిక్కులు గల బోధగాదు చేపట్ట తగును అనిన్నీ సకల కార్య ప్రయత్న జనకమగు వస్తువును పట్టి నలచి వేయును, దీన్నొకసారి వినిన, చదివిన అనిన్నీ, ఇంతే కాక నకల నిగమాగమాది ప్రకర మహా నారికేళ ఫలసారమనిన్నీ, ఈ గ్రంథకర్తచే స్పష్టపరచ బడుచున్నది. అంతే గాక గురుని కోరిక మేరకు, శిష్యునిచే విన్న ప్రబోధను, తిరిగి చెప్పించిన విధానము

కం॥ నే చెప్పినట్లు చెప్పరా, నేచెప్పిన బోధ నీకు లెస్స అతికి వుంటే నేచూతు నీ చమత్కృతి, రాజిత సుగుణైక సారా, రమ్య విచారా॥ అని గురుడు అడుగుట

కం॥ నాగురుడు నాకు తెల్పిన ఈగురుబోధంతమీకు యిపుడు నేనున్ బాగుగ వినజెప్పితి సుమీ॥ అని శిష్యుడూరకయున్నన్॥ అని శిష్యునిచే వలికించి, అదివిన్న గురుమూర్తిచే శిష్యుని గూర్చి కం॥ చంద్రునిచీమ ముద్దాడిందని అట్లిపుడు నీవీ సద్బోధను చెందితివి. నీకు సరి ఈ జగమందెవ్వరు లేరు. నిను మది మెచ్చితిరా అని గురుడు సంతోషము వ్యక్తపరచినట్లుగా గ్రంథకర్త పేర్కొన్నారు.

## నిర్మిత విధానము

క్షరాక్షరో పాధి= క్షరమనగా మార్పు చెందునది. పరిణామ క్రమమునకు లోనై వున్నదని అర్థము, అక్షరమనగా = ఎట్టి మార్పులకు, పరిణామములకు లోను కాక, స్థిరమై శాశ్వతమై వున్నదని అర్థము. ఈ

రెండు వుపాధులు, అన్యోన్యాశ్రితమై ఒకదానితో నొకటి, ముడిపడి, సాపేక్షిక శబ్దజాలముతో సూచింప బడుచున్నది.

గీతాశాస్త్రప్రకారం క్షరోపాధి, అక్షరో పాధికూడా నిర్ణయింపబడి వున్నది. శ్లో॥ ద్వావిమౌ పురుషౌలోకే, క్షర శ్చాక్షరఏవచా॥ క్షర స్సర్వాణీభూతాని కూటస్థో అక్షరవుచ్యతే॥ అనగా సమస్త భూతములయందు త్వం పదరూపంగా నున్నది క్షరమని, అఖండ రూపవమై కూటస్థమై అంతటాతనున్న దానిని (తత్) అక్షరోపాది గాను ఈ రెంటికి విలక్షణమై వేరైవున్నది, పురుషోత్తమ స్థానంగాను చెప్పబడుచున్నది. "కార్యోపాదిరయాం జీవ: కారణోపాధి ఈశ్వర:" అని శృతియందు కూడా చెప్పబడుచున్నది. ఒక్క పురుషోత్తముని సంకల్ప బలముచే కలిగిన మొదటి పరిణామమే అక్షరోపాధి(ఈశ్వరోపాధి) తదనంతర పరిణామంలో ఏర్పడినది క్షరోపాధి(జీవో పాధి) కందార్థ సాహిత్యమందు, వీటినే ప్రాగర్థ, చరమార్థ యోగములుగా పేర్కొనబడినది. (పిండ, బ్రహ్మాండ) పురుషోత్తమునికి అక్షర పురుషుడే ప్రపంచం. అక్షరపురుషునికి క్షర పురుషుడే ప్రపంచం ఏకైక ద్వంద్వము ద్వంద్వైక ఏకము.

## స్థూలసూక్ష్మ పరిణామక్రమము:-

ఒక పురుషోత్తముడే తన సంకల్ప ప్రభావముచే, క్షరాక్షర పురుషులుగా (ద్వయదోషం) తోచబడుచున్నాడు.

ఈసృష్టి పరిణామ క్రమమునకు అత్యంత మూలకారణము, ఆధారమూఅయి వున్నాడు. ఇందుకు ప్రమాణం, "ఊర్ధ్వమూల అధ:శ్శాఖ: అన్నిటికి మూలము ఆధారమై యున్న ఈ పురుషోత్తముడు, స్వత:సిద్ధమై వున్న పరిపూర్ణమందు మూలముగాని, స్థానముగాని లేక కలవలె తోచబడుచున్నాడు(అబీజవృక్షసంపన్నం)

భ్రాంతిరహిత విధానమందు పరిపూర్ణమందు లేక తోచబడుచున్న ఈ పరమ పురుషుడుడే కల. గురుబోధనే మెళకువచే ఈ కల పురుషుడు మేలుకొన్న గాని భ్రాంతి రహితము కలుగదు. శృతియందు మోక్షశబ్ధమునకు నిర్వచనము

భ్రాంతి రహిత మిదం మోక్షంగా చెప్పబడుచున్నది. అట్టి రహిత విధానమును సిద్ధాంతీకరిస్తూ ఈ కందపద్య రచన (క్షరాక్షరోపాధి ద్వయ దోషరహిత పరమ తత్వ కందములు) అను పేరున వ్రాయబడి యున్నది.

**గీ॥ శ్లో॥ ఉత్తమ పురుషస్త్వన్య:**
**పరమాత్మేత్యుదాహృత:**
**యోలోకత్రయమావిద్య భర్త్యవ్యయ ఈశ్వర:**
**యస్మాత్షర మతీతోహ మక్షరాదపిచోత్తమ:**
**అతోస్మిలోకేవేదేచ ప్రధిత: పురుషోత్తమ:**

అని భగవద్గీత యందు చెప్పబడుచున్నది. ఇంతేకాక శివరామదీక్షిత పీఠాధ్యక్షులైన శ్రీదయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారు తాము రచించిన "నిజ ప్రబోధ విధానము" అను గ్రంథము నందు పురుషోత్తమ నిర్ణయమును గూర్చి ఈ క్రింది విధముగా పేర్కొని వున్నారు. వార్తిక సిద్ధాంతము నందుగల బ్రహ్మపరిణామావస్థ కలిగినది.ఎట్లనగా వార్తిక నిర్ణయమగు ఉత్తమ పురుషుడు నిష్కామ స్వరూపుడు. అనగా అపేక్ష రహిత చేతనుడు. అందు వలన అచల పరిపూర్ణ ప్రబోధకు ఈపురుషరహితమునకే ప్రయత్నమొనర్చు చున్నారు.

కావున పాఠకులు పైన పేర్కొన్న గ్రంథకర్త గారి అభిప్రాయములన్నీ దృష్టిలో ఉంచుకొని సిద్ధాంతము పట్ల అవగాహన కల్గించుకొనుటకు వీలుగా ఈ వ్యాఖ్యానము వ్రాయబడియున్నదని గ్రహించగలరు. విజ్ఞులు సహృదయముతో ఈ రచన స్వీకరించచి నన్నాశీర్వదిస్తారని మనసారా ప్రార్థిస్తున్నాను. ఈ రచనను మాగురుదేవులైన శ్రీ సీతామహాలక్ష్మి సమేత సదానందశ్రీ రామచంద్రరావు రాజయోగీంద్రుల దివ్యశ్రీ చరణములకు ఒక పూజా పుష్పముగా సమర్పించుకొనుచున్నాను.

ఈ గ్రంథ ముద్రణ భారం అంతా తాము వహించి సర్వాంగసుందరముగా ఈ పుస్తక రూపములో తయారగుటకు కారకులైన శ్రీ శలా చంద్రశేఖర్, చి॥సౌ॥ శ్రీదేవి దంపతులకు శ్రీ గురు పరమాత్మ సమస్త శుభములు కలిగించు గాక. ఈ గ్రంథమునకు ద్రవ్య

సహాయమొనర్చిన శ్రీ అట్లూరి రామబ్రహ్మయ్య, శ్రీమతి నాన్‌బేబి సరోజిని గార్ని, వారి కుటుంబసభ్యులకు శ్రీ గురుపరమాత్మ ఆశీర్వచనములు సర్వదా ప్రసరించుగాక.

**ఇట్లు**
**గురుపాదరేణువు**
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# సభావిజ్ఞాపన

సభావిజ్ఞాపన అను పేరున ఈ కందపద్యరచన గావింపబడుచు, ఓ! కల నరులారా అని సంబోధించి ప్రారంభింప బడినది. ఇష్టదేవతా ప్రార్థన గాని, గురు ప్రార్థనగాని చేయకనే సరాసరిగా విషయ నిరూపణ గావించుచూ కల నరులారా, అని పేర్కొనుటలో ఈగ్రంథస్థ విషయము కలవంటిదని భ్రాంతి రహిత విధానమునకు, ఇందు చెప్పబడుచున్న ప్రబోధ మెళుకువ వంటిదని భ్రాంతి రహిత మిదం మోక్షం అను సూత్రాను సారంగా జనన మరణ భ్రాంతిరహిత విధానమునే పరమలక్ష్యంగా ఈ గ్రంథస్థ విషయమును అందుకు అనుకూలంగా మలచి జనన మరణములు కల వంటివని ఒక సత్యవస్తువునందు, ఈ జన్మ కర్మలకు కారణమగు వస్తువునకు, మూలముగాని, స్థానముగాని లేదని ఆరూఢ పరచుకొనుటయే మెళుకువని కలనుండి మెళుకువ చెందుటకు, గురుప్రబోధయే మార్గమని అట్టిబోధనా విధానము ఈ కంద పద్య రచనయందు స్పష్ట పరచబడు చున్నది అని గ్రంథకర్తగారు, ఈ గ్రంథము ద్వారా పాఠక లోకమునకు అందించియున్నారు.

**కం॥ ఈకల కందములను విను। ఓకల నరులార మీకు। నొప్పిద మైనన్। నే**
**కలగనుక రచించితి। యాకల మోక్షమును జెందన గునివి వినినన్॥ 1**

# ప్రతిపదార్థము

ఓ! కల నరులారా = ఎరుకనే కలయందుతోచబడుచున్న మానవులారా!
ఈ కల కందములను = స్వత:సిద్ధమైయున్న వస్తువునందు లేక తోచబడుచున్న లేని నాచే రచింపబడిన ఈ పద్యములు
కందము = మార్గము లేక విధానము
వినుడు = వినండి
మీకు ఒప్పిద మైనన్ = మీకు యిష్టమైన ఎడల
నే కలగనుక = నిజము కాని నాచే రచింపబడిన ఈ పద్యములు నిజము కాక పోయినా

ఈ కల=ఇందు నిర్దేశింప బడిన భావము, చెప్పేవారు వినేవారు కలలోనివారే మోక్షమును చెందనగు = జనన మరణ భ్రాంతి రహిత విధానమును ధృడ పరచును(కలలోనివారు మెలకువలోకి రావడం వంటిది)
ఇవి వినినన్ = ఆ సక్తి కలిగి విన్నవారికి

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు మూలముగాని, స్థానముగాని లేక తోచబడుచున్న ఎరుక, కలవంటిదని సిద్ధాంతము. యిట్టి కలయందు ఎట్టినిర్ణయములు నిలిచేవి కావు. జనన మరణ భ్రాంతి రహిత విధానమందు, "భ్రాంతి రహిత మిదం మోక్షం" అనుశృతిరీత్యా వున్న వస్తువును లేని తాను వున్నదని గ్రహించి, తానులేక పోవుటయే మోక్ష శబ్దమునకు అర్ధము. చెప్పుట, వినుట, వ్రాయుట, పేర్కొనుట అను నిర్ణయములన్నియు కల వంటివి. కాని వాటి ద్వారా పేర్కొనబడుచున్న సిద్ధాంతము సత్యము. ఇట్టి భావనా బలముచే ఈ పద్యములు నాచే రచింపబడినవి. ఆసక్తి గలవారు, శ్రద్ధా భక్తులతో ఈ రచనయందలి విధానము దృఢపరచుకొన్న మీదట జనన మరణములు, యిందుకు కారణమగు, వస్తువు, లేనివని నిజము కానివని ప్రబోధచే స్పష్ట పరచబడి భ్రాంతిరహిత విధానము మోక్షము స్వత:సిద్ధమగును.

**కం॥ మాటలేనట్టి బయలున। మాటగలిగె ననుట వినుట। మాయ గదయ్యా। మాట మాయైతె మానెను। మాటను మాటాడి మనము। మానుదమవలన్॥ 2**

## ప్రతిపదార్ధము

మాట లేనట్టి బయలున = ఎట్టిశబ్దముచేతసూచింపబడుటకు వీలు కానిపరిపూర్ణము నందు
మాటకలిగెననుట, వినుట = శబ్దజాలము (వాఙ్మయము) వుత్పత్తి అయినదని, అదివినుటచేత తరింపబడుదుమని అనుట

మాయ గదయ్యా = లేనివే సుమా
మాట మాయ అయితె మానెను = మాటలు నిర్ణయములు లేక పోయినను (నిజము లేక పోయిననూ)
మాటను మాటాడి = ఈ గ్రంథమును స్పష్టముగా విచారణ చేసి
మనము = చెప్పుట, వినుట అను మన మిరువురము
మానుద మవలన్ = ఆ పైన మననిర్ణయము విధానము విడచి వుండుదము

## తాత్పర్యము

అచల పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి మాట గాని, మనస్సుగాని, చెప్పుట, ఆలోచించుట అనునవి లేని వగును. "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసాస:" వున్న దానిని లేని ప్రాణమనంబులు (గుర్తు) వాక్కుచే వచింప జాలవు. అట్టి స్వత:సిద్ధమైన దానియందు, ఇతరమైనవి వుండుటకు వీలు లేదు. వున్నచో అవి నిజము కావని తెలియ వలెను. ఇట్టి విధానము ఆరూఢ పరచుకొనుటకై ఈగ్రంథ రచన గావింపబడినది. వీటిని స్పష్టముగా విచారణ చేసి వున్నది పరిపూర్ణము అని లేనిది ఎరుక యని దృఢ పరచుకొని అట్టి నిర్ణయమును కూడా విడచి వుండవలెను.

**కం॥ ఏకందము కాకందమె। మాకందఫలరస రుచిని మరిపించు రుచిన్।**
**మీ కందములైనను విను। డీ కందములన్ని సత్కవీంద్రుల్లారా॥3**

## ప్రతిపదార్థము

ఏకందము కాకందమె = ఏ పద్యానికి ఆపద్యమె
మాకంద ఫలము = మామిడి పండు
రసరుచిని = అందలి రసముయొక్క శ్రేష్టత్వాన్ని లేక మాధుర్యాన్ని
మరిపించు రుచిన్=అనుభవంలో ఆ రసానుభూతినికూడా లేకుండా చేయును
మీ కందము లైనను = వినాలనే తీవ్రమైన కోరిక కలిగివుంటె
వినుడీ కందములన్నీ = ఈ పద్యములన్నీ వినండి
సత్కవీంద్రులారా = గొప్ప పాండిత్యము కలవారా!

## తాత్పర్యము

ఈ కంద పద్యములు జనన మరణభ్రాంతి రహిత విధానమునకు మార్గములుగా చెప్పబడు చున్నవి. ఇందలి రసానుభూతి చాలా విలక్షణమై వున్నది. ప్రకృతి సంబంధమైన ఫలములలో మామిడిపండు నందు గలరసము, అందలిరుచిచాలా శ్రేష్టమైనవిగా లోకమందు చెప్పబడు చున్నది. అందలి మధురానుభూతి అనుభవించిన గాని తెలియనిది. శబ్ధ మాత్రము చేతనే ఒక దివ్యమైన అనుభూతిని కలిగించ గలుగు విధానము కలిగి యున్నది. ఈ గ్రంథము నందు చెప్పబడుచున్న కందపద్యములు అట్టి దివ్యమైన అనుభూతికలిగించ గలిగినవై యివి వినుట చేతనే అట్టి అనుభూతి కూడా మరిపించగలుగు లక్షణములు కలిగి వున్నవి. ఇట్టి భావములతో కూడిన వీటిని మీకిష్టమైనచో వరుస క్రమంలో శ్రద్ధ కలిగి వినవలసి వున్నవి. ఈ సభలో ఆశీనులైన వారంతా కవిత్వమందు, పాండిత్యమందు చక్కని ప్రజ్ఞా పాటవములు కలవారు కనుక వారికి వీటి విలువలను ప్రత్యేకముగా చెప్పవలసిన పనిలేదు అని తెలియ వలెను.

**కం॥ నే ఛందము జదివెరుగను। నా ఛందంబిదియు గురుని। నమ్మి
రచిస్తిన్। యీ ఛందపు పద్యములను। చూ చందరు నగకదిద్ద
జొరుడీ సుకవుల్॥ 4**

## ప్రతిపదార్థము

ఛందము చదివెరుగను = ఛందో శాస్త్రమును అభ్యసించలేదు
నా చందంబిది = నా అర్హత యోగ్యత ఏమిటనగా
గురుని నమ్మి రచిస్తిన్ = గురు కృపఅను అర్హత యోగ్యత కలిగి లేక పొంది ఈగ్రంథము రచించినాను
ఈ ఛందపు పద్యములను=ఈ విధముగా నాచేత వ్రాయబడిన ఈ పద్యములను
చూచి అందరూ = చక్కగా విని, పరిశీలించి
నగక = ఆక్షేపించక, తప్పులెంచక
దిద్ద జొరుడీ = సందర్భానుసారంగా, శాస్త్ర విధిని అనుసరించి

సు కవుల్ = చక్కటి, పాండిత్యముచే ఆరూఢత చెందినవారు

## తాత్పర్యము

పాండిత్యము నందు, శాస్త్ర మందలి విధి విధానము చక్కగా తెలుసుకున్న ఓ పండితశ్రేష్టులారా! ఈ గ్రంథ రచనను కేవలము గురు అనుగ్రహము అను అధికారంచే మాత్రమే జనన మరణ భ్రాంతి రహితము పొందు విధానము పొందు పరచబడి ఈ గ్రంథ రచన కావింపబడినది. ఇట్టి ఈ పద్యములను స్పష్టముగా పరిశీలించి మీరు శాస్త్ర విధానమునందు చెప్పబడిన విధి విధానములలో ఏమైనా లోపములున్నచో నిరభ్యంతరంగా ఎట్టి ఆక్షేపణ లేక సవరించ వలసినదిగా కోరుచున్నాను.

**కం॥ కథగాదు జననమరణ। వ్యథమానుటకై రచిస్తి వరకవు లారా। మధియించి చూచిదిద్దుడి। పథమేమాత్రంబు దప్పి। పారక యుండన్॥ 5**

## ప్రతిపదార్థము

వర కవులారా! = శ్రేష్టమైన కవిత్వము నందు పాండిత్యము కలవారు
కథ కాదు = ఈ గ్రంథము. పురాణములు ఇతిహాసముల వంటిదికాదు
జనన మరణ వ్యథ మానుటకై రచిస్తి = జన్మ కర్మల భ్రాంతి నుండి విడుదుల పొందుటకై ఈ రచన కావింపబడినది.
మధియించి +చూచి = చక్కగా పరిశీలించి
దిద్దుడి = సవరించండి
పథము = విధానము, మార్గము
ఏ మాత్రము తప్పక = ఏ విధమైన లోపము లేకుండా
పారక యుండన్ = స్పష్టముగా అందరూ గ్రహించ గలిగేలా

## తాత్పర్యము

శ్రేష్ఠమైన కవిత్వమునందు ఉనికి గలిగిన ఓ కవీశ్వరులారా! పరమ పురుషార్థమైన మోక్ష ప్రాప్తికి మార్గమును నిర్దేశిస్తూ ఈగ్రంథ రచన కావింప బడినది. సామాన్యదృష్టితో వ్యవహార శైలి కలిగి చెప్పబడుచున్న పురాణ,

ఇతిహాసముల వంటి కథలు కాదు. కావున ఈ గ్రంథమును చక్కటి వివేచనతో మధించి పరిశీలించి, శాస్త్రీయమైన విధానమందు ఏమైనా లోపము లున్నచో వాటిని స్పష్టముగా సవరించి ఈ గ్రంథమునకు ఇంకనూ విలువను పెంపొందించ వలసినదిగా కోరుచున్నాను.

**కం॥ తక్కువ పాండిత్యముచే। నిక్కేపండితులు మెచ్చ। నేరరు వీటిన్**
**యెక్కువ పాండిత్యముగల। చక్కని పండితులు మెచ్చిసరెనన్నట్లన్॥6**

## ప్రతిపదార్థము

తక్కువ పాండిత్యముచే = మిడిమిడి జ్ఞానము
నిక్కే పండితులు = అనుభవ జ్ఞానములేని అహంకారులు
మెచ్చనేరరు = గొప్ప వస్తువు కలిగినదిగా అంగీకరించరు
వీటిన్ = ఈ కందపద్యములను
యెక్కువ పాండిత్యము గల = చక్కటి అనుభవము, ఆరూఢత కలిగియున్న
పండితులు = పరిపూర్ణ భావజ్ఞులు
మెచ్చి = ఇందలి ఆధిక్యతను అంగీకరించి
సరెనన్నట్లన్ = చక్కగా బాగున్నవి అన్నట్లుగా

## తాత్పర్యము

పండితులు అనగా శాస్త్రార్థమును అందలి విధి విధానమును స్పష్టముగా తెలిసిఉన్నవారు అని సామాన్యార్థము. పండితా సమదర్శన: అని గీతయందు చెప్పబడుచున్నది. అనగా అఖండాత్మ దృష్టి కలిగినవాడు పండితుడు అని భావము. ఇది గాక "పండితా: నిర్విద్యా" అనగా నిర్విద్యాస్వరూపమైన పరిపూర్ణ భావమునందు ఉనికి కల్గి వున్నవారు పండితులుగా చెప్పబడుచున్నారు. ఇట్టి ఆరూఢత గల వారికి మాత్రమే ఈ కందపద్యములందు చెప్పబడుచున్న భావము స్పష్టముగా తెలియబడి ఆనందించెదరు.అనగా వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా ఉన్నది ఉన్నట్లుగా, లేనిది లేనట్లుగా వీరికి దృఢ పడగలదు. ఇట్టి ఆరూఢత లేక కేవలము

శబ్దజ్ఞానము మాత్రమే కలిగుండి అనుభవము ఆరూఢత లేనివారు ఎదుటివారి గొప్పతనాన్ని అంగీకరించలేని వారు, అహంకార విశిష్టులైన వారు ఈ గ్రంథమందలి భావమును గుర్తించలేరు.

**కం॥ సూరిజనులె యీ గ్రంథపు। సారము గనువారుగాని సంసార మహా। ఘోరవారాసి జేరిన। వారలు విని దీన్ని జూచి। వచి యింపుదురే॥ 7**

## ప్రతిపదార్థము

సూరి జనులు = పరిపూర్ణ భావమందు ఆరూఢత చెందినవారు
ఈ గ్రంథపు = ఈ గ్రంథమందలి
సారము = రహస్యము
కనువారు = గుర్తించగలవారు
సంసార మహాఘోరవారాసి చేరినవారలు=జనన మరణ చక్రములో పరిభ్రమించువారు
విని దీనిజూచి = దీన్ని పరిశీలించి
వచియింపుదురే=తాము గ్రహించిన యిందలి విశిష్టతను ఇతరులకు చెప్పజాలరు.

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా చెప్పబడుచున్న ఈ గ్రంథము, ఇందలి భావము, అట్టి స్థితియందు ఆరూఢతచెందినఈ పరిపూర్ణ భావజ్ఞులకే అర్థమై, వారుగ్రహించి, ఇతరులకు ప్రబోధించుటకు సమర్థులగుదురు. అట్లుగాక సామాన్యమైన పరిజ్ఞానముచే ఇందలి రహస్యమును ఇతరులు గ్రహింపజాలరు.

**కం॥ గొప్ప ప్రతిష్టకు మిక్కిలి। తిప్పలబడు నృతతికెపుడు దీరదు విననీ। యొప్పుల కుప్పగు బోధను। తప్పక నామాటనమ్ము। దగు తప్పనకన్॥ 8**

## ప్రతిపదార్థము

గొప్ప ప్రతిష్ఠ = గొప్పదైన ఆరూఢత లేక కీర్తి, పేరు
మిక్కిలి తిప్పలు పడు = ఎన్నో కష్టములకు సమస్యలకు లోనగు
నృతతి = జన సమూహము
ఎపుడు తీరదు = ఈ గ్రంథమును వినుటకు యిష్టపడరు
ఒప్పుల కుప్పగు=అత్యంతశ్రేష్టమైన భ్రాంతి రహిత విధానము దృఢపరచగలుగు
బోధను = మార్గమును
తప్పక నామాటనమ్ము = నే చెప్పినది వాస్తవము, యదార్థమని నమ్ముము
తగును = సరియైనది

## తాత్పర్యము

ప్రతి మనిషి తన జీవన కాలమందు మరణా నంతరము కూడా తనను గూర్చిన గొప్పతనము శాశ్వతముగా నిలుచు లాగున ప్రయత్నించును. అందుకు తగిన ఏర్పాట్లు కూడా గావించును. సామాన్య వ్యక్తిగా వున్నభావము ఒక గొప్ప తత్త్వముగా మారుట కన్నగొప్పవిషయముండదు. అదియే అహం బ్రహ్మోస్మి అను భావము. దీనికై ప్రయత్నించు వారు, ఇతర గ్రంథములు, అందలి అంశములు పరిశీలించుటకు అంగీకరించరు. ఈ గ్రంథమందలి భావము "అహం పదార్థరహిత:" అను లక్ష్యముతో వ్రాయబడి వున్నది. జన్మ కర్మల రహితమునకు వున్నతమైన మార్గముగా సూచింపబడుచున్నది. కావున యిందలి భ్రాంతిరహిత విధానము సామాన్యులకు అంతు చిక్కనిదిగా వున్నదని భావము.

**కం॥ మెప్పై ్న బోధగలమా। యప్పలు తప్పుంటె దిద్దు। డదినా కిష్టం। బిప్పగిది కందములనే। జెప్పితి యీ కవిత జూచి। శిడిముడి పడకన్॥ 9**

## ప్రతిపదార్థము

మెప్పైన బోధగల = గొప్పదైన పరిపూర్ణ భావము నందు
మా అప్పలు = ఈ సోదరులంతా

తప్పుంటె దిద్దుడి = ఏమైనా గుణదోషములున్నసవరించండి
అది నాకిష్టము = అట్టి సవరింపునకు నాకెటువంటి అభ్యంతరము వుండదు
ఇప్పగిది కందములు = శ్రేష్టమైన ఈ కందపద్యములు
నే జెప్పితి = నేను చక్కగా ఈ గ్రంథము నందు వివరించినాను
ఈ కవిత చూచి=ఇందలి ఈ గ్రంథమునందలి విషయ నిరూపణ గమనించి
శిడి ముడి పడకన్ = కోపమును, చీకాకును ప్రదర్శించకుండ

## తాత్పర్యము

మానవజీవితమునకు చరమలక్ష్యమైన జన్మరహిత విధానమునకు శ్రేష్టమైన మార్గముగా సూచింపబడుతూ ఈ గ్రంథము నాచే రచింపబడినది. ఇట్టి భావమునందు నిష్ణాతులైన మహాత్ములు ఈ రచనయందు గల దోషములను ఎంచి సవరించినచో నా కెట్టి అభ్యంతరము ఉండదు. ఆ విధముగా ఈ రచన గావింపబడి ఉన్నది. అందుచే ఈ సభలోని పండితులు దీనిని చక్కగా పరిశీలించి ఎట్టి తిరస్కారభావము కోపము లేక గ్రంథ పరిశీలన గావింపుడని భావము.

కం॥ ఒకసారియైన వినకన్। వికవికనవ్వేటి కుకవివేత్తల్లారా।
ప్రకటించక మీశౌర్యం బికదాచుట మీకుమాకు హితమై
యొప్పున్॥ **10**

## ప్రతిపదార్థము

ఒక సారియైనా వినకను =గ్రంథకర్త అభిప్రాయము అతనిద్వారా స్పష్టముగా ఒక పర్యాయమైనా తెలుసుకొనే ప్రయత్నం చేయక
విక విక నవ్వేటి = పక ఫక నవ్వుతున్న
కుకవి వేత్తలు = ఆరూఢత, అనుభవము లేని పండితులు
మీ శౌర్యము ప్రకటించక = మీ ప్రతాపమును గొప్పతనమును ప్రదర్శింపక
ఇక దాచుట = మీ యందే దాచి పెట్టియుండుట
మీకు, మాకు హితమై యొప్పున్ = చెప్పేవారికి, వినే వారికి మంచి మార్గముగా చెప్పబడును.

## తాత్పర్యము

నూతన గ్రంథమును గ్రంథకర్తగారి ద్వారా ఒక్కసారైనా విని అందలి భావములు, విలువలు తెలుసుకొని ఉండుట ఒక ముఖ్యలక్షణము. దీనిని కవిహృదయము అందురు. ఏ అంశములు ఏఏ సందర్భములో ఎందుకు చెప్పవలసి వచ్చిందో రచయిత తన హృదయమును విప్పి చెప్పును. అట్టి ప్రయత్నమేమాత్రము చేయక వారికి కలిగిన మిడి మిడి జ్ఞానముచే ఈ గ్రంథమును పరిశీలించి గ్రంథమును గూర్చి ఒక అభిప్రాయము కలిగించు కొనుట తగదు. అన్నీ తెలుసుకొన్నట్లుగా నటించుచూ, ఇతరుల గ్రంథమునందలి దోషములు ఎంచి గర్వముచే అపహాస్యము చేయుట తగదు. అట్టివారెవరైనా ఈసభయందుంటే మీ ప్రతాపము మీయందే యిముడ్చు కొనవలసి యున్నది. ఇది ఉభయులకు శ్రేయస్కరము.

కం॥ స్వచ్ఛాన్వయ గుచ్ఛములని। పృచ్ఛయొనర్చెదరు కవులు
పృథుయశులారా। యిచ్ఛ జనించిన జదువుడీ। యచ్ఛా
పద్యంబులివ్వి యాసాంతముగాన్॥ 11

## ప్రతిపదార్థము

పృథు యశులారా = పృథివి యందు చక్కటి కీర్తి సంపాదించిన వారు
స్వచ్ఛాన్వయ గుచ్ఛములని = స్వచ్ఛమైన, శుద్ధమైన, నిర్మలమైన భావమును, సిద్ధాంతీకరించు పద్యములు
పృచ్ఛయొనర్చెదరు = లేనిపోని ప్రశ్న పరంపరలు కలిగించెదరు
ఇచ్ఛజనించిన చదువుడీ=నీ కిష్టమైన ఎడల ఈ గ్రంథమును పరిశీలించండి
యచ్ఛా పద్యము లివ్వి = అందరికీ అవసరమైన ప్రయోజనాన్ని కలిగించే లక్షణములు గల పద్యములు
ఆ సాంతము గాన్ = మొదటినుంచి చివరిదాకా (పూర్తిగా)

## తాత్పర్యము

భూమండలమందు కీర్తి గడించిన ఓ సదస్యులారా! ఈ క్రింది

పద్యములయందు నిర్మలమైన, స్వచ్ఛమైన అతీతమైన శబ్ధములచే భ్రాంతి రహితవిధానమునకు మార్గముగా చెప్పబడుచున్న పరిపూర్ణ భావము పేర్కొనబడుచున్నది. వీటి విలువలు తెలియక ఈర్ష్య అసూయలతో, మిడి మిడి జ్ఞానముచే లేనిపోని వ్యర్థమైన ప్రశ్నలువేయక క్రొత్త విషయ నిరూపణ తెలుసుకోవాలనే తలంపుతో ఇష్టము కలిగించుకొని శుద్ధమైన ఈపద్యములను మొదటినుండి చివరిదాకా వినవలసి యున్నదని తెలియ వలెను.

**కం॥ తక్కిన బోధలవలెనిది। చిక్కులుగల బోధగాదు। చేపట్టదగున్। మక్కువతో**
**మీ మునుపటి। చిక్కుల బోధలను చూర్ణ జెక్కిముదమునన్॥ 12**

## ప్రతిపదార్థము

తక్కిన బోధలవలె నిది = ప్రపంచములో చెప్పబడు మార్గములవలె
చిక్కులు గల బోధకాదు = సమస్యలతో, సాధనలతో కూడుకున్న విషయనిరూపణ ఇందు లేదు
చేపట్ట తగున్ = అందరు విని చదివి తరింప వలసి వున్నది(తెలుసుకోవలసి వున్నది)
మక్కువతో = ప్రేమతో, భక్తితో, శ్రద్ధతో
మీ మునుపటి చిక్కుల బోధలను = జన్మరహిత విధానమునకు ఇంతకు పూర్వము సూచించబడిన భిన్న భిన్న మార్గములు
చూర్ణ చెక్క = రద్దు పరచి, లేకుండా చేసి
ముదము నన్ = సంతోషముతో

## తాత్పర్యము

పరమ పురుషార్థమైన మోక్ష ప్రాప్తికి పూర్వమునుండీ ఎందరో మహాత్ములచేత ఎన్నెన్నో మార్గములు ప్రతిపాదింపబడి సిద్ధాంతములుగా, మతములపేరుతో సమాజములో ప్రచారములో ఉన్నవి ఎన్నియో కష్టతరమైన సాధనలతో ప్రతిపాదింపబడి ఉన్నవి. అట్టి మార్గములన్నిటినీ మించి కేవలము బోధనాపద్ధతి చేత మాత్రమే సర్వభ్రాంతి రహిత విధానము ఎట్లు కలుగ గలదో ఈగ్రంథము నందు సూచింపబడుచున్నది. అందరికీ అవసరమై అట్టి ప్రయోజనాన్ని కలిగించేదై ఉన్నది. ప్రేమతో, భక్తి శ్రద్ధలతో

ఈ గ్రంథము పరిశీలించిన వారికి ఈ మార్గము స్పష్టముగా గోచరింపబడి అంతకు పూర్వము వారియందుగల కష్టతరమైన, భ్రాంతులకు కారణమైన మార్గములన్నియు లేనివై, సంతోషముతో చక్కటి మార్గమును, గ్రహించితిమను తృప్తి ఆనందము కలిగించును.

**కం॥ సకల కార్య ప్రయత్న। జనకమగు వస్తువును బట్టి నలచి వైచుదీన్నొకసారి వినిన జదివిన। నిక నింతకు యెక్కువైన। వేబోధలయా॥ 13**

## ప్రతిపదార్థము

సకల కార్య ప్రయత్న జనకమగు వస్తువును = సమస్త సృష్టికి జన్మ పరంపరలకు అత్యంత మూలకారణమై యున్న అధిష్టాన వస్తువును
పట్టి = వస్తు నిశ్చయ పూర్వకముగా చూపించి
నలచి వైచు = లేకుండా చేయును(రద్దు పరచును)
దీన్నొక సారి వినినా చదివినా= ఈగ్రంథమును ఒకసారి తనకు తానుగా చదివినా, ఇతరులద్వారా విన్నా
యిక = యికపై
యింతకు = ఈ గ్రంథమునకు
ఎక్కువైన = గొప్పవైనవి
ఏ బోధలయా = యితరమైన మార్గములేవియు లేవు

## తాత్పర్యము

ఒక్కసారైనా ఈగ్రంథమును అర్హత గలవారిద్వారా వినినగాని, చదివినగాని, జన్మకర్మలకు, సృష్టికి,అత్యంత మూలకారణమగు వస్తువును వస్తునిశ్చయ పూర్వకముగా చూపించి, దృఢపరచి, సమూలముగా రద్దుపరచబడు విధానము తెలియబడును. ప్రపంచములో ఇంతకు మించి తెలియబడు మార్గములు వేరే లేవు.

**కం॥ కేరుచు మిము వినుమనినే సారెకు మీ చుట్టు దిరిగి। సన్నుతి**

**జేసే। తోరపు బోధకు మూలం బైరెవ్వరొ వార్నిదలచి। వరుసనుతింతున్॥ 14**

## ప్రతిపదార్థము

కేరుచు = విధేయతతో, ప్రేమతో
మిము = ఈ సభలోని వారిని
వినుమని = ఈ కందపద్యములను వినండి అని
సారెకు = మాటి మాటికి
మీ చుట్టూ తిరిగి = మిమ్మల్ని సమావేశపరచి
సన్నుతి చేసి = ప్రార్థిస్తూ
తోరపు బోధకు = శ్రేష్ఠమైన ఈ పరిపూర్ణబోధకు
మూలంబైరెవ్వరో = ఎవరినుంచి ప్రారంభింపబడి ఇప్పటి వరకు మనదాకా సంప్రాప్తింప బడినదో
వార్ని తలచి = వారందర్నీ స్తోత్రము చేస్తూ పేరు పేరున
వరుస నుతింతును=క్రమములో ప్రార్థనా రూపంగా వార్ని గూర్చి వివరించెదను

## తాత్పర్యము

ఓ సభికులారా! మాటి మాటికి అత్యంత భక్తి శ్రద్ధలతో ప్రేమతో మీ అందరిని వినండి అని మనవి చేస్తున్న గొప్పదైన ఈ పరిపూర్ణభావము ఎవరి నుండి ప్రారంభించబడి, మన వరకూ ప్రాప్తింపబడు చున్నదో అట్టి మహనీయులను పేరు పేరున ప్రార్థన చేస్తూ మీకు పరిచయము చేస్తున్నాను.

**కం॥ ఈక్షితి శివరామాహ్వాయ। దీక్షితులకు బోధజేసి। దిద్దినసామ్యా। దక్షుని శ్రీధరమూర్తిని। నిక్షేపము గాదలంచి। నేవినుతింతున్॥ 15**

## ప్రతిపదార్థము

**ఈ క్షితి** = ఈ భూమండలమందు
**శివరామాహ్వాయదీక్షితులకు** = శివరామ దీక్షితులను పేరుగలవారికి
**బోధ జేసి** = చక్కగా ధృడ పరచి, లేక ఆరూఢ పరచి

దిద్దిన = సవరించిన లేక సంస్కరించిన
సామ్యోదక్షుని = చక్కటి సమర్థత, యోగ్యత కలిగిన
శ్రీధర మూర్తిని = శ్రీధర స్వామి అనిపేరు గలిగిన మహాత్ముని
నిక్షేపముగా = మూలధనముగా లేక గుప్త నిధిగా
తలంచి = భావించి
నే వినుతింతున్ = నేను వారిని భక్తి శ్రద్ధలతో సవినయముగా ప్రార్థిస్తున్నాను

## తాత్పర్యము

ఈ భూమండలమందు రామడుగు అను వంశమునందు శివరామ దీక్షితులను పేరుగల మహనీయునకు జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా చెప్పబడుచున్న ఈ పరిపూర్ణ బోధను చక్కగా వివరించి దృఢపరచి సర్వ సందేహరాహిత్యము కలిగించి దిద్దబడిన (చక్కగా మలచి) అత్యంత సమర్థుడగు శ్రీధరస్వామి అను పేరుగల మహాత్ముని అత్యంత ప్రేమతో, భక్తితో నమస్కరిస్తున్నాను. వారినీ సాంప్రదాయమునకు మూలధనముగా(దాచి ఉంచిన నిధిగా) నేను స్తుతించుచున్నాను.

ప్రారంభములో అచలఋషి సాంప్రదాయముగా ఈ భావము సిద్ధాంతీకరింపబడి బ్రహ్మైవాహ మస్మి, అహంపదార్థ రహిత: అను లక్ష్యములతో సమాజములో ప్రచారములో ఉన్నది. ఇందు మరల ఆదిగురువగు దక్షిణామూర్తి సాంప్రదాయము పేర, శ్రీమహావిష్ణు సాంప్రదాయము పేరుతో శ్రీ మహావిష్ణువు, సూర్యుడు, యాజ్ఞవల్క్యుడు, జనకుడు, శుకుడు, సాందీపుడు, శ్రీకృష్ణుడు, అర్జునుడు, ఉద్ధవుని వరకు ద్వాపరయుగము చివరదాకా ఈ పరంపర ప్రచారంలో నున్నది. గుహ్యాతి గుహ్యమై గురుశిష్యన్యాయముగా మాత్రమే ప్రచారములో ఉన్న ఈ భావమును మొదటిసారిగా జగద్గురువగు శ్రీకృష్ణ భగవానుడు తన ప్రియ శిష్యుడగు అర్జునునకు సర్వోపనిషత్సారమైన భగవద్గీత యందు ఈ భావమును వివరించియున్నారు. "అచలోయం సనాతన: రహస్య మేతదుత్తమమ్" అను శబ్దములచే దీని విలక్షణత్వమును, లక్ష్యలక్ష్యార్థముగా

సూచింపబడి యున్నది. కాలక్రమములో మరుగై కలియుగారంభములో ఈ భావము బ్రహ్మానంద స్వామి, రామానంద స్వామి, జ్ఞానేశ్వరుడు, సహజానందుడు, అంబికాశివయోగి, వేమన, తిరువేంగళార్యులు, శ్రీధరస్వాముల వరకు ప్రచారములోనికి వచ్చినది.

**కం॥ దక్షిణామూర్తి యనదగు నీక్షితి శివరామ నామ దీక్షితులనుచున్।**
**వీక్షింతురార్యులతని క। పేక్షను దండములు బెట్టి ప్రేమ నుతింతున్॥ 16**

## ప్రతిపదార్థము

**ఈక్షితి** = ఈ భూమండలమందు
శివరామ దీక్షితులనుచున్ = శివరామ దీక్షితులను పేరుతో అత్యంత సమర్థత కలిగిన మహాత్ముని
దక్షిణామూర్తి యనదగు = ఈ బ్రహ్మవిద్యకు అది గురువగు దక్షిణామూర్తితో పోల్చదగినవారుగా
వీక్షింతురు + ఆర్యులు = మహనీయులైనవారు పై విధముగా శివరామదీక్షితులను గౌరవించెదరు
**అతనికి** = అట్టి మహనీయుడైన శివరామ దీక్షితుల వారికి
**ఆపేక్షను** = అత్యంత ప్రేమతో
దండంబులు పెట్టి = సాష్టాంగ నమస్కారము చేసి
ప్రేమను తింతున్ = వారి అనుగ్రహము నాపై కలుగుటకు భక్తితో స్తోత్రము **చేయుచున్నాను**

## తాత్పర్యము

ఓ సదస్యులారా! ఈ ప్రపంచమందు రామడుగు అను **ఇంటి**పేరుతో శివరామ దీక్షితులు అను పేరుగల మహాత్ములు కలరు. **వీరిని** ప్రపంచంలో ప్రసిద్ధిచెందిన మహాత్ములందరు బ్రహ్మ విద్యకు అది **గురు**వగు దక్షిణామూర్తి(శ్రీబ్రహ్మవిద్యా గురువు) తో సమానముగా పోల్చుకొని గౌరవించెదరు. అట్టి మహాత్మునికి అత్యంత భక్తిశ్రద్ధలతో సాష్టాంగ

నమస్కారము చేసి వారి అనుగ్రహము ద్వారా ఈపరిపూర్ణ భావమును తెలిసికొనుటకు మరలా వారికి నమస్కరించుచున్నాను.

**కం॥ ఆదీక్షితుల కృపకుదా। పాద్దైయప్పయ్య మంత్రి పరి
యించెనుయీ। మేదిని తద్భోధనతని। పాదములకు
నుతులొనర్చి ప్రార్థింతు మదిన్॥ 17**

## ప్రతిపదార్థము

ఆదీక్షితులకృపకు = మహాత్ములైన శివరామ దీక్షితుల వారి అనుగ్రహమునకై
దా పాద్దై = పాత్రుడై
పరియించెను = ఈ భావమును శ్రద్ధగా వారి ద్వారా దృఢ పరచుకొనెను
అప్పయ్య మంత్రి = అప్పయ్యను పేరుగలిగిన మహాత్ముడు
ఈ మేదిని = ఈ పద్ధతిని, ఈభావమును లేక సాంప్రదాయమును
తద్భోధను = శ్రేష్టమైన ఈ పరిపూర్ణ భావమును
అతని పాదములకు = అప్పయ్య మంత్రిగారి యొక్క దివ్య చరణములకు
నుతులొనర్చి = సాష్టాంగ నమస్కారము గొప్పవిగా,శ్రేష్టమైనవిగా భావించి
ప్రార్థింతు మదిన్ = త్రికరణ శుద్ధిగా ఆత్మనివేదన గావించుకొనుచున్నాను.

## తాత్పర్యము

అత్యంత యోగ్యులు, సమర్థులైన శివరామదీక్షితుల వారిని ఆశ్రయించి, సేవించి వారి అనుగ్రహముచే ఈ పరిపూర్ణ భావమును దృఢపరచుకొన్న మహనీయుడగు కంబాలూరి అప్పయ్య మంత్రి గారిని, మనస్సులో తలంచుకొని వారి అనుగ్రహము కొరకు సాష్టాంగ నమస్కారమును సమర్పించుకొనుచున్నాను.

**కం॥ నుతిజేసెద నప్పయ్యన్ గతికై కొల్చితడుబోధ గనెనో నేనా। ప్రతిలేని
పరశురామా। క్షితిసుర వంశమణియైన। సీతాపతికిన్॥ 18**

## ప్రతిపదార్థము

నుతి చేసెద = నమస్కరించెదను

అప్పయ్యను = అప్పయ్య మంత్రిని
గతికై = జనన మరణ భ్రాంతి రహితమునకై
కొల్చి= సేవించి
అప్రతిలేని = అట్టి సాటిలేని
అతడు బోధగొనెను = శ్రేష్టమైన పరిపూర్ణభావమును దృఢపరచుకొనెను
క్షితి = భూమండలమందు
పరశురామ = పరశురామ అను వంశమునందు
సురవంశ మణియైన = దైవాంశ సంభూతుడైన, బ్రాహ్మణ వంశమందు
మణియైన = శ్రేష్టుడైన
సీతాపతి = సీతారామస్వామి

## తాత్పర్యము

ఈ ప్రపంచమందు పరశురామ అను పేరున దైవాంశ సంభూతులైన బ్రాహ్మణ వంశమునందు రత్నము వంటి యోగ్యమైన సీతారామస్వామి అను పేరుగల మహాత్ముడు జనన మరణ భ్రాంతి రహితమునకు అప్పయ్య మంత్రి గారిని ఆశ్రయించి వారి అనుగ్రహమును సంప్రాప్తించుకొని ఈ పరిపూర్ణ భావమును దృఢపరచుకొన్నవారు అట్టి మహాత్ముని వారి అనుగ్రహము కొరకై మనసారా ప్రార్థించు చున్నాను.

**కం॥ బుచ్చి వెంకమ్మ తల్లిని। చచ్చెర పెండ్లాడి కాశి సేతు వదాకన్।**
**విచ్చలవిడి। యెగజల్లెను। సచ్చరితుల కచలబోధ సాకల్యాము**
**గాన్॥ 19**

## ప్రతిపదార్థము

బుచ్చి వెంకమ్మతల్లి = బుచ్చి వెంకమ్మ అనుపేరుగల కులస్త్రీని
చచ్చెర పెండ్లాడి = సాంప్రదాయ బద్ధముగా వివాహము చేసుకొని, గృహస్థ ధర్మమందుండి
కాశీ సేతువు దాకన్ = కాశీ నుండి రామేశ్వరము వరకు
విచ్చలవిడిగా ఎగజల్లెన్ = దాపరికము లేకుండా అందరికీ అర్ధంఅయ్యేలా

ప్రచారము గావించెను
సచ్చరితులకు = యోగ్యత కలిగిన సత్పాత్రులకు
అచలబోధ = ఈ పరిపూర్ణ బోధను
సాకల్యముగాన్ = చక్కని వివరణతో కూడి అర్థం అయ్యేలా

## తాత్పర్యము

పరశురామ సీతారామస్వామిగారు, బుచ్చి వెంకమ్మ అని పేరుగలిగిన పుణ్యస్త్రీని సాంప్రదాయబద్ధంగా వివాహము గావించుకొని గృహస్థాశ్రమమునందే ఉండి వారు ఆరూఢపరచుకొన్న ఈ పరిపూర్ణ భావమును మోక్షపురి అని చెప్పదగు కాశీనుండి పాప (దోష) హారిణి అని చెప్పబడు రామేశ్వరం దాకా పర్యటిస్తూ యోగ్యులైన, లేక సత్పాత్రులైన వారికి జనన మరణ భ్రాంతి రహిత విధానము కొరకు ఒక ఉన్నతమైన మార్గముగా ఈ భావమును ప్రచారము చేసి యున్నారు.

**కం॥ ఆ సీతాపతి నతివి। శ్వాసమునం గొల్చికొంటి సర్వేశ్వరుడం**
**చీసద్బోధను తేటగ। జేసితినివి సకల జనులు చెవియొగ్గి**
**వినన్॥ 20**

## ప్రతిపదార్థము

ఆ సీతాపతిని = సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడైన సీతారామ స్వామి వారిని
అతి విశ్వాసమున = అత్యంత భక్తి శ్రద్ధలతో
కొల్చి కొంటి = పూజించి లేక అర్చించి
సర్వేశ్వరుడనుచు = సాక్షాత్ పరబ్రహ్మస్వరూపుడుగా
ఈ సద్బోధను = శ్రేష్టమైన ఈ పరిపూర్ణ బోధను
తేటగా జేసితిని = వివరించి చెపుతున్నా
ఇవి = ఈ పద్యాలు
సకల జనులు = మానవో పాదిలోనున్న వారందరూ
చెవి యొగ్గి వినన్ = శ్రద్ధ భక్తులతో విన్నవారికి

## తాత్పర్యము

పరశురామ సీతారామ స్వామి వారిని ఆశ్రయించి అత్యంత భక్తి శ్రద్ధలతో సేవించి, సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపునిగా భావించి వారనుగ్రహముచే గ్రహించిన ఈ భావమును సకల మానవాళికి స్పష్టముగా గ్రహించులాగున ఈ కందపద్యముల రూపములో విన్నమాత్రముననే గ్రహించ గలిగేలా రచించి మీ ముందుంచినాను.

## గ్రంథకర్త వంశావళి

కవిత్వమందు కవి తాను రచించిన గ్రంథమును ప్రపంచములో పరిచయం చేయుటకు ముందుగా తనను తానుగా సభకు పరిచయం గావించుకొనుట ఒక ముఖ్యమైన సాంప్రదాయముగా చెప్పబడుచున్నది. ఏలననగా ఒక వ్యక్తి ఔన్నత్యమునకు, ప్రతిభకు వారుపుట్టిన వంశము, జన్మకు కారణమైన తల్లిదండ్రులు, జ్ఞానమునభివృద్ధి చేయు గురువు, ధర్మాచరణలో కలిసి ప్రయాణించు సహధర్మచారిణి పరంపరా కారణముగా చెప్పబడుచున్నారు. ఒక్కొక్కస్థాయిలో, వయస్సులో పైవారిచే సంస్కరింపబడుచూ, సమగ్రమైన పరిపూర్ణత్వమును పొందవలసియున్నది. పైన పేర్కొన్న పాత్రలన్నియు గుణ దోషముల రెంటికీ కారణముగా నున్నవి. కావున పైవాటి విలువలు, ప్రయోజనములు ఏకమై తనకు ఈ పరిపూర్ణ భావము సంప్రాప్తింపబడుటకు ఎట్లు కారణమగుచున్నవో ఈశీర్షిక ద్వారా ఈగ్రంథకర్త మనకు తెలియ పరచు చున్నారు.

**కం॥ భాగవత వంశభవుడను। భాగవతోత్తముల పాద పద్మంబులకున్**
**సాగిలి మ్రొక్కేవాడను। బాగుగ నను జనులు కృష్ణభట్లందు**
**రిలన్॥** **21**

## ప్రతిపదార్థము

భాగవత వంశ భవుడన్ = భాగవతులు అను పేరు కల వంశమునందు జన్మించిన వాడను

భ = భాగవతము, భక్తి
గ = జ్ఞానము
వ = వైరాగ్యము
త = తత్వ శోధన
భాగవతోత్తముల పాద పద్మములకున్ = ఇట్టి భక్తి, జ్ఞానవైరాగ్య, తత్త్వముల యందువున్నతమైన ఆరూఢత చెందివారి దివ్యశ్రీ చరణములకు
సాగిలి = వినయముతో, భక్తితో
మ్రొక్కే వాడను = సాష్టాంగ నమస్కారముచేయు వాడను
బాగుగ = శ్రేష్టముగ
నను = ఇట్టి జీవన విధానము కలిగిన నన్ను గూర్చి
జనులు = ఈ ప్రపంచంలో వున్న ముముక్షువులు
యిలన్ = ఈప్రపంచంలో
కృష్ణ భట్లందురు = కృష్ణదాసు అను పేరున పిలుస్తారు

## తాత్పర్యము

భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వాన్వేషణ అను అంశమునందు కీర్తి గడించిన భాగవతులు అను ఇంటిపేరుగల వంశమునందు జన్మించిన వాడను, నిరంతరము భాగవత లక్షణము కలిగి పేరు ప్రఖ్యాతులు పొందిన మహాత్ముల, పాదపద్మములకు నమస్కరించి వినయ విధేయతలతో వారు ప్రబోధించు అనుభూతమైన అంశములను వివరంగా తెలుసుకొని అట్టి భాగవత లక్షణముతో జీవించు చున్న నన్ను ఈ ప్రపంచములోనివారు గమనించి "కృష్ణ భట్టు" అను వ్యవహార నామముతో పిలువ బడుచున్నవాడను.

**కం॥ ధారుణ్యా త్రనసూయలు వీరేయని జనులు బొగడ। వెలసిన వారల్। నారాయణ జానకి యను వారిరువురుగన్న యట్టి వాడను సుమీ॥ 22**

## ప్రతిపదార్థము

ధారుణి = ఈ ప్రపంచమందు అత్రి, అనసూయలు = సప్త మహర్షులలో ముఖ్యుడైన అత్రి, మహా పతివ్రతలలో శ్రేష్ఠురాలైన అనసూయ
అత్రి = అనగా త్రిగుణములైన సత్వరజస్తమో గుణములు మీరిన అధిష్టాన పరబ్రహ్మము
అనసూయ = అనగా జీవసృష్టియందు అసూయ అను లక్షణమును కలిగుండి, మహావాక్యపు వుపదేశముద్వారా బ్రహ్మము యొక్క జ్ఞానము పొంది, అసూయ అనులక్షణమును విడచి యుండుట
వీరేయని = నాతల్లి దండ్రులను చూచి
పైన వుదహరించిన పుణ్య పురుషులు వీరే నని
జనులు పొగడ = ప్రపంచములోని వారంతా కీర్తించు చుండగా
వెలసిన వారల్ = ఆదర్శ దంపతులై జీవిస్తున్న వారికి
నారాయణ,జానకియను వారిరువురు = నారాయణభట్టు జానకమ్మ అను పేరుగలవారిద్దరు
కన్నట్టి వాడను సుమ్మీ = పైన పేర్కొన్న తల్లి దండ్రులకు నేను జన్మించి యున్నాను

## తాత్పర్యము

నారాయణభట్టు, జానకమ్మ అను పుణ్య దంపతుల గర్భ వాసమున కృష్ణభట్టు అను పేర జన్మించి యున్నవాడను. నాతల్లిదండ్రులను వారిజీవన విధానాన్ని ఈప్రపంచములోనివారుగ్రహించి, పుణ్యపురుషులై దత్తాత్రేయ మహర్షికి జన్మ కారకులైన అత్రి మహర్షి, అనసూయలతోపోల్చి జనులచే స్తుతింపబడుచున్న పుణ్యపురుషులు ఇట్టి వారి గర్భ వాసమున నేను జన్మించి యున్నాను.

## గ్రంథ విషయము

ఏ కవియైనా తాను రచించిన గ్రంథమును గూర్చి సభకు పరిచయంచేయడంలో గ్రంథమును గూర్చిన ఇతివృత్తమును లేక

ముఖ్యాంశమును క్లుప్తముగా సభముందుంచుట ఒక సాంప్రదాయముగా చెప్పబడుచున్నది. గ్రంథ పరిశీలనకు, శ్రవణమునకు ఇది అత్యంత అవసరమై వున్నది. ఆసక్తి కలిగినచో విషయ నిరూపణకొరకు శ్రద్ధాభక్తులు కలిగి గ్రంథమును పఠన, శ్రుతమును చేయ. టకు ఇష్ట పడెదరు. కావున గ్రంథస్త విషయమును క్లుప్తముగా (ఒక శాంపిల్) ఈపద్యముల ద్వారా మనకు తెలియ పరచుచున్నారు.

**కం॥ ఆనేనొనర్చినాడను। యీ నిజకందముల। గ్రంథమెప్పుడు దీనన్**
**వీనులవిని కన్నులగని। రేనట్టి జనంబుబల్కునే? నేననుచున్॥23**

## ప్రతిపదార్థము

ఆ నేను = పైన పేర్కొన్నవిధముగా యోగ్యతతో పాత్రతతో పరిపూర్ణ భావమందు సమగ్రమైన ఆరూఢతచెంది
ఒనర్చినాడను = గ్రంథమును వ్రాసినాను
ఈ నిజ కందముల గ్రంథము = శ్రేష్టమైన వాస్తవమైన అంశములను చెప్పబడుచున్న ఈ కందపద్యముల గ్రంథము
ఎప్పుడు దీనన్ = ఎల్లపుడు దీనిని
వీనుల విని = చెవులారా విని
కన్నుల గని రేని = వస్తునిశ్చయ పూర్వకముగా ఆరూఢపరచుకొన్న వారికి
అట్టి జనంబు = ఆవిధంబుగా ఆరూఢత చెందిన మహాత్ములు
పలుకునే? నేననుచున్ = నేను అను అహంకారము (గుర్తు) వారికింక మిగిలి యుండదు

## తాత్పర్యము

పై కందములయందు చెప్పబడుచున్న గురు పరంపరలో ప్రవేశించి, యోగ్యులైన తల్లిదండ్రులు, వంశము పరమ కారణములు కాగా దిద్ది తీర్చగలుగు సమర్థులైన గురుమూర్తి యొక్క అనుగ్రహ విశేషముచే జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు నేదృఢపరచుకొన్న పరిపూర్ణ భావము వున్నది వున్నట్లుగా, వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా ఈ

పద్యములయందు ప్రతిపాదిస్తూ మీముందుంచినాను. వీటిని చెవులారా విని మనసారా వస్తునిశ్చయపూర్వకముగా దృఢపరచుకొన్నవారికి నేననే గుర్తు(నేనను అహంకారము) మిగిలి యుండదు.

**కం॥ చిల్లరబోధలనన్నిటి నొల్లరు నిజబోధ దెలిసి యొప్పెటి పెద్దల్।**
**పొల్లని యందుకె నేనవి వల్లక యీబోధయందు। వర్తిస్తిజుమీ॥24**

## ప్రతిపదార్థము

చిల్లర బోధలు = భ్రాంతి రహిత విధానమునకు భిన్నభిన్నమైన మార్గములు మత వాదులచే నిర్ణయించబడిన, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతములు
అన్నిటిని = మొత్తమును
ఒల్లరు = అంగీకరించరు (ప్రమాణముగా స్వీకరించరు)
నిజబోధ తెలిసి ఒప్పెటి పెద్దలు = పరిపూర్ణభావమును వున్నదున్నట్లుగా గ్రహించి ఆరూఢపరచుకొన్న మహాత్ములు
పొల్లని = ఇతరమైన మార్గములు వ్యర్థములని
అందుకె = ఆకారణంచేతనే
నేనవి ఒల్లక = ఆమార్గములను నేను ప్రమాణములుగా తీసుకొనక
ఈ బోధయందు = ఈ పరిపూర్ణ భావమందు
వర్తిస్తి సుమీ = జీవించుచున్నాను, కృషిచేయుచున్నాను

## తాత్పర్యము

పరమపురుషార్థమైన మోక్షప్రాప్తికి ప్రపంచమునందు భిన్న భిన్న మార్గములు, మతకర్తలచే ప్రతిపాదింపబడి ఉన్నవి. స్థూలముగా వీటిని పరిశీలించినచో జన్మ కర్మలకు అత్యంతమూలకారణమగు జగదధిష్టాన వస్తువును లక్ష్యముగా నిర్ణయించుకొని అంధగజ న్యాయముగా భిన్న భిన్న కోణములలో మార్గములుగా నిర్ణయించియున్నారు. ఇవన్నియు చిల్లర మార్గములే. అనిగుర్తించి భ్రాంతిరహిత విధానమునకు పరిపూర్ణ భావమే రాజ మార్గముగా పెద్దలచే నిర్ధేశింపబడి ఉన్నది. వీటి విలువలను, ప్రయోజనమును గుర్తించి పైమార్గములను విసర్జించి ఈ భావమునందే

ప్రవేశించి కృషి సల్పి నే ఆరూఢపరచుకొన్న అంశములు ఈ పద్యముల ద్వారా మీముందుంచుచున్నాను.

**కం॥ గురుశిష్యుల మాటలవలె। పరిపూర్ణపు బోధ కందపద్య ఫణితిచే విరచిస్తి వినుడిముందర। జరిగే ముచ్చట్లు మీకు సహ్యాం బైనన్॥ 25**

## ప్రతిపదార్థము

మీకుసహ్యాంబైన = మీకు ఇష్టమైనచో
గురుశిష్యుల మాటలవలె = యోగ్యత కలిగిన గురుశిష్యుల మధ్య జరిగిన చర్చ రూపకంగా
పరిపూర్ణ బోధ = భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా చెప్పబడుచున్న ఈ పరిపూర్ణ భావము
కంద పద్య ఫణితిచే = కందపద్యముల రీతిగా
విరచిస్తి = వివరముగా రచించినాను
వినుడీ = అత్యంత శ్రద్ధతో వీటిని వినండి
ముందర జరిగే ముచ్చట్లు = ఇక ముందు చెప్పబడుచున్న బోధనాంశములు

## తాత్పర్యము

శ్రేష్టులైన గురుశిష్యులిరువురు చర్చించుకొన్నవిధముగా భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా చెప్పబడుచున్న ఈపరిపూర్ణ బోధను చిన్న చిన్న పద్యముల రూపములో వివరిస్తూ రచించినాను. మీకు ఇష్టమైన ఎడల ఇకముందు జరుగబోవు బోధనాంశములను అత్యంత శ్రద్ధతో విన వలసినది.

**కం॥ సకల నిగమాగమాది ప్రకర మహా నారికేళ ఫలసారము। దీసొక గ్రంథము జేసితి లౌకిక జనులొక వేళ్ళగొన్న। కీడు దొలంగున్॥ 26**

## ప్రతిపదార్థము

సకల = సమస్తము
నిగమములు = వుపాసనా కాండకు సంబంధించినవి
ఆగమములు = కర్మ కాండకు సంబంధించిన
ఆది = మొదలైన వన్నియు, అనగా సకల వేదశాస్త్ర, పురాణ, ఇతిహాస, వుపనిషత్తుల సమగ్ర పరిశీలనలో తెలియ బడినవి (ప్రతిపాదింప బడిన)
ప్రకర = పై వాటి యందలి లోతు, లేక రహస్యము
మహా నారికేళ ఫలసారము = గొప్పదైన కొబ్బరికాయ యందలి స్వచ్ఛమైన, శుద్ధమైన, శక్తి వంతమైన జలము
దీసాక గ్రంథము జేసితి=సారమును లేక శక్తిని యిమిడ్చి ఈ గ్రంథమును రచించినాను
లౌకిక జనులు = జనన మరణ చక్రంలో పరిభ్రమించు వారు
ఒకవేళ గొన్న = ఒకా నొక సందర్భములో దీన్ని పొంద దలచినపుడు
కీడు తొలంగున్ = వారికున్న బాధ తొలగున్

## తాత్పర్యము

శబ్ద బ్రహ్మమునకు మారుగా చెప్పబడుచున్న ఆగమ ప్రమాణమునందు, కర్మకాండ, ఉపాసనా కాండ, జ్ఞాన కాండలు ప్రముఖముగా చెప్పబడుచున్నవి. వీటి చరమ లక్ష్యము "ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" ఏఒక్క జ్ఞానముచే ఇతరమైన జ్ఞానమంతయు సిద్ధించునో అట్టి అఖండ జ్ఞాన ప్రాప్తిని ప్రతిపాదింపబడుచున్నది. ఇంతే గాక చరమ లక్ష్యమైన దేనిని విడిచినచో సమస్తమునూ విడిచినట్లగునో (సర్వధర్మాన్ పరిత్యాజ్యా) దానిని విడచుట వీటి లక్ష్యములై ఉన్నవి. ఈ సారాంశము నంతను ఈ కందపద్యముల రచనలో ఇమడ్చబడి మీకు చెప్పబడుచున్నది. చక్కని లక్షణము కలిగిన (కఠిన తరమైన ద్రాక్షపాకము కాక కదళీ పాకము కాక శ్రేష్ట తరమైన కొబ్బరి నీరుతో ఇందలి రసము పోల్చబడుచున్నది. అనగా వినుట మాత్రము చేతనే అర్థగాంభీర్యము

అనుభవనీయ మగుట. కనుక జనన మరణ భ్రాంతి రహిత విధానము పొందగోరు వారు సమగ్రముగా వీటిని విన్న ఎడల వారికి కలిగిన కీడు తొలగి పోవును.

## గురుశిష్య అన్యోన్య దర్శనము

గురుశిష్యన్యాయమునందు ధర్మపద్ధతిగా బ్రహ్మవిద్యోపాసనకు శిష్యుడే గురువును అన్వేషిస్తూ గురుదర్శనము కొరకు వెళ్ళడము ఒక సత్సాంప్రదాయముఅయివున్నది. జ్ఞానప్రదాతగా గురువు కీర్తింప బడుచున్నాడు. ఇట్టి ధార్మిక లక్షణమును పరంపరా ప్రోక్తముగా వచ్చు బ్రహ్మవిద్యయందు అనుశ్రుతముగా(ప్రవాహ రూపంగా) గురుశిష్య న్యాయములో మాత్రమే ప్రచారంలో ఉన్నట్లుగా తెలియు చున్నది. దీనినే గురు పరంపర అని చెప్పబడును. ఏవం పరం పరాప్రోక్త: అని భగవద్గీత యందు బ్రహ్మవిద్యయొక్క స్వరూప స్వభావములు చెప్పబడుచూ "శిష్యస్తే హంశాధిమాం త్వాం ప్రపన్నమ్" అని అర్జునునిచేత అనిపించిన గాని శ్రీకృష్ణుడు భగవద్గీతోపదేశము గావించలేదు. ఆ విధంగా విద్య అనునది గురుశిష్యులు అను భూమికల ద్వారా మాత్రమే ప్రకటిత మగుచున్నది. ఇందు శిష్యుడు బ్రహ్మవిద్య కొరకు అన్వేషిస్తూ గురుని చేరవలసి యున్నది. ఈ ధర్మమును మనకు తెలియ పరచుట కొరకు ఈసందర్భములో గురుశిష్యులిరువురు ఒకరి నొకరు దర్శించు కొన్నట్లుగా ఇందు చెప్పబడుచున్నది. అంతకు పూర్వము వీరు గురుశిష్యులై వుండి జన్మరహిత విధానమందు కొంత కృషిసల్పి, అనగా పరిపూర్ణ సిద్ధాంతరీత్యా పరిపూర్ణ మెరిగి, యెరుక నెరిగి, యెరుకను మానుము అను క్రమములో పరిపూర్ణము ఉన్నది యెరుక లేనిది అని దృఢపరచుకొన్న మీదట యెరుకను విడచి జీవించుట అను విధానమందు సమాధాన పడుట అను ప్రక్రియలో శిష్యుని అరూఢతను గమనించుటకై 19 సం॥ వ్యవధి అనంతరం భ్రాంతి రహిత విధానం కొరకు శిష్యుడు సందేహ నివారణకు గురువు వద్దకు వెళ్ళుట అవసరమై ఉన్నది. ఈ అంశమును స్పష్ట పరచుటకై ఈ రచనయందు ఒకరినొకరు దర్శించుకొన్నట్లుగా ఒక చక్కటి మార్గము సూచింప బడుచున్నది.

కం॥ తనకు దావచ్చి సద్బోధనుదెల్పు మటంచుమ్రొక్కు తన శిష్యునకున్। వినజెప్పదొడగె నొక గురు। డనుమానించకను వాని కతి దయతోడన్॥ 27

## ప్రతిపదార్థము

తనశిష్యునకున్=అంతకు పూర్వము తన్నాశ్రయించి పరిపూర్ణ భోధను శ్రవణము చేసి వున్నవాడు
తనకు తావచ్చి= తనంతట తానుగా సందేహ నివారణ కొరకు వచ్చియున్నవాడు
సద్భోధను = సర్వభ్రాంతి రహితము కలిగించు పరిపూర్ణ భావమును
తెల్పుమటంచు = ఇంకనూ వివరంగా వుపదేశించమని
మ్రొక్కు = సాష్టాంగ నమస్కారమొనర్చిన
విన చెప్పదొడగె = సవివరంగా, వస్తునిశ్చయ పూర్వకంగా మరల పరిపూర్ణ భావమును చెప్పుట ప్రారంభించెను
ఒక గురుడు = పరిపూర్ణ భావమును ఆరూఢ పర్చుకొన్న మహాత్ముడు
అనుమానించకను = వచ్చిన వాని ఎడల ఎట్టి అపనమ్మకము లేకుండా
వానికి = సందేహమనస్కుడైన శిష్యునికి
అతిదయ తోడను = అత్యంత అనుగ్రహము, వాత్సల్యముతో

## తాత్పర్యము

కందార్థ రచనయందు జనన మరణ భ్రాంతి విధానము కొరకు ఒక సాధకుడు ప్రపంచమునందు గల విభిన్న మార్గములయందు, కృషిసల్పి కొంత ఆరూఢత గాంచి, అట్టి ఆరూఢత తమ లక్ష్యమునకు సరిపోవునా లేదా అను సందేహములో పరిపూర్ణ గురుమూర్తిని దర్శించుట, వుపదేశసారముగా పరిపూర్ణ బోధను (పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను) అను క్రమములో బోధనా పరంగా వివరణ పొంది పరిపూర్ణము ఉన్నది, ఎరుక లేనిది అను అంశము దృఢపరచుకొన్నమీదట, దృఢపరచుకొన్న తాను లేకపోవుట ఎట్లో సమాధాన పడలేక మరలా

గురుమూర్తిని దర్శించి పరిపూర్ణ భావమును ఉపదేశించ వలసినదిగా అత్యంత భక్తి శ్రద్ధలతో సాష్టాంగ నమస్కారమొనర్చి కోరగా కరుణాంత రంగుడగు గురువు వచ్చిన వాని యెడల ఎట్టి అనుమానము లేక గోవత్స న్యాయముతో పరిపూర్ణబోధయొక్క క్రమమును నిర్మిత విధానమును మరల ఉపదేశించుటకు పూను కొనెను.

**కం॥ పరమ పురుషుడును। లేనిది యెరుకయుగల దరసిలేని**
**యెరుకను విడుమం। చెరిగించిన; శిష్యుడు గురువరునడిగెను**
**మ్రొక్కిరెంటి వర్తన లపుడున్॥ 28**

## ప్రతిపదార్థము

పరమ పురుషుడు = పరిపూర్ణ పరబ్రహ్మము
లేనిది ఎరుకయు = వున్న దానియందు లేక తోచుచున్న గుర్తెరిగే, శరీరము
కలవు = పైన పేర్కొన్నరెండు వస్తువులు వున్నవి
అరసి = వస్తునిశ్చయ పూర్వకంగా కేటాయించి తెలుసుకొని
లేని ఎరుకను = మూలములేని గుర్తెరిగే శరీరమును
విడుమంచు = విడచి పెట్టవలసినదిగా
ఎరిగించిన = వివరించిన
శిష్యుడు = సందేహ మనస్కుడై వున్నవాడు
గురువరునడిగెను = గురుమూర్తిని ఈ విధముగా ప్రశ్నించెను
మ్రొక్కి = సాష్టాంగ నమస్కారముచేసి
రెంటి వర్తనలపుడున్ = పైన పేర్కొన్న రెండు వస్తువుల గూర్చి సమగ్రంగా

## తాత్పర్యము

కేవలత్వము కలిగిన పరిపూర్ణ పరబ్రహ్మము దానియందు లేక తోచుచున్న గుర్తెరిగే శరీరము అను రెండు వస్తువులు సిద్ధాంతరీత్యా చెప్పబడుచున్నవని వీటిని గురుముఖత: వస్తునిశ్చయపూర్వకంగా దృఢపరచుకొని ఉన్న పరిపూర్ణమునందు లేనిది యెరుక కనుక, అట్టి యెరుకను విడిచి ఉండినచో భ్రాంతి రహిత విధానము కలుగ గలదని ఉ

పదేశించగా విన్నశిష్యుడు తన గురుమూర్తికి తిరిగి సాష్టాంగ నమస్కారమొనర్చి, పైన పేర్కొన్న అంశములను స్పష్టముగా వస్తునిశ్చయపూర్వకంగా తనకు ప్రబోధించ వలసినదిగా కోరెను.

## శిష్య ప్రశ్నావళి

పైనపేర్కొన్న సిద్ధాంత ప్రతిపాదనయందు గల మీమాంస ఈపద్యము ద్వారా శిష్యునిచే ప్రశ్నించబడి సమగ్రమైన సిద్ధాంతము మరల వినగలుగుటకు ఒక మార్గము. ఈపద్యముల ద్వారా ఈగ్రంథకర్త పాఠకులకు ఒక మేలు మార్గము కల్పించి యున్నారు.

**కం॥ పరమపురుషుడనెవ్వడొ యెరుకెట్టిదొ తెల్పియవల యెరుకను విడిచే। తెరువెట్టిదొయిన్ని యునాకెరిగించు మటంచుబల్క నిట్లనె గురుడున్॥ 29**

## ప్రతిపదార్థము

పరమ పురుషుడన నెవ్వడీ = పరిపూర్ణపరబ్రహ్మమనగా నెట్టిదొ
ఎరుకెట్టిదొ = గుర్తించే ఎరుక వస్తునిశ్చయ జ్ఞానమెట్లో?
తెలుప వలయున్ = స్పష్టంగా వివరించండి
ఎరుకను విడిచే తెర వెట్టిదో = చివరకు గుర్తించే తెలివిని ఏ పద్ధతిగా విడచి వుండవలెనో
నాకెరిగించు మటంచు పల్క = వస్తునిశ్చయ పూర్వకంగా నాకు దృఢపరచ వలెనని శిష్యుడు కోరగా
అట్లనె గురుడు = ఆ విధంగానే వివరించెదనని గురుమూర్తి అభయ ప్రదాన మిచ్చెను

## తాత్పర్యము

పరమపురుషుడను పేరుతో చెప్పబడుచున్న పరిపూర్ణ పరబ్రహ్మము, ఎరుకయొక్క వస్తునిర్ణయము, విడదీసి, వివరించి పైన ఎరుకను విడచు విధానము ఎట్లుసాధ్యమగునో ఇది అంతయు వస్తునిశ్చయ

పూర్వకంగా తనకు దృఢపరచవలసినదిగా శిష్యునిచే కోరబడినప్పుడు కోరిన దానికనుగుణ్యముగా వివరించి చెప్పుటకు అభయ ప్రధానము శిష్యునకు కలిగించెను.

## గురుమూర్తి అభయ ప్రధానము

శిష్యుడు కోరుకొన్నవిధముగా గురుమూర్తి ప్రబోధించుట అవసరమై వున్నది. పరిపూర్ణము, యెరుక, యెరుకను విడచుట అను మూడు అంశములుప్రబోధయందు ముఖ్యమైనవి. వీటిని వస్తునిశ్చయ పూర్వకంగా ఎట్టి సందేహమునకు తావులేకుండా సిద్ధాంత పద్ధతిని వివరిస్తూ ప్రబోధించవలసి ఉన్నది. ఇందులకు పలు దృష్టాంతములు ఉదాహరణగా చెప్పుచూ బోధయందు ఒక చక్కటి క్రమము ఈ శీర్షికద్వారా మనకు అందించబడుచున్నది.

**కం॥ నేపెద్దలచే విన్నది। నీపై దయబుట్టిచెప్పనే। బూనితినీకాపద్ధతి**
**నంతయు విని। యే పద్ధతి కాశపడుకుమిది విడువకుమీ॥30**

## ప్రతిపదార్థము

నే పెద్దలచే విన్నది = గురుశిష్యన్యాయంలో సాంప్రదాయ పద్ధతియందు ఆరూఢత చెందిన మహాత్ములను ఆశ్రయించి వారి అనుగ్రహ విషయ విశేషముగా నేను దృఢపరచుకున్న పరిపూర్ణ బోధ విధానము
నీపై దయపుట్టి = నీమీదనాకు కలిగిన అనుగ్రహ విశేషముచే
చెప్పబూనితి = ఆ క్రమము నంతయు వస్తునిశ్చయ పూర్వకంగా దృఢపరచుకొని నీకు ఉపదేశించ దలచితిని
ఏ పద్ధతికీ ఆశపడకు = ఇతర మార్గములన్ని విడచియుండుము
ఇది విడువకుమీ = నే ప్రబోధించిన ఈ పరిపూర్ణ భావము విడిచి పెట్టక పదిల పరచుకొనుము

## తాత్పర్యము

పరిపూర్ణ భావమునందు స్వచ్ఛమైన ఆరూఢత కలిగిన

మహాత్ములను ఆశ్రయించి వారనుగ్రహ విశేషముచే ఈ భావమును సమగ్రంగా వస్తునిశ్చయపూర్వకంగానే దృఢపరచుకొని సర్వ సందేహ నివృత్తిని గావించుకొంటిని. ఇట్టి ఉన్నతమైన భావమును నన్నాశ్రయించి నందులకు నేగ్రహించినదంతయూ ఉన్నది ఉన్నట్లుగా నీకు దృఢపరచుటకు నిశ్చయించితిని. క్రమపద్ధతిలో ఎట్టి నిర్లక్ష్యములేక ఆవిధానమంతయూ బాగుగా దృఢపరచుకొనుము. జనన మరణభ్రాంతి రహిత విధానమునకు ప్రపంచంలో మతకర్తలచే ప్రతిపాదింపబడియున్న మార్గములన్నిటినీ ప్రయత్నపూర్వకంగా విడిచి యుండుము. వాటి యందు ఏమాత్రమూ ఆశపడకు. నేప్రబోధించిన విధానమునందు ఎట్టి నిర్లక్ష్యములేక భద్రపరచుకొనుము.

**కం॥ కదలడట పరమ పురుషుడు। కదలిక మాయయట యిట్టి**
**కదలిక కేదో మొదలన పెద్దలు బల్కిరి। కదలనిదే కలదు**
**లేదు కదలిక యనుచున్॥ 31**

## ప్రతిపదార్థము

పెద్దలు పల్కిరి = పరిపూర్ణ భావమునందు ఆరూఢత చెందిన మహనీయులు ప్రబోధించిన విధానమునందు
కదలడట పరమ పురుషుడు=పరిపూర్ణ పరబ్రహ్మము కదిలే లక్ష్యము లేనిది
కదలిక మాయయట = చలనాత్మకమైన జగదధిష్టానమైన వస్తువు లేనిదని
ఇట్టి కదలికకు=మూలముగాని స్థానముగాని లేకుండా తోచుచున్న లేని ఎరుకకు
ఏదో మొదలు అన = మూలము ఆధారము అయినది ఏమిటి అని సందేహము పడినపుడు
కదలనిదే కలదు = చెలించుటకు వీలుకాని పరిపూర్ణము స్వతఃసిద్ధమై యున్నదని
లేదు కదలిక యనుచున్ = సర్వ చలనములకు మూలము, ఆధారముగా నున్న ఎరుక లేనిదని (మూలములేని గుర్తెరిగే శరీరము)

## తాత్పర్యము

పరిపూర్ణ భావమునందు ఆరూఢత చెందిన మహాత్ములు స్వత:సిద్ధమై, కదులుటకు కదిలింపజేయుటకు వీలుగాక స్థిరమైయున్నదచలపరిపూర్ణమని సర్వజీవేశ్వర జగత్సృష్టికి అత్యంత మూలకారణమై జగదధిష్టానమైయున్న(బ్రహ్మము) ఎరుక దానియందు లేదని సిద్ధాంతీకరిస్తూ వున్న వస్తువు నందు లేని వస్తువునకు మూలముగాని, స్థానముగాని లేదని సిద్ధాంతీకరించి వున్నారు.

**కం॥ పురుగుక్కు స్తంభంబును। గొరికినదన వీతిహోత్రుగొని మ్రింగె చదల్। ధరనననను మాయాసతి। హరిని చికాకుగ నొనర్చె ననవినదగునే॥ 32**

## ప్రతిపదార్థము

ధరనని నను = ఈ ప్రపంచమందు
పురుగుక్కు స్తంభమును కొరికినదన = ఇనుపస్తంభమును పురుగులు ఆక్రమించినవనుమాట (తినినవి)
వీతిహోత్రుని గొని = అగ్నిహోత్రుని సమీపించి
మ్రింగె చెదల్ = చదలు పట్టిన వనుట
మాయా సతి = అధిష్టాన పరబ్రహ్మము యొక్క తొలి పరిణామమైన మూల ప్రకృతి లేక దహరాకాశము ఆవరణ శక్తి
హరిని =స్వత:సిద్ధమై ములుగ్రుచ్ఛ సంధి లేకను నిండియున్న పరిపూర్ణమును
చీకాకుగా నొనర్చి = పరిణామ క్రమమునకు లోనై వున్నట్లుగాను
అన = పై విధముగా చెప్పగా
వినదగునె = నమ్మ వచ్చునా

## తాత్పర్యము

ప్రపంచమునందు అరుదైన, అపూర్వమైన అసాధ్యమైన కొన్ని అంశములను, ఉదాహరణగా పేర్కొనుచూ, పరిపూర్ణమును ఎరుకనూ వాటికి

అన్వయించి, వాటికి గల విలక్షణత్వమును, భిన్నత్వమును యిందు చెప్పబడుచున్నవి. 1) ఉక్కుస్థంభమును పురుగులు తినగలుగుట 2) భగ భగ మండగలుగు అగ్నిహోత్రుని చెదపురుగు లాశ్రయించుట ఎట్లు అసాధ్యమైన అంశములో, అవిధముగానే మతవాదులు నిర్ణయించిన సృష్టి కారణమగు మాయాశక్తి(మూల ప్రకృతి) ఆవరణశక్తి, ములుగ్రుచ్చ సంధి లేక స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమును అక్రమించుకొని అచ్ఛాదనగా కలిగి యున్నది, అనుట కూడా యిట్టి హాస్యాస్పదమైన అంశము.

**కం॥ హరియందు దోచు విశ్వము నర స్వప్నము వంటి దనిరి।**
**నానా జనముల్ సురస్వప్నము వంటిదియనె। స్థిరమతి**
**శివరామ నామ ధీక్షితులు ధరన్॥ 33**

## ప్రతిపదార్థము

హరియందు = స్వత:సిద్ధమైన పరిపూర్ణమందు

తోచు విశ్వము = మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న (గుర్తెరిగే శరీరము)

నానాజనముల్ = ఇతరమతస్తులు

నరస్వప్నము వంటి దనిరి = ప్రకృతి జన్యముగా, ఇంద్రియముల సమీకరణలో మనసు చేత సంస్కార రూపమైన భావములకు నిలయమై యున్నకల వంటిదని

స్థిరమతి = దృఢమైన, అచంచలమైన బుద్ధితో

ధరన్ = ఈ ప్రపంచమునకు

శివరామనామ దీక్షితులు=శివరామ అను పేరుతో ప్రఖ్యాతి చెందిన మహాత్ములు

సుర స్వప్నము వంటిదని=దేవతలచే భావింపబడుచున్నస్వప్నము (కలవంటిది)

## తాత్పర్యము

స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము నందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న ఎరుకను కలవంటిది అని, దృఢమైన, స్థిరమైన, ఆరూఢత జెందిన శివరామ దీక్షితులు అను పేరుగల,

మహానీయుడు, ఈప్రపంచమునకు తమ సిద్ధాంతముద్వారా, భ్రాంతి రహిత విధానమును ప్రబోధించియున్నారు. అయితే ప్రపంచంలోగల మతము లన్నిటిలోకీ ఉన్నతమైన అద్వైతమునందు కూడా ఈకల దృష్టాంతము ప్రతిపాదన ము కలదు. ఈ రెంటికీ భేదములు విచారించినచో అందు నరస్వప్నము, సురస్వప్నము అను రెండు విధములు. ఇందు నరస్వప్నమనగా :- సృష్టి పరిణామక్రమమునందు బ్రహ్మాండ పిండాండములందు జాగ్రత్త, స్వప్నము, సుషుప్తులు ఇంద్రియ ధర్మములుగా చెప్పబడుచున్నవి. వీటి క్రమములో సృష్టించుట(ఉత్పత్తి) జాగ్రదావస్థ, పోషించబడుట స్వప్నము, లయము చెందుట సుషుప్తిగా పోల్చవచ్చును. (వీటికి అధిష్టాన దేవతలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు) జీవుల పూర్వజన్మ కర్మ సంబంధమైన వాసనా బలముచే పిండాండ సృష్టి పున: పున: జరుగుచున్నది. వాసనాన్వితమై, సంస్కార రూపముగాఉన్న మనస్సు ఇందు ప్రధానముగా చెప్పబడుచున్నది. ఈగుర్తు పరిణామ క్రమములో ప్రకృతి బద్ధముగా జాగ్రత, స్వప్న, సుషుప్తి అవస్థలు చెప్పబడుచున్నవి. ఈ అవస్థా క్రమము ఎట్టిదో గురుమూర్తి ముఖత: విచారించ వలెను. జాగ్రత్త ననుసరించి స్వప్నము కలుగుచున్నది. కావున నరస్వప్నమునందు కలుగుచున్న స్వప్నములకు, అంతకు పూర్వము జాగ్రదావస్థ యందు సంకల్పించి అసంపూర్ణముగా క్రియారూపంకాకుండా మిగిలి ఉన్న సంస్కార ప్రభావముచే భావనా రూపంగా అనుభవంలోనికి వచ్చుచున్నవి. దీనిని నిజము కానిదని, జాగ్రదావస్థతో సరిచూచిన(నిజము కానిదాని) భ్రాంతి రూపమైఉన్నదని ఇందుచెప్పబడుచున్నది. సురస్వప్నమనగా సురలు అనగా దేవతలు. సత్వగుణ సంబంధమైన దేవతాసృష్టినుండి ఏర్పడిన బ్రహ్మాది దేవతలను నియమిత దేవతలుగా చెప్ప వచ్చును. అంతరేంద్రియ నిర్మితమైన జ్ఞానసాధన, యోగసాధన, మతసాధన, భక్తి సాధన, మంత్రసాధనలతో స్వస్వరూప జ్ఞానము(ఆత్మాను భవము) పొంది, అంతటితో ఆగక ఆత్మాతీతం కేవలాత్మ అన్నట్లుగా జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు సాంప్రదాయబద్ధమైన

పరిపూర్ణగురువును ఆశ్రయించి వస్తునిశ్చయ పూర్వకముగా క్రమ పద్ధతిలో పరిపూర్ణ భావమును దృఢపరచుకొని ఉన్న పరిపూర్ణమునందు లేక తోచబడుచున్న ఎరుక కల వంటిదని, అన్నిటికీ మూలము, ఆధారమూ అయివున్న దీనికి ఉన్నదానియందు మూలముగాని స్థానముగాని లేదని(షోడశి) దృఢపరచుకొన్నవారిని సురలని, చెప్పబడును. వీరినే అచల పరిపూర్ణులని, ఇతర జేజేలని కూడా చెప్పబడును.

నరస్వప్నము, సుర స్వప్నము అను రెంటియందు తారతమ్యములు విచారించినవారికి స్వప్నము సమానము. నరులు, సురలు అను శబ్దమునందు బేధము గమనించి స్వప్నభావమును దృఢపరచుకొనవలసి ఉన్నది. దీక్షితీయ సిద్ధాంతమునందు నరస్వప్నము కాక సురస్వప్నమునే స్థిరపరచి సిద్ధాంతపరచి యున్నారు. ఇది రహస్యము ఎట్లో గురుముఖత: మాత్రమే గ్రహించ వలసి యున్నది.

**కం॥ సురలందు దోచు స్వప్నము। హరియందున దోచు విశ్వ
మాసురలహరిన్। యెరిగిన కల విశ్వము। తామరుగవె తమ
లేమి నెరిగి యతి బిడియమునన్॥ 34**

## ప్రతిపదార్థము

సురలందు దోచు స్వప్నము = పరిపూర్ణ భావము నందు ఆరూఢ పరచుకున్న వారికి తోచబడు కల
హరి యందు దోచు విశ్వము = స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము నందు మూలముగాని స్థానము గాని లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరము
ఆ సురలు హరిని ఎరిగిన = పరిపూర్ణ భావజ్ఞుల బోధచే పరిపూర్ణమున్నదని దృఢ పరచుకొన్నమీదట
కల విశ్వము = లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరము
తా మరుగవే = తమకు తాముగా లేకుండా పోవును
తమ లేమి నెరిగి=మూలముగాని స్థానముగాని లేక పోవుటను రహస్యముగా గుర్తించి
అతి బిడియమున = అత్యంత సిగ్గుతో

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేక తోచుచున్న గుర్తును దేవతలకు కలుగు కలగా పోల్చబడుచున్నది. గురుముఖత: వస్తునిశ్చయపూర్వకముగాఆరూఢత చెందిన పిదప వున్న పరిపూర్ణమునందు లేని కల లేకపోవుచున్నది. తనవునికి నిజము కాదని గుర్తించిన ఎరుక కలవలె సిగ్గుపడి తనకు తానుగా లేక పోవుచున్నది.

**కం॥ కదలనిది కదలదెన్నడు। కదలికకలదనిన దాని కగుపడదు**
**మొదల్। కదలిక లేదది గావున। యిది పరమ రహస్య।**
**మెవ్వరెరుగరు దీనిన్॥ 35**

## ప్రతిపదార్థము

కదలనిది = చలించుటకు వీలుగా లేనిది
కదలదెన్నడు = త్రికాలముల యందు కదులుటకు వీలుండదు
కదలిక కలదనిన = చలించుటకు వీలుగానున్న సృష్టి కారణవస్తువు సత్యమని నమ్మిన
దానికగుపడదె మొదల్ = అట్టిదానికి ఆధారము మూలము లేకపోవుచున్నది
అది గావున = అందుచేత, ఆవిధంగా
కదలిక లేదది=చలించుటకు వీలుగానున్న వస్తువు (ఎరుక) లేనిది కావున
ఇది పరమ రహస్యము = చలించుటకు వీలుకాని అచల పరిపూర్ణము వున్నదని, చలించుటకు కారణమైయున్న ఎరుక దానియందు లేనిదని అను అంశము దానియందు రహస్యమైవున్నది.
దీనిన్ = ఇట్టి అంశమును
ఎవ్వ రెరుగరు = సామాన్యులకు అంతు పట్టని విషయము

## తాత్పర్యము

స్వత:సిద్ధమై యున్న అచల పరిపూర్ణము ఏస్థితియందు, ఏకాలమునందు, ఏవిధమైన కదలికకు వీలుకాక ఉనికి కలిగి ఉన్నది.

సమస్త జగన్నిర్మాణము నకు మూలము, ఆధారము అయిఉన్న బ్రహ్మము (ఎరుక) స్థిరమైనది, నిజమైనది అని అనుటకు దానికి మొదలు, చివర లేనిదై ఉన్నది. ఏలననగా ఒక వస్తువు కదలవలెనన్నచో సూక్ష్మమైన సంకల్పము, స్థూలమైన ప్రాణము అవసరమై యున్నవి. ఈ రెండు వస్తువులు కలసి చలనమునకు కారణమగుచున్నవి. పరిపూర్ణమునందు ఈ రెండూ కాని, ఈ రెంటి సంయోగములో ఏర్పడు గుర్తుగాని లేనిది గావున దానిని అచల శబ్ధముచే సూచింపబడుచున్నది. కదలిక రజోగుణ లక్షణము. గుణములకు ఆశ్రయభూతము మూలప్రకృతి. మూలప్రకృతి ఆవరణలో చేతనా శక్తిచే సమస్తమూ చలనాత్మకముగా నున్నది. "తేన వినా తృణాగ్రమపిన చలతి" ఈ శక్తి లేనిచో గడ్డిపోచ కూడా కదలుటకు వీలు లేదు. అన్నికదలికలకు మూలమై యున్న దీనికి వున్న పరిపూర్ణమునందు మొదలు చివర లేకపోవుచున్నది. అందుచే ఇది లేనిది అని(ద్వాదశిచే) చెప్పబడుచున్నది. ఈ అంశమంతయు గూఢమై, గురుకృపచే మాత్రమే బోధనాక్రమముచే దృఢపరచుటకు వీలై సామాన్యులకు అంతు చిక్కకున్నది.

**కం॥ కదలనిది కదిలెన్నను। ముదమున వినదగదు వారి। ముచ్చట**
**నెపుడున్। కదలిన కదల నిదెట్లగు। నదిగావున,కదల దనుచు**
**నమ్మ దగుజూమీ॥ 36**

## ప్రతిపదార్థము

కదలనిది = స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము
కదలెనన్నను = చలనాత్మకమగుచున్నది
అన్నను = అనుమాట
ముదమున = ఆసక్తితో, సంతోషంతో, శ్రద్ధతో
వినదగదు = వారినిర్ణయము విధానమును ప్రమాణముగా స్వీకరించరాదు
వారి ముచ్చట నెపుడున్ = ఎట్టి పరిస్థితి లోను వారి నిర్ణయ విధానము నంగీకరించరాదు

కదలిన = కదిలే లక్షణము కలిగున్నదైతే
కదలని దెట్లగు = చలించని అచల పరిపూర్ణము ఎట్లవుతుంది
అదిగావున = అందుచేత
కదల దనుచు = కదలనిది పరిపూర్ణమని
నమ్మదగుజూమీ=స్పష్టముగా, దృఢముగా, ఆరూఢ పరచుకొనవలసియున్నది.

## తాత్పర్యము

చలనమునకు కావలసిన వస్తువును విచారించుటలో చోటు, శక్తి, తెలివి, ఒకదాని కొకటి పరంపరా కారణములుగా తెలియుచున్నది. వీటితో సంబంధపడక స్వత:సిద్ధమైయున్నది అచల పరిపూర్ణము. సిద్ధాంతరీత్యా కదలిక లేనిదే స్థిరమై యున్నదని, దానియందు సర్వ చలనములకు ఆధారభూతమైయున్నది లేనిదని దృఢ పరచుకొన వలసి యున్నది. దీనికి భిన్నంగా యితరులు ఎట్టి ప్రతిపాదన చేసినా, అనగా కదులుట, కదలకుండా వుండుట అనురెండు లక్షణములు ఒకే వస్తువునకు చెందినవి. వీటినే స్థితి, గతీ అందురు. ఇవి సాపేక్షికములు. ఇందు ఒకటి సత్యము ఇంకొకటి అసత్యము, అను సిద్ధాంతము నిజము కానిది, భ్రాంతి కారకమై యున్నది. వీటియందు కేవలత్వములేదు. అందుచే ప్రమాణముగా స్వీకరించదు. ఈ రెంటికి విలక్షణమై సంబంధ పడక వేరై వున్నది అచల పరిపూర్ణము అని తెలియ వలెను.

**కం॥ నిను మేనును ప్రకృతి ద్వయమని। నినునీ మేను మృషని**
**మానిరి నీజోలిని పెద్దలు నీవెరుగక। నిను నీవొక కొండ నంటె**
**నిజమా మాటా॥ 37**

## ప్రతిపదార్థము

నిను మేనును = గుర్తించే తెలివి దాని స్థూల రూపమగు ప్రాణము
ప్రకృతి ద్వయమని = పరాప్రకృతి, అపరా ప్రకృతిగా
నిను నీ మేనును = ద్వంద పద్ధతి గల పైరెంటిని
మృషని =నిజము కానివని

మానిరి నీ జోలిని =వీటితో సంబంధము విడిచిపెట్టిరి
పెద్దలు = పరిపూర్ణ భావమందు ఆరూఢత చెందినవారు
నీవెరుగక నిను = ఎరుక యొక్క వాస్తవికతను వస్తునిశ్చయ పూర్వకంగా గుర్తించక పోవుటచేత
నీవొకకొండనంటె = నీకు నీవుగా శాశ్వతుడనని సచ్చిదానంద స్వరూపుడవని భావించుకొనుట
ఆమాట = అట్టి నిర్ణయము
నిజమా = నిజముకాదు, వాస్తవము కాదు

## తాత్పర్యము

పరిపూర్ణబోధ యందు ఆరూఢత చెందిన మహాత్ములు సృష్టి కారకమైన బ్రహ్మమును గూర్చి వస్తునిశ్చయ పూర్వకముగా దాని వాస్తవికతను వివరించుటలో, పరా, అపరా ప్రకృతులను రెండు వస్తువులుగా విభాగించి, యివి ఏకైక ద్వంద్వమని, ద్వంద్వైక ఏకమని ఒకదాని కొకటి విడదీయరాని సంబంధము కలవని, అన్యోన్యాశ్రితమై, జన్మ, కర్మలకు ఇవి అత్యంత మూలకారణమైయున్నవని, స్వతఃసిద్ధమై యున్న అచల పరిపూర్ణమునందు ఈ వస్తువునకు మూలముగాని స్థానముగాని లేనిదని సిద్ధాంతపరచి యున్నారు. జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ఒక రాజమార్గమును ఈ విధముగా సూచించియున్నారు. ఇట్టి నిర్ణయ విధానమునకు వేరుగా మతకర్తలు ఈ బ్రహ్మమునకు శాశ్వతత్వమును, అచలత్వమును కల్పించి దీని స్థూల పరిణామమగు ప్రకృతిని మాయయని లేనిదని పేర్కొన్నారు. ఆమాటల వలన నిర్ణయ విధానము వలన భ్రాంతి విస్తారమగునే గాని రహితము కాజాలదు.

**కం॥ పేరచలమనుచు బయలని। పేరెప్పుడు లేదు మనము బెట్టుట**
**చాతన్ పేరాయె బయలు కిప్పుడు। పోరానీవు నేను మృషనిపోతే**
**జాలున్॥** **38**

## ప్రతిపదార్థము

అచలము, బయలు = కదలనిది, బయట నున్నది లేక వేరైవున్నది
అనిపేరు = అనుపేరులతో
పేరెప్పుడు లేదు=స్వత:సిద్ధమైన పరిపూర్ణమునకు ఎట్టి పేర్లు(నామము) లేవు
మనము పెట్టుట చాతన్=గుర్తెరిగే ఎరుక పుట్టిన పిదప దానిచే నిర్దేశింప బడినవి
పేరాయ = పైన చెప్పిన పేర్లు వచ్చినవి
బయలు కిప్పుడు = స్వత:సిద్ధమైన పరిపూర్ణమునకు
నీవు నేను మృషని పోతే = నీవు నేనుగా గుర్తెరగబడుచున్న ఈ శరీరమును, గుర్తును నిజము కాని వని దృఢపరచుకొంటె
పోరా = లేకుండా పోగొట్టు కుంటె
చాలున్ = భ్రాంతి రహిత విధానమునకు సరియైన నిర్ణయవిధానముకాగలదు

## తాత్పర్యము

బోధనా సౌలభ్యము కొరకు అచలము, బయలు, పరిపూర్ణము, అని ఎరుక చేత నిర్ణయింపబడి సిద్ధాంతపద్ధతియందు గల బోధనా విధానముచే ఉన్నది పరిపూర్ణము లేనిది ఎరుక అని దృఢపరచుకొన్నమీదట ఈనిర్దేశింపబడిన శబ్దములన్నియు గుర్తు తో పాటుగా లేకపోవుచున్నవి. ఈ శబ్ధములుకూడా ఒక ప్రత్యేకమైన భావము నిర్దేశిస్తూ చెప్పబడినవే.

1) అచలము = చలించనిది. చలనాత్మకమైన జీవేశ్వర జగత్తు ఏతత్పరిణామమునకు కారణముగానున్న అధిష్టానమందు చలనమును నిరూపిస్తూ నిషేధముఖముగా ఇది కానిది ఇది లేనిది సంబంధపడనిది అనిస్పష్ట పరచుటకు అచలశబ్దము ప్రయోగింపబడినది.

2) బయలు = బయలనగా బహి:ప్రదేశము లేక ఖాళీప్రదేశము అని అర్థము. పంచభూతములందు ఆకాశమునకు ఈ లక్షణముకలదు. ఇది ఆత్మనుండి పరిణామము చెందినది. ఆత్మను కూడా బయలు శబ్ధముచేత సూచింప వచ్చును. బయలు+బయలు = బట్టబయలు

ఆకాశబయలు శబ్దగుణముకలిగిఉన్నది. ఆత్మ బయలు తెలివితో

కూడుకొన్నది, ఈ రెండు లక్షణములు కలిగిఉన్నది బట్ట బయలు. దీనికి వేరై సంబంధ పడక ఉన్నదానిని సూచిస్తూ ప్రయోగింపబడిన శబ్దము బయలు. ఈ వివరణ యింకనూ స్పష్టముగా గురుముఖత: మాత్రమే వస్తునిశ్చయపూర్వకంగా దృఢపరచుకొనవలసి ఉన్నది. కావున మాటలచేత సూచించుటకు వీలుకానిదానిని సూచిస్తూ తాను లేకపోవు విధానము ఇందలి రహస్యము. సిద్ధాంత పద్ధతి యందు ఏనిర్ణయములు, ఏశబ్దములు పనికిరావు. కావున పైశబ్దమందలి ప్రత్యేకతను దృఢపరచుకొని గుర్తించిన తాను లేకపోవుటచేత తాను నిర్ణయించినపేర్లు, శబ్దము తనతోపాటుగా లేనివే అగుచున్నవి.

**కం॥ పరమపురుషుడీ బయలని। గురుడెరిగించినను జూచి**
**గొప్పకురుచలై। యెరిగెటినినునే మృషనని। యెరిగరుగుము**
**నీవెమాయయిక బుట్టవిలన్॥ 39**

## ప్రతిపదార్థము

పరమపురుషుడీ బయలని = సర్వలక్షణ విలక్షణమైయున్న పరిపూర్ణమును పరమపురుషుడను శబ్దముచే సూచిస్తూ
గురుడెరిగించిన=వస్తునిశ్చయ పూర్వకముగా గురుమూర్తి దృఢపరచిన మీదట
చూచి = గట్టిగా దృఢపరచుకొని
గొప్పకురుచలై=కొద్ది గొప్పలై(పిండాడ బ్రహ్మాండ అకారములుగా మార్పుచెందుచూ)
ఎరిగేటి = గుర్తించేటి, భావించేటి
నిను, నే = నిన్ను, నన్ను
మృషనని = లేనివని (మూలము లేని గుర్తెరిగే శరీరము)
ఎరిగి = గుర్తించి
అరుగుము = విడచియుండుము
నీవే మాయవు = నీకు మూలము గాని స్థానముగాని లేని వాడవు
ఇక పుట్టవు=పైవిధంగా దృఢ పరచుకొన్న మీదట, జనన మరణములకు లోను గావు
ఇలన్ = ఈ ప్రపంచంలో

## తాత్పర్యము

గురుముఖత: వస్తునిశ్చయపూర్వకముగా అఖండ ఎరుకను గుర్తింప జేసినమీదట తనకన్యమై వేరైవున్న అచల పరిపూర్ణమును, పరమ పురుష శబ్దముచే ప్రత్యేకమైన విలక్షణమైన శబ్దముచే సూచింప బడుచూ వున్నదని దృఢవరచుకొని పిండ బ్రహ్మాండాకారములుగా పరిణామమునకులోనైవున్న ఎరుకను లేనిదని గుర్తించి, షోడశి వాక్యము ద్వారా తాను లేక పోవలెను. జన్మ కర్మలకు ఈ గుర్తే కారణముగా నున్నది. కనుక ఈ భావనా బలమును దృఢపరచుకొన్న మీదట ఈ భూమిపై జన్మ పరంపరలకు లోనుకాని భ్రాంతి రహిత, విధానము చేకూరగలదు.

**కం॥ అయమాత్మ యనినరీతిగ నయముగ యీ బట్ట బయలు**
**నదుగో యనుటల్। అయమియ మనియనుటుళ్ళుక్కయినను**
**ననవలసె నీదుకీడుడుగుటకై॥ 40**

## ప్రతిపదార్థము

అయమాత్మా యనినరీతిగా = సాక్షాత్కార వాక్యముగా, లేక అనుభవ వాక్యముగా, ఆత్మను గుర్తించి చెప్పబడిన విధానము
నయముగ = అంత స్పష్టంగా
ఈ బట్ట బయల్ = ఈ పరిపూర్ణ పరబ్రహ్మము
అదిగో అనుటల్=అది అదిగో, యిదిగో అని తానుగుర్తించి తాను చెప్ప బూనుట
అయమియమని యనుట = అది ఇది అను శబ్ధములచే నిర్ణయింపబూనుట
ఉళ్ళుక్కి = నిజము కానిది సాధ్యముకానిది
అయినను = బోధనా సౌలభ్యముకొరకు
అనవలసె = చెప్పవలసి వచ్చెను
నీదు కీడుడుగుటకై = నీకు కలిగిన భ్రాంతిని పోగొట్టుటకు

## తాత్పర్యము

ప్రత్యేక బ్రహ్మత్వమును (జీవేశ్వర ఐక్యము) ప్రతిపాదిస్తూ వీటియందు అఖండత్వమును తెలియ జేయుటకు మహావాక్య విచారణ

ఒక మార్గముగా అద్వైత సిద్ధాంతమునందు ప్రతిపాదింపబడుచున్నది. ఉపదేశక్రమము నందు "తత్వమసి" అను వాక్యము ద్వారా శ్రవణము చేసిన శిష్యులు, అహంబ్రహ్మాస్మి, ప్రజ్ఞానంబ్రహ్మ అను మనన నిధి ధ్యాసలద్వారా అయమాత్మ బ్రహ్మ అను భావముచే అపరోక్షానుభూతి పొందుట సిద్ధాంతీకరింపబడినది. ఇదంతయు గురూపదిష్ట మార్గముచేత మాత్రమే తెలియ వలసిఉన్నది. ఇట్టి ఆరూఢత పొందుటయే ముక్త దశగా ఈ మార్గమందు చెప్పబడుచున్నది. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా స్వత:సిద్ధమై యున్న అచల పరిపూర్ణము, అందు లేక తోచుచున్న గుర్తెరిగే శరీరము అను అంశములను గురుముఖత: వస్తునిశ్చయపూర్వకంగా దృఢపరచుకొన్నవారు ఉన్నదానియందు తాను లేక పోవుటచే లేనివాడిచే చెప్పబడు నిర్ణయములన్నియు లేక పోవుచున్నవి. ఇట్టి ఆరూఢత చెందుటకు ఉపదేశక్రమమందు, అది, ఇది అను శబ్ధములచే ప్రత్యక్షం, పరోక్షంగా సూచిస్తూ భిన్నత్వమును గ్రహింపబూనుటకు చెప్పవలసిన శబ్ధములేగాని విధిముఖముగా చెప్పుటకు సాధ్యముకాదు. ఏలననగా పరిపూర్ణము ఉన్నది ఎరుక లేనిది అని గ్రహించిన గుర్తు మిగిలి ఉన్నది. అనుభవమునకు ఈగుర్తు ఆధారముగా ఉన్నది. అను + భవము = తిరిగి పుట్టగలుగుట. ఈగుర్తు మరలా పరిణామ క్రమమునకు లోనై ఉండును. భ్రాంతిరహిత విధానమునందు ఈ గుర్తు కూడా ఋణ శేషము, శత్రుశేషము వలె విడువ వలసి ఉన్నది. ఆ విడుచుట ఎట్లుసాధ్యమో తెలియ పరచుటకు ఈ శబ్ధములు ప్రయోగింపబడినవి తప్ప సాక్షాత్తుగా పరిపూర్ణ భావమును దర్శించుట సాధ్యముకాదు అని తెలియ వలెను.

**కం॥ లేని నేనీవులేని స్థానంబును కారణంబు సర్వమున**
**కధిష్టానంబు సాక్షిసత్యజ్ఞానానందబులనిన సత్యములగునే॥41**

## ప్రతిపదార్ధము

లేని = లేక తోచబడుచున్న

నే నీవు లేనిస్థానంబును = నీవుగాను, నేనుగాను గుర్తించబడుచున్న ఈగుర్తు

ఏమాత్రమును లేనిపరిపూర్ణ పరబ్రహ్మమును
కారణంబు = ఈ గుర్తు వుత్పత్తికి ఆధారమని
సర్వంబునకు అధిష్టానంబు = జీవేశ్వర జగత్‌సృష్టికి అంతటికి ఆధారభూతమై వున్నదని
సాక్షి = సృష్టి, స్థితి, లయములను గమనించువాడని
సత్య జ్ఞానా నందములనిన = త్రికాలా బాధ్యమై, జ్ఞానమే స్వరూపముగా గలిగి ఆనంద లక్షణము గలది
అనిన = పైన పేర్కొన బడిన లక్షణము లన్నియు చెప్పబడిన
సత్యములగునే = నిజము కావు లేక వాస్తవము కావు.

## తాత్పర్యము

స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము నందు, గురుశిష్యులను గుర్తుతో లేక తోచబడుచున్న మనము, పరిపూర్ణమును అన్నిటికీ కారణమని, జీవేశ్వర జగత్‌సృష్టికి కేంద్రమై యున్నదని, సృష్టి,స్థితి, లయములకు సాక్షి గావున్నదని, సచ్చిదానంద లక్షణము కలదని, ఎట్టి నిర్ణయములు చేసినా, అవి యదార్థములు కావు. ఏలననగా, ఈ లక్షణములు అన్నియు లేనిఎరుకకు మాత్రమే చెందును. వున్న పరిపూర్ణమును గూర్చి లేని ఎరుక ఎట్టి నిర్ణయములు చేసినా అవి సత్యములు కావని తెలియ వలెను.

**కం॥ అట్టిది యిట్టిదియనరా నట్టిది బయలనుచు దెలిసి యా
మీదట నీవట్టిది యిట్టిది యనరానట్టిది బయలనినదాని
నరయకు మెపుడున్॥ 42**

## ప్రతిపదార్థము

అట్టిది, ఇట్టిది అనరానట్టిది బయలు = గుర్తుచేత ఏ మాత్రము, గుర్తెరగక ఎట్టి నిర్ణయములు చేయక స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము
అనుచుతెలిసి = గురువాక్యము ద్వారా దృఢపరచుకొని
ఆమీదట = ఆపైన
నీవు = పై విధముగా గుర్తించిన నీవు అట్టిది ఇట్టిది అనరానట్టిది బయలనిన

దానిని = పై విధముగా గుర్తింపబడిన దానిని
అరయకు మెపుడున్ = పూర్తిగా విడచి యుండుము అని భావము

## తాత్పర్యము

గుర్తెరిగే తెలివిచేత ఎట్టి నిర్ణయంము చేయంరానిదై వున్నపరిపూర్ణమును గురుసూచనద్వారా దృఢపరచుకొని ద్వంద్వ పద్ధతిగా నీవు- నేను, ప్రత్యగాత్మ- పరమాత్మ, పిండాండ- బ్రహ్మాండములుగా గుర్తెరగబడుచున్న దానిని గురువాక్యముచే (షోడశి) విడిచి యుండుము.

**కం॥ అది ఇది యంచని యనరానిది బయలని తెలిసినీవు। యిది
యది యనరానిది బయలని తెలిసిన నినువదలుండుము
లేనటంచు వరగుణవంతా॥ 43**

## ప్రతిపదార్థము

వరగుణవంతా = శ్రేష్టమైన, యోగ్యమైన సద్గుణములు కలవాడా
అది ఇది యంచనియనరానిది = ఇటువంటిది, అటువంటిది అని గుర్తుచేత నిర్ణయించుటకు వీలుకానిది
బయలని = స్వత:సిద్ధమైన పరిపూర్ణమని
తెలిసి నీవు = గురువాక్యముచేత స్పష్టముగాదృఢపరచుకొన్ననీవు
ఇది యది అనరానిది బయలని తెలిసిననిను = పై విధముగా గుర్తెరగ బడిన నీ గుర్తును
లేనటంచు = లేనిదని
వదిలుండుము = విడచి యుండుము (షోడశి)

## తాత్పర్యము

శ్రేష్టమైన సద్గుణ సంపత్తి కలవాడా గుర్తెరిగే తెలివి చేత ఎట్టి నిర్ణయము చేయుటకు వీలుకానిది, స్వత:సిద్ధమైవున్నది పరిపూర్ణ పరబ్రహ్మమని, గురుప్రబోధచే వస్తునిశ్చయ పూర్వకంగా దృఢపరచుకొని, అట్టి నిర్ణయమును గుర్తించిన నీగుర్తుకు వున్న దాని యందు మూలముగాని,

స్థానము లేదని షోడశి వాక్యము ద్వారా విడిచి యుండుము.

**కం॥ కలనీకు జగముకంతట। గలబయలుకు గలిగియున్న
ఘనమగు తిప్పల్। కలయగని మేలుకొని యాకలవలె
మేలుకను జూచి, కదలుముళ్ళుక్కీ॥ 44**

## ప్రతిపదార్థము

కల = పరిపూర్ణము నందు లేక తోచబడుచున్న గుర్తెరిగే ఎరుక
నీకు = గుర్తెరగబడే నీకు
జగముకు = ప్రపంచమునకు
అంతట గల బయలుకు = సర్వత్రా నిండియున్న పరిపూర్ణమునకు
కలిగియున్న = సంబంధమున్నదని భావించిన ఎడల
ఘనమగు తిప్పల్ = జనన మరణములు తప్పవు
కలయగని = ఇదంతా ఒకటేయని, లేనిదని గుర్తించి
మేలుకొని = గురుర్వాక్యముచేదృఢ పరచుకొని
ఆ కల వలె మేలుకనుచూచి = గుర్తెరిగే తెలివితో పాటుగా మెళకువస్థితిని కూడాజతచేసి
కదలుముళ్ళుక్కీ = లేనివని నిజము కానివని గురుర్వాక్యము చేత విడిచి యుండుము

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమునకు దానియందు లేక తోచబడుచున్న, గుర్తెరగబడుచున్న ఎరుకకు, ఎట్టి సంబంధములేదు. సిద్ధాంతరీత్యా, ఎరుకను కలతోటి, పరిపూర్ణమందు దానికి మూలము గాని స్థానముగాని లేకపోవుట అను దానిని మెళకువగాను చెప్పబడు చున్నది. ఈ రెండు స్థితులు ఎరుక లక్షణములే. స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు ఈ రెండు నిర్ణయములు లేకపోవుచున్నవి. ఈ భావము బహు కఠినమై గురుముఖతా మాత్రమే వస్తునిశ్చయపూర్వకముగా దృఢపరచుకొనవలసి యున్నది.

**కం॥ కలనేన్గు సింహమును కన్నులగన మృతి జెందినట్లు। యుళ్ళుక్క గునీవలగురు కృపచే బయలుం। దెలసూరికె యుంటి వేని తీరును మాటా॥ 45**

## ప్రతిపదార్థము

కల నేనుగు సింహమును కన్నులగన = ఏనుగు తన స్వాప్నావస్థ యందు సింహమును కనులార గాంచి

మృతి జెందినట్లు = ఆ సింహముచే తాను చంపబడినట్లుగా

వుళ్ళుక్కగు = నీగుర్తు కూడా లేకపోవును

అల గురుకృపచే = గురుమూర్తి యొక్క అనుగ్రహము ద్వారావస్తు నిశ్చయపూర్వకముగా ఎరుక పరిపూర్ణములను గుర్తించి

బయలునుదెలసి=వరివూర్ణము స్వత:సిద్ధమై యుందని దృఢపరచుకొంటివేని

వూరికే వుంటివేని = పరిపూర్ణము వున్నదనిగాని, ఎరుక లేనిదనిగాని ఎట్టినిర్ణయము చేయక

దీరును మాట = జనన మరణ భ్రాంతి రహిత విధానము దృఢపడగలదు

## తాత్పర్యము

సింహము, ఏనుగు ఇవిజాతి వై విధ్యము గలవి. సింహమనిన ఏనుగునకు తగనిభయము . ఇట్టి లక్షణముచే ప్రకృతి సిద్ధమైన స్వాప్నావస్థను జెందినపుడు అందు ఈ భయ భావము ప్రవేశించి తన్ను, సింహము, చీల్చి చంపుచున్నట్లుగా భావించును. ఇట్టి దృఢమైన భావనా బలముచే, మెళకువ చెందినప్పటికి, పై భావము వెంబడించి, ఆహార, విహారములు క్రమము తప్పి చిక్కి, శల్యమై క్రుంగి నశించిపోవును. ఆవిధంగానే గురుకృపచే ఎరుక పరిపూర్ణములు వస్తునిశ్చయపూర్వకంగా దృఢపరచుకొని ఉన్నదిపరిపూర్ణమని, అందు గుర్తెరిగేతనకు మూలముగాని స్థానముగానీ లేదని దృఢపరచుకొని పరిపూర్ణము వున్నదనిగానీ ఎరుక లేనిదనిగానీ ఎట్టి నిర్ణయమును చేయక వుండుటచే జనన మరణ భ్రాంతి రహితము కలుగ గలదని తెలియవలెను.

**కం॥ ఎప్పటికీ యొక్కరీతిగ। తప్పక నిలచున్న దాన్నిదయతో
గురుడుం జెప్పినగని యగణితమగు। తిప్పలుగల నిన్ను నీవు।
దీసితె సరిరా॥ 46**

## ప్రతిపదార్థము

ఎప్పటికి = సర్వకాల సర్వావస్థలయందు
ఒక్కరీతిగా = ఎట్టి మార్పులకు పరిణామములకు లోను కాకుండా
తప్పక నిలుచున్నదాన్ని = స్వత:సిద్ధమై ఎట్టి కదలిక లేని దానిని
దయతో = అత్యంత అనుగ్రహంతో
గురుడుంచెప్పిన గని = వస్తునిశ్చయ పూర్వకంగా గురువు ప్రబోధించిన దానిని దృఢపరచుకొని
అగణితమగు = లెక్క కట్ట లేనంత
తిప్పలుగల = జనన మరణములకు లోనగుచున్న
నిన్ను నీవు = నీ గుర్తెరిగే శరీరమును నీగుర్తుచే
తీసితె సరిరా = విడిచియుండిన భ్రాంతి రహితము కాగలదు

## తాత్పర్యము

సకల దేశములయందు, సర్వకాలములయందు, సమస్తమైన వస్తువులయందు చలించక తనకు తానై స్వత:సిద్ధమైయున్న అచల పరిపూర్ణమును (అచలము, బయలు, పరిపూర్ణము) సూచనద్వారా దానియందు మూలము గాని, స్థానముగాని లేక తోచుచున్న ఎరుకను వస్తునిశ్చయ పూర్వకముగా గురుమూర్తి దృఢపరచి జన్మకర్మలకు సర్వభ్రాంతులకు కారణమైయున్న గుర్తెరిగే శరీరము విడిచియుండిన (గురు వాక్యముద్వారా) పరిపూర్ణబోధక్రమము పూర్తియై జనన మరణ భ్రాంతి తొలగునని తెలియవలెను.

**కం॥ నీవున్నచోట నుండును। నీవివిధ విచిత్రజగము నీతో గూడన్।
నీవు లేనట్టి చోటను। నీ వివిధ విచిత్రజగము నిలువదుకుర్రా॥47**

## ప్రతిపదార్థము

నీవున్నచోటనుండును = నేననే గుర్తుయున్న చోట దానికి సంబంధించిన పరిణామ మంతయు దానియందే నిక్షిప్తమై యుండును

వివిధ విచిత్ర జగము = భిన్నభిన్న రీతులుగా పరస్పర విరుద్ధమై యున్న ప్రపంచమంతయు

నీతో కూడన్ = ఆవిర్భావ తిరో భావములచే గుర్తుచే కలిసియుండును

నీవు లేనట్టి చోటను=నేననే గుర్తెరిగే శరీరము లేక స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు

ఈ వివిధ విచిత్ర జగము = నానాత్వముతో కూడిన చిత్రవిచిత్రములుగా తోచబడుచున్న ఈ గుర్తెరిగే శరీరము

నిలువదు కుఱ్ఱా = లేకుండా పోవుచున్నది నాయనా

## తాత్పర్యము

అధిష్టానమందున్న గుర్తు సృష్టికి పూర్వము బీజరూపముగా నుండును. అందు ఈ నానాత్వమంతయూ ఇమిడియుండును. ఎట్లనగా బీజమునందు వృక్ష మంతయూ ఉండునట్లుగా ఆవిర్భావమందు పంచాకాశ పద్ధతిచే నానాత్వమంతయూ ప్రకటమౌను. తిరోభావమునందు మరల వీటినంతటినీ తనయందు ఇముడ్చుకొని బీజరూపముగా మార్పుచెందును. స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు ఇట్టి గుర్తునకు మూలముగానీ, స్థానముగానీ లేదని దృఢపరచుకొన్నమీదట గానీ ఈగుర్తు నశించదని తెలియ వలెను.

**కం॥ నానావికారములుగల నానావిధ నామరూప నటనలు గలయీ।**
**నీనా దశదిశలనుగల। దీనందేలేకమనము తిరుగుటమప్పా॥48**

## ప్రతిపదార్థము

అప్పా = నాయనా

నానావికారములు గల = అనేకమైన పరిణామములకు లోనైవున్న

నానావిధ నామరూప నటనలుగల = అనేకమైన పేర్లు, రూపం నటనలు గలిగివున్నా

ఈ నీనా దశదిశలను గన = ఇట్టి గురుశిష్యుల యొక్క
పది దిక్కుల యందు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు
దీనందే = ఇట్టి వస్తువు నందే
లేక = మూలముగాని స్థానముగాని లేక
మనము = గుర్తెరిగే లక్షణములు గలిగిన మనయిరువురము
తిరుగుట = ఆ విర్భావ తిరోభావములు చెందుచూ వునికి కలిగి వున్నాము

## తాత్పర్యము

సృష్టి కారణమైన ఎరుక అనేక విధములైన మార్పులకు లోనై పలువిధములైన నామ, రూప, క్రియ, నటనలకు లోనైవున్నది. దీని బాహ్యాభ్యాంతరములయందు స్వత:సిద్ధమైన పరిపూర్ణము నిండి నిబిడీకృతమై యున్నది. అట్టి దానియందు మూలముగానీ స్థానముగానీ లేకనే ఈగుర్తు ఉనికి కలిగి ఉన్నది.

**కం॥ అబ్బీయీ బయలున్నది దబ్బున గురుడెరుకజేయ దబ్బర
నను చున్। దెబ్బకు మాయముగాకను కబ్బము జెప్పుటకు
నిల్వగలవే నీవున్॥ 49**

## ప్రతిపదార్థము

అబ్బీ = నాయనా
ఈ బయలున్నది = పరిపూర్ణము స్వత:సిద్ధమై వున్నది
దబ్బున = శీఘ్రముగా
గురుడెరుక జేయ = వస్తునిశ్చయపూర్వకముగా దృఢపరచగా
దబ్బరననుచున్ = వున్న దున్నట్లుగా గ్రహించిన వెంటనే
దెబ్బకు మాయము గాకను = వెనువెంటనే తాను లేకపోవును
కబ్బము చెప్పుటకు = అనుభవము చెప్పుటకు లేక వున్నదని చెప్పుటకు
నిల్వగలవే నీవున్=మూలముగాని స్థానముగాని లేని నీవు వుండుటకు అవకాశమే లేదు

## తాత్పర్యము

వస్తునిశ్చయపూర్వకంగా పరిపూర్ణముయొక్క ఉనికిని గురుమూర్తి దృఢపరచిన మీదట వెను వెంటనే దానిని దృఢపరచుకొని అట్టి దానియందు తనకు మూలముగానీ, స్థానముగానీ లేదని ఆరూఢపరచుకొని ఎట్టి అనుభవము చెప్పుటకు వీలుగాక వెను వెంటనే లేకపోవుచున్నది.

**కం॥ మూలము లేకనె వచ్చిన। నీ లీలలు జూచుకొనుచు నీవె మురతువీ। బయలున్న దనుచు దోచితె నీలేమిని నీవెరింగి నిలువవు కుర్రా॥ 50**

## ప్రతిపదార్థము

మూలము లేకనే వచ్చిన = స్వత:సిద్ధమైన వస్తువునందు ఎట్టి ఆధారము లేకనే వునికి కలిగియున్న
నీ లీలలు చూచుకొనుచు = నీ వునికిని వ్యవహారమును గుర్తించి
నీవే మురుతువు = నీకు నీవుగా సంతోషిస్తున్నావు
బయలున్న దనుచు తోచితే = పరిపూర్ణము స్వత:సిద్ధమై వున్నవిధానము, దృఢపరచుకొన్న మీదట
నీలేమిని నీవెరిగి = దానియందు మూలముగాని స్థానముగాని లేనిదని నీకునీవుగా దృఢపరచుకొని
నిలువవు కుర్రా = లేకుండా పోతావు

## తాత్పర్యము

సిద్ధాంతరీత్యా పరిపూర్ణము స్వత:సిద్ధమై యున్నది. దానియందు గుర్తెరిగే ఎరుకకు మూలముగానీ, స్థానముగానీ లేకనే తోచుచున్నది. ఇట్టి గుర్తెరిగే శరీరం తనమూలమును, పరిణామమును, విలువను, ఉనికిని గుర్తించి తాను శాశ్వతముగా భావించును. గురుర్వాక్యం దృఢమైన పిమ్మట తాను లేనిస్థితిని గుర్తించి ఉండుటకు వీలు లేకపోవునని తెలియ వలెను.

కం॥ జ్ఞాన కర్మస్వరూపముగాని బయల్ నదుగొచూచి। కల కాలము
యీ జ్ఞానకర్మ స్వరూపంబౌ। నిను నీవెరిగి మృషని పని
వినవోయీ॥ **51**

## ప్రతిపదార్థము

జ్ఞానము కర్మము రెండును కాని బయలు = గుర్తెరిగే లక్షణము కలిగినజ్ఞానముగాని, సమస్త చలనములకు ఆధారముగానున్న ప్రాణముగాని ఈ రెండు లక్షణములు ఒకే వస్తువుగా వున్న గుర్తెరిగే శరీరముతో సంబంధపడక స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమును
అదిగో చూచి = నీకు వేరుగా వున్నదానిని నీ గుర్తుచే వుండజూచి
కలకాలము = ఎల్లపుడూ
ఈ జ్ఞానము కర్మము రెండౌ నిను = ద్వంద్వ రూపముగా జ్ఞాన, ప్రాణములుగా తెలియబడుచున్న నీ గుర్తును
నీ వెరిగి మృషని = స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు వీటికి, మూలముగాని, స్థానంగానీ లేదని గురువాక్యముచేత దృఢపరచుకొని
పనివినవోయి = మానవోపాధికి వచ్చినందులకు గురుధర్మములో ప్రవేశించి నందులకు నీవు చేయ వలసిన అతిముఖ్యమైన పనిగా తెలిసి కొనుము.

## తాత్పర్యము

జన్మకర్మలకు కారణమై యున్నవస్తువును గురుముఖత: వస్తునిశ్చయపూర్వకంగా విచారించినచో జ్ఞానము, ప్రాణముగా తెలియబడుచున్నవి. రూపాయి నాణెమునకు బొమ్మ, బొరుసులవలె ఈ రెండూ ద్వంద్వైక ఏకముగాను, ఏకైక ద్వంద్వముగాను చెప్పబడుచున్నవి. ఇవి ఎట్లో గురుముఖత: వస్తునిశ్చయ జ్ఞానముగా తెలుసుకున్నవారికి సుస్పష్టముగా తెలుస్తుంది. ఈ రెంటితో సంబంధపడక వేరైవున్నది అచల పరిపూర్ణము. అట్టి దానియందు ఈ గుర్తెరిగే శరీరమునకు మూలముగానీ, స్థానముగానీ లేదని గురుముఖత: గుర్తించి ద్వాదశి, షోడశి వాక్యములద్వారా అట్టి గుర్తును విడిచి ఉండవలెను. దుర్లభమైన మానవో పాధికి

వచ్చినందులకు, జన్మనుకృతముచే పరిపూర్ణబోధ గురువును ఆశ్రయించినందులకు చేయవలసిన, పొందవలసిన దీనిని అతి ముఖ్యమైన పనిగా తెలుసుకొనుము.

కం॥ ఈ నిర్మలమౌ బయలున। నానాగమ నిగమకల్ప నాయనటంటె।
యే నరులు నమ్మరిందుకు। నానీయందున నటంటే నమ్మిన
మాడ్కిన్॥ 52

## ప్రతిపదార్థము

ఈ నిర్మలమౌ బయలున=ఎట్టి మాలిన్యము లేక స్వత:సిద్ధమై యున్న పరిపూర్ణమునందు
నానాత్వములుగా = అనేక విధములుగా
అగమ, నిగమ=కర్మ కాండకు, ఉపాసనాకాండకు సంబంధించిన శబ్దప్రమాణములు
కల్పనాయెనటంటే = ఏర్పడినవి లేక వుద్భవించినవి అను సిద్ధాంతము
ఇందుకు ఏ నరులు నమ్మరు = సత్యము తెలిసిన మహాత్ములు ఈ వాదము నంగీకరించరు
నీనా యందు నటంటే = నేను, నీవు అనుగుర్తుచేత ఏర్పడినట్లుగా
నమ్మిన మాడ్కిన్ = విశ్వసించిన పద్ధతిగా

## తాత్పర్యము

స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమునందు ఎట్టి పరిణామ క్రమములకు తావులేదు. దానియందులేక తోచబడుచున్న గుర్తెరిగే ఎరుక యొక్క పరిణామక్రమములో వరుస క్రమముగా శబ్దాది అంశములు ప్రకటమై ధ్వన్యాత్మకము వర్ణాత్మకముగా పరిణమించి శాస్త్రములన్నియు ఏర్పడి యున్నవి. ఈ విధానమంతయు, గురుముఖత: వస్తునిశ్చయపూర్వకముగా పరిపూర్ణ బోధను ఆరూఢపరచుకున్నవారికి తెలియగలదు.

కం॥ నేనీవనని మహాత్ముని। కీనిగ మాగమవిచారణ మిష్టతియౌనా।
నేనీవని యీాపల్కే నానీకే యిష్టతౌర నానాయన్నా॥ 53

## ప్రతిపదార్థము

నా నాయన్నా = ఓ శిష్యుడా
నేనీ వనని మహాత్మునికి = నేను నీవనే గుర్తు విడచిన పరిపూర్ణభావజ్ఞునికి
ఈ నిగమాగమ విచారము=శాస్త్రములుగా చెప్పబడుచున్న, కర్మకాండ, జ్ఞానకాండ
ఇష్టతి యౌనా = ఇష్టము కాగల్గునా
నేనీవని ఈపల్కే = నేను, నీవను గుర్తుతో వ్యవహరించు
నా నీకే = నీవు నేనుగా వ్యవహరించు ఈ గుర్తుకే
ఇష్టతౌరా = యిష్టము కాగల్గుతుంది

## తాత్పర్యము

శాస్త్రమనగా శాసించి రక్షించునది అని అర్థము. ఇది కర్మకాండ, వుపాసనాకాండ అనుపేర ప్రచారములో వున్నది. వర్ణాశ్రమ ధర్మములననుసరించి, ఇందలి విధి విధానములు పాటింపబడుచున్నవి. యివన్నియు నేను, నీవనే ద్వంద్వ పద్ధతిగా నున్న ఎరుక చేతనిర్దేశింప బడినవే. ఇవన్నియు పుణ్య, పాప కర్మలకు హేతువులుగా చెప్పబడుచున్నవి. తద్వారా జన్మపరంపరలకు కారణముగా నున్నవి. ఇట్టి ద్వంద్వ పద్ధతి గల నేననే ఎరుకకు స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేదు. ఇట్టి భావము దృఢమైనవారికి శాస్త్ర విధి ననుసరించి, పాటింపబడు కర్మలుగాని వాటి ఫలానుభవములుగాని వుండవు. ఏలననగా వారు భ్రాంతి రహిత విధానమునందు,కర్తృత్వరహిత కర్మాచరణ ద్వారా అన్ని పనులు చేయుచు పునరావృత్తి రహిత విధానమందు జీవించు చుందురు.

కం॥ కలవేళ్ళను యీ మేల్కను। గల యీ బయలుండ జూచికల మేల్కలలో। గలలేనినిన్ను నీమేనులు లేవని నీవు దెలిసి యుండుము చాలున్॥ **54**

## ప్రతిపదార్ధము

కల వేళ్ళను = కల, అందలి దృశ్యములను అనుభవించుకాలమందు
ఈ మేల్కను = మెళుకువ పొందిన స్థితియందుగల అంశము నందును
గల = వున్నటువంటి
ఈ బయలుండ జూచి=స్వత:సిద్ధమైన పరిపూర్ణము వున్నదని దృఢపరచుకొని
కల మేల్కలలో గల=కలయందు, మెళకువయందు సమానముగా తోచబడుచున్న
లేని నిన్ను, నీమేనులు = లేకనే తోచబడుచున్న నీ గుర్తును, దాని ఆవరణను
లేవని = లేనివని, నిజము కానివని
నీవు తెలిసుండుము = గురువాక్యముచే గట్టిగా దృఢపరచుకొనుము
చాలున్ = జన్మ రహిత విధానమునకు ఇట్టి భావము సరిపోవును

## తాత్పర్యము

కల సమయమునందు, మెళుకువ గల సమయమునందు కూడా ఇట్టి మార్పులకు, పరిణామములకు లోనుకాక స్వత:సిద్ధమైయున్న అచల పరిపూర్ణమును గురుర్వాక్యముచే దృఢపరచుకొని పైరెండు స్థితులయందు, వున్నట్లుగా చెప్పబడుచున్న, నిన్ను, నేనను ఆవరణములు లేనివని లేక, నిజము కానివని, గురుర్వాక్యముచే దృఢపరచుకొన్న చాలును. జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు, ఇదియే క్రమముగా చెప్పబడుచున్నది.

**కం॥ మేనుజడ మజడమనినను। నేనును యీ రెండు గలిసి నే**
**ననబడు। స్వాప్నానందమె మదవస్థగు నేనేనను మృషని**
**తెలియనే మృషనౌదున్॥ 55**

## ప్రతిపదార్ధము

మేను జడమజడ మనినను నేనును = నేను, మేను గా తోచబడుచున్న గుర్తుచైతన్యవంతముగాను చైతన్య రహితముగాను కూడా చెప్పబడుచున్నది.
నేననబడు = పై రెండు వస్తువులు కలసి నేనను గుర్తుగా తెలియు చున్నవి
స్వాప్నానందమె మదవస్థగు = కలయందు తోచబడు దృశ్యాదృశ్యములే నేనను గుర్తుకు కారణము, మూలము

నేనే = ఇట్టి ద్వంద్వ పద్ధతిగా తోచబడు నేనే
నను మృషని తెలియ = వున్న పరిపూర్ణము నందు లేక తోచబడుచున్నాను అని దృఢ పరచుకొన్న మీదట
నే మృషనౌదున్ = నేనులేక పోవుచున్నాను

## తాత్పర్యము

జడమనగా కదలిక లేనిది, అజడమనగా చైతన్యవంతమైనది. ఈ రెండునూ కలసి నేననే వస్తువుగా, చెప్పబడుచున్నవి. ఏకైక ద్వంద్వము, ద్వంద్వైక ఏకముగా తెలియబడుచున్నవి వస్తునిశ్చయ పూర్వకముగా గురుముఖత: విచారించినవారికి ఇది అనుభవనీయమై వున్నది. ఈ రెండును కలసి నేనను గుర్తు ఏర్పడు చున్నది. స్వప్నమే దీని సహజావస్థ గురుబోధచే మేలుక చే కొన్న వారికి ఉన్న దానియందు దీనికి మూలముగాని స్థానముగాని లేదని దృఢ పరచుకొన్న మీదట ఇది లేనిదగుచున్నది.

కం॥ నేనెతానైతె నావలె। యీ నేలేనట్టి బ్రహ్మ నేననకున్నే
నేనందునేనులేనిదే। మేనుజగత్తులై దోచి మృషనౌ చుందున్॥ 56

## ప్రతిపదార్ధము

నేనేతానైతే = నేనని ఎరిగే ఎరుకే అచల పరిపూర్ణముగా చెప్పబడితే
నావలెనె = నాలాగునే
ఈ నే లేనట్టి బ్రహ్మ = ఈ నేననేగుర్తు లేక స్వత:సిద్ధమై వున్నపరిపూర్ణము
నేననకున్నే = నేననే గుర్తుతో వ్యవహరించునా
నేనందు=పరిపూర్ణబోధరీత్యా దృఢపరచుకొన్న మీదట నే చెప్పు విధానముతో
నేనులేనిదె = నేననే గుర్తు లేనిదని
మేను జగత్తులై తోచి = నేను మేనులుగా జీవేశ్వరులుగా తోచబడి
మృషనౌ చుందున్ = గురువాక్యముచే లేకపోవుచున్నాను

## తాత్పర్యము

నేననే భావనతో కూడియున్నది ఎరుక. ఇట్టి భావనకు తావులేక దీనికి వేరైవున్నది పరిపూర్ణము. దానికి నేనను గుర్తుతో ఏమాత్రము

సంబంధములేదు. ఇట్టి గుర్తు స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేకనే జీవేశ్వర జగత్తులుగా తోచబడి గురుబోధచే చివరకు లేకపోవుచున్నది.

**కం॥ కానరావారు మతములు। నానాగమ నిగమసమితి। నామము రూపంబేను లేనపుడు నాకై నేనరుదెంచినను వెంటనేయ వివచ్చున్॥ 57**

## ప్రతిపదార్ధము

కానరావు ఆరు మతములు = నేననే గుర్తు లేకపోయిన పిదప, దానిచే కల్పింపబడిన వైష్ణవము, శైవము, శాక్తి కేయము, గాణాపత్యము, శౌరము, కాపాలికము అనుమతములు నిలిచి యుండవు

నానాగమనిగమసమితి = నానాత్వముతో కూడిన కర్మకాండ, జ్ఞానకాండ, వుపాసనాకాండ లయొక్క సమూహము

నామ రూపంబులు = నానావిధ నామములు రూపములు

ఏనులేనపుడు=నేను లేక పోయిన పిదప నేను నిజము కాదని భావించిన పిమ్మట

నాకై నేనరు దెంచినను = నాకు నేనుగా నేననేగుర్తుగా తోచబడుచున్నపుడు

వెంటనే యవివచ్చున్ = నాతోపాటుగా, పైన పేర్కొన్న వన్నియు తోచబడును

## తాత్పర్యము

విష్ణువే దేవుడుగా చెప్పబడుచున్నవైష్ణవ మతము, శివుడే దేవుడుగా చెప్పబడుచున్న శైవము, శక్తే దేవుడుగా చెప్పబడుచున్న శాక్తికేయము, గణపతియే ధేవుడుగా చెప్పబడుచున్న గాణాపత్యము, సూర్యుడే దేవుడుగా చెప్పబడుచున్న శౌరము, వీరభద్రుడే దేవుడుగా చెప్పబడుచున్న కాపాలిక మతము అనునవి 6 మతములుగా ప్రపంచమందు వ్యాప్తిలో నున్నవి. ఇవన్నియు నేననేగుర్తుయొక్క పరిణామములే. ఆయా దేశకాలపరిస్థితులనుబట్టి ప్రచారములోకి వచ్చినవి. ఇవి కాక కర్మ కాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ అనునవి వేద విభాగముచే

నిర్ధేశింపబడి ఉన్నవి. ఇవన్నియూ నేననేశబ్ధముయొక్క పరిణామములే. నేననేగుర్తుచే ప్రకటమై, దానితోనే లేకపోవును.

**కం॥ నామీది ప్రేమచేతను। యీమనుజులు నిలుపదలచి యెన్నో**
**యుక్తుల్। తా మొనరించిన నిలుతునె। నేమృష, మృషనిల్వ**
**గలదె। నిశ్చయము వలెన్॥ 58**

## ప్రతిపదార్ధము

నామీద ప్రేమచేతను = నేననేగుర్తుయొక్క సత్యత్వము నిలబెట్టుటకై
ఈ మనుజులు = మనస్సనే పదార్ధము విశేషముగా గలవారు
నిలుప దలచి = శాశ్వతము గా నుండునటుల చేయుటకై
ఎన్నోయుక్తులుతా మొనరించిన = అనేకములైన శాస్త్రములు, ప్రమాణములు, రచించిన నేను శాశ్వతముగానుండుటకు వీలులేదు
నేమృష = పరిపూర్ణ సిద్ధాంతరీత్యా నేననేగుర్తులేనిది
మృష నిల్వగలదె నిశ్చయమువలెన్ = శాశ్వతమైన వస్తువు యందు అశాశ్వతమైన వస్తువు నిలిచి వుండుటకు వీలగునా?

## తాత్పర్యము

శాస్త్రమునందు నేననేగుర్తునకు సచ్చిదానంద లక్షణములు చెప్పబడుచున్నా, అవి ఋజువు చేయుటకు పలురకములైన ప్రమాణములు పేర్కొనబడుచున్నవి. వీరు ఎంత ప్రయత్నము చేసినా స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు ఈ నేను లేనిదగుచున్నది. శాశ్వతమైన పరిపూర్ణమునందు ఈ నేను లేనిదగుచున్నది. శాశ్వతమైన వస్తువునందు మార్పులకు లోనగుచున్న అశాశ్వత వస్తువు ఎట్లునిల్వగలదు?

**కం॥ నీతండ్రి తాతలవలెనే। నీతనయులు నీవు జనుట**
**నిశ్ఛయముకదా। మీతోటి రాదుగద బయలీ తెరగెరిగినపుడు**
**శూన్యమేదో గనరా॥ 59**

## ప్రతిపదార్థము

నీతండ్రి తాతల వలెనె = నీ తండ్రి తాతలు చనిపోయిన విధంగానే
నీ తనయులు నీవు చనుట నిశ్చయముగదా = నీవు నీపుత్రులు కూడా నశించిపోవుట సహజమే కదా
నీతోటి రాదుగదా బయలు = స్వత:సిద్ధమైవున్న పరిపూర్ణము వీటితో సంబంధపడక వేరైవున్నది కదా
ఈ తెరగెరిగినపుడు=ఈ విధముగా వస్తునిశ్చయపూర్వకముగా విచారించి నపుడు
శూన్యమేదో కనరా=లేనిదేదో వున్నదేదో స్పష్టముగా విచారించి తెలిసి కొనుము

## తాత్పర్యము

సృష్టి పరిణామక్రమమునందు నిరంతరము మార్పుకు లోనై వున్నది. తాతలు, తండ్రులు, తనయులు అను క్రమమునందు ఇట్టి మార్పు స్పష్టముగా తెలియును. ఇట్టి మార్పునకు లోనుకాక, సంబంధపడక స్వత:సిద్ధమై వున్నది పరిపూర్ణము. ఈ రెండు విధానములను స్పష్టముగా విచారించి సత్యమై, నిత్యమై ఉన్నదేదో అనిత్యమై, మార్పులకు లోనైవున్నదేదో గ్రహించి దృఢపరచుకొనుము.

## బయలు లక్షణము

బయలు అనగా ఖాళీ ప్రదేశము అని అర్థము. పంచభూతములలో ఆకాశమునకు ఈ లక్షణము కలదు. పంచాకాశ పద్ధతిచే సృష్టి కారణమగు, అధిష్టానమగు ఆత్మకుకూడా బయలు లక్షణము చెప్ప బడును. బయలు+ బయలు = బట్ట బయలు (ఆకాశము + ఆత్మ) కేవలత్వము కలిగిన అచల పరిపూర్ణము కూడా బయలు శబ్దముచే సూచింపబడుచున్నది. ఇచ్చట బయలనగా గుర్తించే తనకు వేరై వున్నది. అని లక్ష్య లక్ష్యార్థముగా చెప్పుటకు కూడా ఈ శబ్దము ప్రయోగింపబడుచున్నది. సందర్భానుసారముగా బయలు శబ్దమునకు వివరణ పొందవలసియున్నది. ఇది అత్యంత గురుగోప్యమైన విషయము. ఇక్కడ సందర్భమును బట్టి కేవలత్వము కలిగి ఎట్టి పరిణామ క్రమములకు

లోనుగాకున్నవస్తువును సూచించుటకే ఈ శబ్దప్రయోగము గావింపబడినది.

**కం॥ బయలెపుడు పుట్టి గిట్టదు। బయలెప్పుడు ముట్టుకోదు బ్రహ్మాండంబుల్। బయలెపుడు నన్నెరుంగదు। బయలెప్పుడు జేయబోదు। పనులెవ్వైనన్॥ 60**

## ప్రతిపదార్థము

బయలు = కేవలత్వము కలిగిన పరిపూర్ణము
పుట్టి గిట్టదు=ఎట్టి మార్పులకు లోనుకాదు (ఆవిర్భావ తిరోభావములు చెందదు)
ముట్టుకోదు బ్రహ్మాండంబుల్ = పృధివ్యాది పంచభూతములతో కూడియున్న బ్రహ్మాండమును అంటుకొని లేక తగులుకొని యుండదు
నన్నెరుంగదు = నేననే గుర్తుతో ఎట్టి సంబంధముపడదు
చేయబోదు పనులెవ్వైనన్ = ఉత్పత్తి, స్థితి, నాశనములతో సంబంధపడదు

## తాత్పర్యము

స్వతఃసిద్ధమైన అచల పరిపూర్ణము ఎట్టి పరిణామ క్రమములకు లోనుకాదు. ఆవిర్భావ, తిరో భావములు చెందదు. పృధివ్యాది పంచభూతములతో కూడుకున్న బ్రహ్మాండమును తాకదు. నేననేగుర్తుతో ఎట్టి సంబంధము పడదు ఉత్పత్తి, స్థితి, లయములను పనులకు కారణము కాదు.

**కం॥ బయలనిన నిత్యవస్తువు బయలన నొకరీతి నుండు బ్రహాండములో। బయలనిన కండ్లబడనిది। బయలన బ్రహ్మాండమవల బరగెడిది సుమీ॥ 61**

## ప్రతిపదార్థము

బయలనిన = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము
నిత్యవస్తువు=సకలకాలములందు సకల వస్తువులయందు నిండియుండునది
ఒక రీతినుండు బ్రహ్మాండములో = ఎట్టి కదలిక లేక మార్పుకులోనుకాక సర్వే సర్వత్రా ఇతర వస్తువులకు చోటులేక వ్యాపించి యున్నది
కండ్ల బడనిది = జ్ఞానేంద్రియములకు ముఖ్యమైన చక్షురింద్రియముగాని,

దానికి ఆధార, అధిష్టానముగా పనిచేయుచున్న జ్ఞానమునకు గాని విషయ రూపముగానిది

బ్రహ్మాండము మవల బరగెడిదిసుమీ = వ్యష్టి జీవోపాధులకు ఆధార అధిష్టానములుగా నున్న పంచభూతాత్మకమగు బ్రహ్మాండమునకు కూడా వేరై, వున్న దానితో సంబంధపడక వునికి కలిగి వున్నది.

## తాత్పర్యము

అచల పరిపూర్ణము సకలదేశములందు, సర్వ కాలములయందు, సమస్త వస్తువులయందు చలించక తనకు తానుగా ఎట్టి ఆవిర్భావ తిరో భావములకు(మార్పులకు) లోనుకాక మనోమయకోశమునకు గాని దానికి అధిష్టాన రూపమగు జ్ఞానమునకు గాని విషయముకాక వ్యష్టి జీవోపాధులన్నిటికీ మాతృస్థానముగా చెప్పబడుచున్న బ్రహ్మాండమునకు కూడా వేరై దానితో సంబంధపడక ఉనికి కలిగి యున్నది.

**కం॥ బయలనిన నేనులేనిది। బయలనిన నుపాధిగాన బడనిది యెపుడున్। బయలనిన పలుకులేనిది బయలిట్టిది యనుచు తెలియ బడదెవ్వరికిన్॥ 62**

## ప్రతిపదార్ధము

బయలనిన = అచల పరిపూర్ణము

నేనులేనిది=నేననే గుర్తెరిగే శరీరమునకు మూలముగాని, ఆధారముగాని కానిది

వుపాధి కానబడనిది ఎపుడున్ = ఈశ్వరాండముగా చెప్పబడుచున్న అక్షరోపాధిగాని, జీవాండముగా చెప్పబడుచున్న క్షరోపాధితో గాని సంబంధపడనిది

పలుకు లేనిది = శబ్దాది పంచతన్మాత్రలుగాని, ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము అగు శబ్దప్రపంచముతో సంబంధపడనిది

ఇట్టిదని తెలియ బడదెవ్వరికిన్ = గుర్తెరిగే జ్ఞానమునకు విషయము కాక, జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అనుత్రిపుటి మీరియున్నది

## తాత్పర్యము

అచలపరిపూర్ణము నేననేగుర్తు లేనిది, క్షరాక్షరోపాదులతో సంబంధపడనిది, ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము అను శబ్ధప్రపంచముతో సంబంధంలేనిది, జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అను అంతర్ త్రిపుటితో సంబంధపడనిది.

**కం॥ చెప్పి చూపించరానిది। యప్పా యల్లదుగొచూడు మని నేనీకున్**
**చెప్పి చూపిస్తి మరువకు। యెప్పటికిది నమ్మిలేని యెరుకను విడరా॥ 63**

## ప్రతిపదార్థము

అప్పా = నాయనా
చెప్పి చూపించరానిది = చూసి, చెప్పి వివరించేటందుకు వీలుకానిది (మనోవాక్కులకందనిది)
అల్లదిగో చూడుమని = గుర్తెరిగే నీకు వేరై సంబంధపడక ఎట్లు వునికి కలిగి వున్నదో వివరించగా
నేనీకు చెప్పిచూపిస్తి=వస్తునిశ్చయపూర్వకముగా నేను నీకు దృఢపరచియున్నాను
మరువకు = అట్టి భావమునందు నిర్లక్ష్యము లేక దృఢ పరచుకొనుము
ఎప్పటికీయిది నమ్ము = ఎల్లవేళల ఈభావమును అత్యంత శ్రద్ధతో, విశ్వాసముతో దృఢపరచుకొన్నమీదట
లేని ఎరుకను విడరా = స్వత:సిద్ధమైవున్న దానియందు మూలముగాని స్థానముగానిలేక తోచబడుచున్న ఈ గుర్తెరిగే శరీరమును విడచి వుండుము.

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమును సాక్షాత్తుగా చెప్పి చూపించుటకు వీలుకాదు ఏలనన, అది మనో వాక్కులకు గాని, వాటి కధిష్టానమైయున్న జ్ఞానమునకుగాని విషయము కాదు. అట్టి దానిని వస్తునిశ్చయ పూర్వకంగా నీకు లక్ష్యలక్ష్యార్థముచే దృఢపరచి యున్నాను. ఇట్టి అంశమును బాగుగా

దృఢపరచుకొన్న మీదట అట్టిదానియందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న ఈ గుర్తెరిగే ఎరుకను లేనిదని గురువాక్యము(షోడశి) ద్వారా విడచి యుండుము.

**కం॥ ఉన్నదిగద నేజెప్పిన। దన్నా దాన్నుండజూచి తలగుము మృషయౌ। నిన్నంటి యున్న సంపద। లన్నింటి గొని నీవు వచ్చి। నట్లు మృషగుచున్॥ 64**

## ప్రతిపదార్థము

అన్నా = నాయనా
వున్నది గదా నేచెప్పినది = వస్తునిశ్చయపూర్వకంగా నేను దృఢ పరచియున్న స్వత:సిద్ధమైవున్న అచలపరిపూర్ణము వున్నది ఉన్నట్లుగా
దాన్ని వుండజూచి = స్పష్టముగా అట్టి దానిని దృఢపరచుకొని
తలగుము = విడిచి యుండుము
మృషయౌ = నిజము కాదని
నిన్నంటియున్న సంపదలన్నిటినీ గొని నీవు వచ్చినట్లు = నేననేగుర్తుతో సంబంధపడి పరిణామక్రమమునకు లోనైవున్న జీవేశ్వర జగత్తుతో సహా
మృషగుచున్ = నిజము కాదని

## తాత్పర్యము

వస్తునిశ్చయ పూర్వకంగా పరిపూర్ణము ఎరుకలను నేను బోధరీత్యా నీకు దృఢపరచిన మీదట, ఈ అంశములను గట్టిగా సమాధానపడి గుర్తించిన నీ తెలివిని లేనిదని(నిజము కానిదని) విడిచి యుండుము. ఇట్టి స్థితియందు పరిణామ క్రమములో జతపడి, నీతోకూడియున్న జీవేశ్వర జగత్తుతో సహా నీతోపాటుగా లేనివని నిజము కావని దృఢమగును.

**కం॥ పంచకోశముల సంచును। మించినదీ యెరుక యనుట మేలాబయలం। చెంచినదగు నాముచ్చట అంచిత సద్భక్తి యుక్త అమితాసక్తా॥ 65**

## ప్రతిపదార్థము

అంచిత = అత్యంత ఎడతెగని
సద్భక్తియుక్తా = చక్కని భక్తితో కూడుకున్నవాడా
అమితాసక్తా = జనన మరణ భ్రాంతి రహితవిధానమును పొందవలెనని గాఢమైన కోరిక కలవాడా
పంచకోశముల సంచును = అన్నమయాది కోశముల సమూహమును
మించినదీ ఎరుక యనుట = విలక్షణమై వేరైవున్నది హిరణ్మయ కోశమనే ఎరుక అనుమాట
మేలా = అనదగునా,మంచిదా
బయలందెంచినదగు = స్వత:సిద్ధమైయున్న అచలపరిపూర్ణమునందు
అముచ్చట = ఈ అరూఢత
తగు = సరిపోవును

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమునందు, అన్నమయ, ప్రాణామయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములకు వేరై విలక్షణమై స్వయం సత్తా కలిగినదిహిరణ్మయ కోశమని, అదియే బ్రహ్మపదార్థమని, నిష్కళంకమై యున్నదని చెప్పబడుచున్నది (హిరణ్మయే పరేకోశే విరజంబ్రహ్మనిష్కళం) జనన మరణ భ్రాంతి రహితవిధానమందు అత్యంతభక్తి విశ్వాసముతో కూడిన యోగ్యతగల ఓ శిష్యుడా! స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు హిరణ్మయాది కోశములుగాని, వీటి సమిష్టి రూపమైన గుర్తెరిగే తెలివి గాని మూలముగాని స్థానముగాని లేక ఉన్నవి. అన్నమయాది కోశములు స్వయంసత్తాకములు కాక. హిరణ్మయ కోశముపైన ఆధారపడి పనిచేయు చున్నవని, ఈ కోశముల సంచిలో గుర్తెరిగే తెలివి కలసియే ఉన్నదని ఒకటి విడిచిన మిగిలిన వన్నీ దానితో విడిచిపోగలవని పరిపూర్ణ బోధచే స్పష్టముగా తెలియుము.

**కంII లేనినేనను శరీరము। లోనబయట గలిగినట్టి లోక సమితికిన్। లోన బయట గల బయలిది దీనందేలేక మనము తిరుగుట మనఘాII 66**

## ప్రతిపదార్థము

అనఘా = గొప్పవాడా
లేని నేనను శరీరము = స్వత:సిద్ధమైవున్న దానియందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న గుర్తెరిగే ఎరుకకు
లోన, బైట = బాహ్యాభ్యంతరముల యందు
కలిగినట్టి = వున్నటువంటి
లోక సమితికిన్ = లోకములయొక్క సమూహమునకు
లోన, బైట = లోపల బైట
గలబయలిది = ఈ పరిపూర్ణము స్వత:సిద్ధమైయున్నది
దీనందే = ఇట్టిదానియందే
లేక = మూలముగాని ఆధారముగాని లేక
మనము తిరుగుట = నేననేగుర్తుయొక్క పరిణామములు జరుగుచున్నవి

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన దానియందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరముయొక్క బాహ్యాభ్యాంతరముల యందు గుర్తెరగబడుచున్న లోకములయొక్క పూర్వాపరములయందు దీనితో సంబంధపడక వునికి కలిగి ఉన్నది అచల పరిపూర్ణము. దీనియందు మూలముగాని స్థానముగాని లేకనే నేను, నీవుగా తోచబడుచున్న ఎరుక పరిణామక్రమమునకు లోనై వున్నది.

**కం॥ ముడిబడి కర్మము జ్ఞానము। విడువక నారెండువెలసె। విశ్వమననదే। కడువేడ్క బయలుగనెనా। ఘడియైనను నిల్వలేక కల్లై పోవున్॥ 67**

## ప్రతిపదార్థము

ముడిపడి కర్మము,జ్ఞానము = కర్మము జ్ఞానము అనునవి రెండును ఒకదానినొకటి పెనవేసుకొని

విడువక = విడిచిపెట్టక
ఆరెండు వెలసె = ఈ రెండు వస్తువులవలె పరిణామక్రమములో
విశ్వమననదె = ప్రపంచంగా తోచబడుచున్నది
కడు వేడ్క = అత్యంత వుత్సాహముతో
బయలుగనెనా = పరిపూర్ణము వున్నాదని దృఢపరచుకొన్నమీదట
ఘడియైనను నిల్వలేక=ఒక్క క్షణ కాలంకూడా విడిచిపెట్టి వుండుటకు వీలుగాక
కల్లైపోవును = లేకపోవును

## తాత్పర్యము

జ్ఞానము ప్రాణము అను రెండు వస్తువులు, ఒకదాని కొకటి పెనవేసుకొని, ఏకమై పిండ, బ్రహ్మాండ ములుగా మార్పు చెందెను. దీనితో సంబంధ పడక వేరైవున్న అచల పరిపూర్ణమును వస్తునిశ్చయ పూర్వకంగా గురుప్రబోధచే దృఢపరచుకొని అట్టి దానియందు తనకు మూలముగాని స్థానముగాని లేదని తెలిసికొనుటకు అత్యంత శ్రద్ధతో ప్రయత్నించుటలో, గురువాక్యము చేత విడవ బడిన క్షణములో తాను నిజము కాదని లేకపోవు చున్నది.

**కం॥ సకలంబులేని బయలున। సకలములేని దిటకొచ్చిచనె తాలేనం।**
**చకనితా లేచిపోయిన। నిక నిలచే బయలు నెరుగ నేదుండునురా॥68**

## ప్రతిపదార్థము

సకలంబు లేనిబయలున=ఇతరమైన వస్తువులు ఏమాత్రము లేని పరిపూర్ణమందు
సకలము లేనిదిట కొచ్చి=నామరూపములతో కూడి నిజముకాక తోచబడుచున్న
తా లేననుచు = తనకు మూలముగాని స్థానముగాని లేదని తెలుసుకొని
కని = గట్టిగా దృఢపరచుకొని
లేచిపోయిన = గురువాక్యముచేత దృఢపరచుకొన్న మీదట
ఇక నీచే బయలును ఎరుగ=స్వత:సిద్ధమైవున్న పరిపూర్ణము వున్నదని గుర్తెరుగుటకు
ఏ దుండునురా = ఎవ్వరును వుండరు

## తాత్పర్యము

నామరూప రహితమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేకనే తోచబడుచున్న ఎరుక ఈ నామ రూపములతో కూడి వున్నాను, వున్నది పరిపూర్ణమని లేనిది ఎరుక యని, గురుప్రబోధచే దృఢ పరచుకొని గురుర్వాక్యముచే(షోడశి) లేకపోయిన పిదప వున్నదానిని గుర్తించుటకు ఎవరూ వుండరని భావము.

**కం॥ ఉన్నలేనేమొ యనకన్। వున్నది బయలనుచు యేమొ వుంటినిలేనం। చెన్ను లేనట్టి నిన్నును। పన్నుగగని లేనినీవు। పరుగిడ వోయీ॥ 69**

## ప్రతిపదార్థము

ఉన్న = వున్నాను
లేనేమో = లేకపోవుచున్నాను
అనకనే = ఎట్టి నిర్ణయము చేయక
వున్నది బయలనుచు = పరిపూర్ణము స్వత:సిద్ధమైవున్నదని దృఢపరచుకొని
ఏమో = వున్నదో లేదో
వుంటిని = స్పష్టముగా వునికి కలిగి ఉన్నాను
లేను = మూలముగాని స్థానముగాని లేక వున్నాను
అనుచు ఎన్ను = పైవిధముగా భావించుచున్న
లేనట్టి నిన్నును = వున్న పరిపూర్ణము నందు లేక తోచుచున్న ఎరుకను
పన్నుగ గని =స్పష్టముగా దృఢపరచుకొని లేక విచారించి
లేని నీవు పరుగిడవోయి = మూలముగాని స్థానముగాని లేని నీవు అట్టి గుర్తును విడిచి యుండుము

## తాత్పర్యము

స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము వున్నాను లేను ఏమో అను అనుభవములు ఏమాత్రము లేక వునికి గలిగి యున్నది వుంటిని,లేనుఏమో

అను అనుభవంతో కూడియుండి స్వత:సిద్ధమై వున్నదానియందు మూలముగాని స్థానముగాని లేక గుర్తెరగబడుచున్న గుర్తును లేనిదని గట్టిగా దృఢపరచుకొని గురువాక్యముచే (షోడశి) విడచి యుండుము.

**కం॥ రెండు వస్తువుల నడుమ। నఖండంబదె కానుపించుగద దీనిని**
**నీవుండి గనుగొని చనందగు మండిత సత్కీర్తి సాంద్ర। మానవ**
**చంద్రా॥ 70**

## ప్రతిపదార్థము

మండిత సత్కీర్తి సాంద్రా = వెల కట్టలేనంత పుణ్యసంస్కారములతో, రాశీభూతమై యున్న యోగ్యత కలవాడా
మానవ చంద్రా = మానవోపాధి యందు శ్రేష్టమైన ప్రకాశము గలవాడా
రెండు వస్తువుల నడుమ = క్షరాక్షరోపాదుల మధ్యన
అఖండం బదె గానిపించు కదా = తెంపులేక వ్యాప్తమైయున్న స్వయం సిద్ధమెన పరిపూర్ణము వున్నదని దృఢపరచుకొని దీనిని = అట్టి వస్తువును
నీవుండి కనుగొని = గుర్తెరగబడుచున్న నీతెలివిచే గురుప్రబోధ ద్వారా స్పష్టముగా అవగాహన కలిగించుకొని
చనందగు = నీవు గురు వాక్యముచేత (షోడశి) లేకపోవలసి యున్నది.

## తాత్పర్యము

మానవోపాధిలో అత్యంత విలువైన లేక శ్రేష్టమైన ప్రకాశముతో కూడి, అనేక జన్మలయందు చేయబడిన పుణ్యసంస్కారములన్నీ రాశీభూతమై ఒకటిగా నిలుచుండి జన్మరాహిత్యమునకు కృషిచేయుచున్న ఓ! శ్రేష్టమైన శిష్యుడా! నిరంతర పరిణామములకు మార్పులకు లోనైవున్న క్షరోపాధి ఇట్టి పరిణామ క్రమమునకు ఆధారము, కేంద్రముఅయి ఉత్పత్తి, స్థితి, లయములకు కారణముగానున్న అక్షరోపాధి అను రెండు వస్తువుల మధ్యలో వీటితో సంబంధపడక, తెంపులేక సర్వే సర్వత్రా తానైవున్న అచల పరిపూర్ణమును గురుసూచన ద్వారా దృఢపరచుకొని పైరెండు వస్తువులను ఒకటిగా చేసి గుర్తెరగబడుచున్న నీగుర్తుచే గట్టిగా స్పష్టముగా, దృఢపరచుకొని

ఉన్నదాని యందు నీకు మూలముగాని స్థానముగాని లేదని గ్రహించి గురువాక్యముచేత (షోడశి) అట్టి గుర్తును కూడా విడిచి యుండుము.

**కం॥ ఉన్నదానందునిజముగ। నెన్నడు లేనట్టి మనము యేతెంచిట యీ।**
**తిన్నని ముచ్చటలాడితి। మిన్నియికన్ మనముబోతే। యేదిరమాటా॥71**

## ప్రతిపదార్ధము

వున్నదానియందు = శాశ్వతముగా నున్న అచల పరిపూర్ణమునందు
నిజముగా = స్పష్టముగా
ఎన్నడూ లేనట్టి మనము = మూలముగాని స్థానముగాని ఏమాత్రము లేక తోచబడుచున్న నీవు నేనను గుర్తు
ఏతెంచిట = ఈ విధముగా, మనకు మనముగా తోచబడి
తిన్నని = స్పష్టమైన, నిజమైన
ముచ్చట లాడితిమి = ఈ పరిపూర్ణ భావమును భ్రాంతి రహిత విధానము కొరకు విచారించి యుంటిమి
ఇన్ని + ఇకను = ఇకమీదట ఈ మాటలన్నియు
మనముపోతే = ఈ గుర్తెరిగే తెలివి విడచి యుంటె
ఏ దిరమాట=వున్న దానిని గూర్చి ఎట్టి నిర్ణయము చేయుటకు వీలు లేదు

## తాత్పర్యము

స్వతఃసిద్ధమైయున్న పరిపూర్ణమునందు ఏ కాలమునందునూ లేక తోచబడుచున్న(గురుశిష్యులుగా తోచబడుచున్న) మనము తమంతట తాముగా ప్రవేశించి జననమరణ భ్రాంతి రహితముకొరకు ఈ భావమును విని దృఢపరచుకొంటిమి. ఈ విధానము గుర్తెరగబడే ఎరుక గురువాక్యము ద్వారా లేక పోయిన పిదప ఎట్టి నిర్ణయము చేయుటకు నేను, నీవు గా తోచబడుచున్న గుర్తు లేకపోవుట చేత ఎట్టి నిర్ణయము పొసగదు.

**కం॥ ఓపాపరూపయిాబయ। లే పరమాత్మనుచునమ్మి। లేనట్టి నినున్।**
**ఆపోజ్యోతి వనుచు దెలిసీ పట్లనె లేనటంచు చేరు ముళక్కీ॥72**

## ప్రతిపదార్థము

ఓ పాపరూపా = ద్వయ దోషముతో కూడుకున్న వాడా
బయలే = స్వతఃసిద్ధమైన పరిపూర్ణమే
పరమాత్మనుచు నమ్మి = ఎట్టి మార్పులకు లోనుగాని పరమాత్మగా భావించి
లేనట్టి నినున్=మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న ఈ గుర్తును
ఆపోజ్యోతి వనుచు తెలిసి = భ్రాంతి రూపముగా తోచబడుచున్న ఎరుక స్వరూపుడిగా భావించి
ఈ పట్లనె = వెంటనే
లేనటంచు = మూలముగాని స్థానముగాని లేదని
చేరు ముళ్ళక్కి=గురు వాక్యముచే లేకపోవు విధానమును దృఢపరచు కొనుము

## తాత్పర్యము

మార్పులకు లోనగుచూ దోష స్వరూపముతో కూడుకున్నవో శిష్యుడా! శాశ్వతమైన పరిపూర్ణమునే జనన మరణములు లేని పరమాత్మగా భావించి అట్టి దానియందు మూలముగాని, స్థానముగాని లేక తోచబడుచున్న నీగుర్తును, ఆపోజ్యోతి రూపముతో కూడిన భ్రాంతి కారకమగు వస్తువుగా గుర్తించి, వున్నదానియందు మూలముగాని స్థానముగాని లేదని దృఢపరచుకొన్న మీదట వెంటనే గురువాక్యముచే లేకపోవలెనని తెలుసుకొనుము.

**కం॥ ఇచ్ఛారాహిత్యంబనె స్వచ్ఛంబగు బోధయనుచు। నజ్జనులనిరీ।**
**యిచ్ఛనె కూడని దనిరా। స్వచ్ఛందుల మాటలన్ని సత్యము**
**వినరా॥ 73**

## ప్రతిపదార్థము

ఇచ్ఛారాహిత్యమునే = కోరికలన్నీ లేకుండా చేయగలుగునదియే
స్వచ్ఛంబగు బోధ యనుచు = శ్రేష్టమైన మార్గముగా, విచారణముగా
సజ్జనులనిరి = సత్పురుషులు ప్రవచించినారు

ఇచ్ఛనే కూడనిదనిరి=కోరికలు వుండకూడదనిరి ఏలననగా అవి బంధకారణములని
స్వచ్ఛందుల మాటలు = అట్టి మహాత్ముల యొక్క వాక్యములు
సత్యము = వాస్తవము
వినరా = ఎట్టి నిర్లక్ష్యము లేక పాటించుము

## తాత్పర్యము

ఎట్టి కోరికలూ లేకుండా చేయగలుగు విధానము బోధించునదియే శుద్ధమైన సాంప్రదాయముగా మహాత్ములు నిర్ణయించిరి. ఏలననగా కోరికలు అన్నియూ వాసనామయమై, జనన మరణములకు, సుఖదు:ఖములకు పరంపరా కారణములుగా చెప్పబడుచున్నవి. కావున ఎట్టి కోరికలూ ఉండకూడదని యాదృచ్ఛాలాభముగా జీవించవలెనని పెద్దలచే సిద్ధాంతీకరింపబడిన మాటలు యధార్థమై యున్నవని గట్టిగా దృఢపరచుకొని అందుకు సరిపడ ఆరూఢతను పొందవలసి యున్నది.

**కం॥ ఏయాపేక్ష జనించిన। నాయాపేక్షలెల్లమాయు। యని**
**తెలియదగున్ ఆయాసమౌను దానను। ఛీ యని విడువ**
**గదగును। క్షేమము కొరకై॥ 74**

## ప్రతిపదార్థము

ఏ ఆపేక్ష జనించినా = ఎట్టి కోరికలుద్భ వించినా
ఆ ఆపేక్షలెల్లా = ఆ కోరికలన్నియు
మాయ అని తెలియ దగున్ = నిజము కాదని భ్రాంతి కారకములని స్పష్టముగా తెలిసి కొనుము
ఆయాస మౌను = ఇట్టి కోర్కికలుండుటచే
సుఖ దు:ఖములు, తద్వారా జననమరణములు సంభవించును
దానను = అందుచేత
ఛీ అని విడువ దగును = వ్యర్థములని కూడనివని విడిచిపెట్ట వలెను
క్షేమము కొరకై = జనన మరణ భ్రాంతి రహిత విధానము నకు ఇట్టి స్థితి చాలా అవసరమని గ్రహించి

## తాత్పర్యము

లౌకిక పారమార్ధికములందు కలుగుచున్న కోరికలు సుఖదు:ఖములకు కారణమై జన్మ పరంపరలకు వీలు కలిగించుచున్నవి. అందుచే అట్టి వాసనలు అత:కరణమందు చేరి అత్యంత కష్టముతో కూడిన జన్మపరంపరలకు అవిశ్రాంతిగా ప్రయాణము చేయుచున్నవి. పరిపూర్ణబోధ రీత్యా ఈవిధానమంతయూ నిజము కాదని భ్రాంతి కారకమని ఎట్టి సంకోచమూ లేక ప్రయత్న పూర్వకముగా విడిచి ఉండవలెను. ఈ పద్ధతిచేత మాత్రమే పరిపూర్ణ స్థితి దృఢము కాగలదు.

**కం॥ మనమీ బయలునలేనిదె మనకు మనమె వచ్చి। నిల్చి**
**మనమేగిన। నేమనక మనజోలి గొనకన్। తనకై తానుండి**
**యున్న దదుగో కనరా॥ 75**

## ప్రతిపదార్ధము

మనము = గురుశిష్యులమైన మనము
బయలున లేనిదె = స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేకనే
మనకు మనమే = మనకు మనముగానే ఎట్టి కారణము ఆధారము లేకనే
వచ్చి = తోచబడి
నిల్చి = ఈ విధముగా, గురుశిష్యులుగా విచారించి
మనమేగిన = విచారణద్వారా వున్నదున్నట్లుదృఢపరచుకొని వున్నదానందు మనము లేకపోయిన పిదప
ఏమనక = ఎట్టి నిర్ణయము చేయక
మనజోలి గొనకన్ = మనఉనికితో సంబంధ పడక
తనకై తానుండి యున్నది = తనకు తానుగా స్వత:సిద్ధమై వున్నది
అదిగో కనుగొనరా = నిన్ను విడచి చూడుమని భావము

## తాత్పర్యము

శాశ్వతమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేకనే మనకు మనముగా గురువు,శిష్యుడు అనే గుర్తుతో తోచబడి క్రమములో బోధ విధానము దృఢపరచుకొని గురువాక్యముచే లేకపోయిన పిదప ఎట్టి నిర్ణయము లేక గుర్తించే మనతో సంబంధపడక తనకు తానుగా స్వయంసిద్ధమై నిండి నిబిడీకృతమైయున్న అచల పరిపూర్ణమును కనిపెట్టి గుర్తును విడిచి యుండుము.

## ఎరుక లక్షణము

పరిపూర్ణ బోధయందు అచల పరిపూర్ణమును వస్తునిశ్చయ పూర్వకంగా బోధనా పద్ధతిచే దృఢపరచుట ఎంత అవసరమో ఎరుక నిరూపణ కూడా అంతే అవసరం. ఏలననగా తెలివియొక్క సమగ్ర రూపమును గుర్తించిన గాని దీనికి వేరై వున్నది అయిన పరిపూర్ణమును వుండజూచుకొనుట సాధ్యపడదు. అదియుగాక గురువాక్యముచే ఎరుకను విడువ వలసిన అవసరం వున్నది. కనుక దీనిని గూర్చిన సమగ్రమైన వివరణ పొందుట చాలా అవసరమై వున్నది. ఈ శీర్షిక ద్వారా ఈ వివరణ పొందవచ్చును.

**కం॥ లేనినీకలిమి వంధ్యా। సూనునివలె పుష్కర ప్రసూనమువలె।**
**స్వప్నా నందమువలె। గంధర్వా నీకస్థానమువలె। నని**
**తెలియదగున్॥ 76**

## ప్రతిపదార్థము

లేని నీ కలిమి = లేక తోచబడుచున్న నీవు, నీయొక్క పరిణామము
వంధ్యా సూనుని వలె = గొడ్రాలి సంతానమువలె
పుష్కర ప్రసూనము వలె = ఆకాశ పుష్పంవలె
స్వప్నానందము వలె = స్వప్నమునందు పొందు సుఖము వంటిదివలె
గంధర్వ నీక స్థానము వలె=మేఘ మండలమందు తోచు గంధర్వ నగరము వలె
అని తెలియ దగును = పైవిధముగా గుర్తించ వలెను

## తాత్పర్యము

స్వత:సిద్ధమైవున్న అచల పరిపూర్ణమునందు గుర్తెరిగే ఎరుకకు మూలముగాని స్థానముగానీ లేనిదని సిద్ధాంతము. కావున దాని పరిణామ క్రమంకూడా లేనిదగుచున్నది. అది ఎట్లనగా 1) గొడ్రాలు సంతానమువలె 2) వర్షానంతరము ఆకాశమందు తోచు ఇంద్రధనుస్సువలె 3)స్వప్నము నందు పొందు ఆనందము వలె 4) మేఘమండలమందు తోచు గంధర్వ నగరము వలె అని తెలియ వలెను. పైన పేర్కొన్న ఉదాహరణల యందు కేవలము భావనలేగాని వాస్తవము లెట్లుకావో అట్లే వున్న పరిపూర్ణమునందు లేని ఎరుక దాని పరిణామములు పైవిధముగా చెప్పబడుచున్నవి.

**కం॥ నీతండ్రి జనిన మీదట। నీతనయుడు రాక మునుపు నీవున్న పుడున్। యేతత్వ మంతటనుగల। దాతత్వము నరసి మృషని తలపుము మిమ్ముఌ॥ 77**

## ప్రతిపదార్థము

నీ తండ్రి చనిన మీదట = నీతండ్రి మరణించిన పిమ్మట
నీతనయుడు రాకమునుపు = నీకు కుమారుడు జన్మించక పూర్వము
నీవున్నపుడు = ప్రస్తుతము నీవున్న వునికి గోచరించునపుడు
ఏ తత్వమంతట గలదో = సర్వత్రా మూడు కాలములందు ఏ పదార్థము నిండి నిబిడీకృతమై వున్నదో
ఆ తత్వమరసి = గురుముఖత: వస్తునిశ్చయపూర్వకంగా దృఢపరచుకొని
మృషని = నిజము కాదని, వాస్తవము కాదని
తలపుము మిమ్ముఌ = గురువాక్యముద్వారా లేనిదని దృఢపరచుకొనుము

## తాత్పర్యము

నీ తండ్రి మరణించిన పిదవ, నీకు కుమారుడు కలుగక పూర్వము, నీవున్నప్పుడు అంతటా నిండి నిబిడీకృతమై అచల పరిపూర్ణము ఎట్లు స్వత:సిద్ధమై వున్నది. గురుముఖత: దృఢపరచుకొని అటుపైన లేక తోచబడుచున్న గుర్తును గురువాక్యముచే విడిచి యుండుము.

**కం॥ నీవెసుమీ జీవశివుల్। నీవెసుమీ మేనుజగము నీవెసుమీ్మ।
జీవశివైక్యము బయలున నీవు గలుగలేదు లేదు। నీమొదలె చటన్॥78**

## ప్రతిపదార్ధము

జీవ శివుల్ = జీవుడు, ఈశ్వరుడు గాను
మేను జగము = ఈశ్వర జగత్తులుగాను
జీవ శివైక్యము = మహావాక్యవిచారణద్వారా వీటియందు పొందు ఏకత్వము
నీవేసుమీ = గుర్తెరగబడుచున్న ఎరుక స్వరూపమే అయివున్నది
బయలున నీవు కలగలేదు = స్థిరమైన పరిపూర్ణమునందు వీటికి మూలముగాని స్థానముగాని లేదని
లేదునీ మొదలెచటన్ = నీకు ఆధారము వేరొకచోటను లేదుగనుక నిన్ను లేని ఎరుక గా చెప్పబడు చున్నది

## తాత్పర్యము

జీవేశ్వరులుగాను, మేను, జగములుగాను, తత్త్వమస్యాది మహావాక్యములచే అఖండ వస్తువుగాను ఈ గుర్తెరిగే ఎరుకే చెప్పబడు చున్నది. స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు ఇట్టి ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదు. దీని పుటుకకు మొదలెచటనూ కానరాదు కనుక లేని ఎరుక అని చెప్పబడుచున్నది.

**కం॥ కదిలీనా మెదిలీనా। కదలని యీ బయలు నిన్ను। గనలేదు గదా। మొదలెక్కడ గనరాదిక। కదలుము నీకలి ముళక్కిగా దలచి సుతా॥ 79**

## ప్రతిపదార్ధము

సుతా = కుమారా
కదిలీనా = చలించుచున్న
మెదిలీనా = వ్యవహరించుచున్న
కదలని ఈ బయలు = ఎట్టి కదలిక లేని ఈ అచలపరిపూర్ణము

నిన్నుకనలేదు కదా = నీతో ఏమాత్రము సంబంధపడకవున్నది కదా
మొదలెక్కడ కానరాదు=నీకు మూలముగాని స్థానముగాని మరెచటా కానరాకున్నది
నీ కలిమి వుళ్ళక్కిగా తలచి = నీవునికి నిజమైనది కాదని అసత్యమైనదని దృఢపరచుకొని
కదలుము = గురుర్వాక్యముచే విడచి యుండుము

## తాత్పర్యము

పరిణామ క్రమమునందు ఎరుక జ్ఞాన శక్తిగా, క్రియాశక్తిగా వ్యవహరించుచూ సమస్త చలనములకు కారణముగా నున్నది. ఇట్టి గుర్తు అచల పరిపూర్ణమును ఉన్నదని గురువాక్యముచే దృఢపరచుకొనుటయేగాని, సాక్షాత్తుగా దర్శించలేకున్నది. ఇట్టి గుర్తుకు మొదలు ఆధారములు వేరెచ్చటనూ కానరాదు. అందుచే నీ వునికి నిజముకానిదని దృఢపరచుకొని గురువాక్యము (షోడశి)చే విడిచి యుండుము.

**కం॥ మేనన నను దెలిసినగతి। నేననినిదిబయలుగాను। నీవెరుగోయి।**
**నేనననిది నేననదని। నేనను నేనరయ మృషని। నేమృషనౌదున్॥**

**80**

మేనన నన్ను తెలిసినగతి = నేను అనేగుర్తుతో నాశరీరమును గుర్తించినంత స్పష్టంగా
నేనననిది బయలుగా = నేననే గుర్తుతో సంబంధపడనిది పరిపూర్ణముగా
నీవెరుగోయి = వస్తునిశ్చయ పూర్వకంగా స్పష్టంగా దృఢపరచుకొని
నేనననిది = నేననే గుర్తులేనిది
నేననదని = నేను గుర్తించితిని అని అనదు
నేనను నేనరయ = ఈ విధముగా నేనును గూర్చి స్పష్టముగా విచారించగా
మృషని = నిజము కాదని
నే మృష నౌదున్ = నాకునేనుగా గురువాక్యంచే లేక పోవుదును

## తాత్పర్యము

నేను అనే నా తెలివిచే నా శరీరమును స్పష్టముగా గుర్తించినట్లుగా, నేను కానిది, నేను లేనిది అచల పరిపూర్ణమని గట్టిగా దృఢపరచుకొని

నేను అను గుర్తులేని పరిపూర్ణము నేననుగుర్తుతో వ్యవహరించదని, అట్లు నేనను వ్యవహరించుగుర్తు నిజము కాదని గురు ప్రబోధచే దృఢపరచుకొన్నమీదట ఆగుర్తు లేకపోవుచున్నది.

**కం॥ మేనొక్కటి నేనొక్కటి। నేనీ మాటలను విడచి నిను నీ తనువున్।**
**నేనేనని యచలముగని। నేనను నీవేగవోయి నేమృషననుచున్॥ 81**

## ప్రతిపదార్థము

మేనొక్కటి నేనొక్కటి = మేను నేను ఒకటిగా తలంచి(మేను ఒకటి నేను ఒకటి)
నేనీ మాటలనువిడచి = నేను, నీవనే ద్వంద్వముగా నున్న గుర్తును విడచి
నిను నీతనువున్ + నేనేనని = నిన్ను నీ శరీరమును ఒకటిగా భావించి పైరెండు ఒక్కటేనని
అచలముగని = వీటికి వేరైవున్న అచల పరిపూర్ణమును దృఢపరచుకొని
నేనను నీవేగవోయి = నేననే గుర్తునువిడచియుండుము
మృషననుచున్ = వాస్తవము కాదని నిజము కాదని

## తాత్పర్యము

నేను, శరీరము వేరు వేరుగా ఉన్నాము అను దృష్టిని విడిచి వస్తునిశ్చయపూర్వకముగా ఈ రెండూ ఒక్కటే నని విడిచి వుండ జాలవని దృఢపరచుకొని వీటికి వేరై పరిపూర్ణము స్వత:సిద్ధమై ఉన్నదని అట్టి దానియందు ఈ ద్వంద్వ పద్ధతిగా గుర్తెరగబడుచున్న నేనుకు మూలముగాని స్థానముగాని లేదని గురు ప్రబోధచే దృఢపరచుకొని పిదప అట్టి గుర్తును షోడశి వాక్యముచే విడచి వుండుము.

**కం॥ దేహమున కొంత · నిజమని। మోహంబున నిల్పుకొనుటె మోసంబు గురు। ద్రోహమగు గాన విడువుము మోహంబును మేల్కొన కలమునిగినరీతిన్॥ 82**

దేహమును కొంత నిజమని = దేహీ దేహములుగా వ్యవహరించుచున్న తనయందు దేహము అసత్యము, దేహి నిత్యము అనుమాట

మోహంబున నిల్పుకొనుట = ప్రేమతో భావించగలుగునట్టి ఇట్టి నిర్ణయము
మోసము = చాలాకష్ట, నష్టము లకు కారణము
గురుద్రోహమగు = వస్తునిశ్చయ పూర్వకంగా గురువు ప్రబోధించిన క్రమమునకు భంగము
గాన = అందు చేత
విడువుము మోహంబును = ఇట్టి ప్రేమను, భావమును విడిచి యుండుము
మేల్కొన కల మునిగినరీతిన్ = మేలుకొన్న మీదట కలపోయినట్లుగా

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమునందు దేహి, దేహ భావన చెప్పబడుచు, అందు దేహమశాశ్వతమని, దేహి నిత్యమని పేర్కొనబడుచున్నది.ఇది ప్రేమను పెంచి, జన్మకర్మలకు కారణమగు వస్తువును మినహాయించుట జరుగు చున్నది. ఇది చాలా ప్రమాదకరమైన అంశము వస్తునిశ్చయ పూర్వకంగా గురువు బోధించిన బోధనాక్రమమునకే భంగమై, భ్రాంతులకు కారణముగా వున్నది. కావున యిట్టి భావమును గురుప్రబోధచే(ద్వాదశి, షోడశి లద్వారా) దృఢపరచుకొని గుర్తును విడిచి వుండుము. కలగనువాడు కలలో వస్తువులను, భావమును మెళకువ పొందిన పిదప ఎట్లు విడిచి యుండునో ఆ విధముగానే గుర్తును విడచి వుండుము.

**కం॥ చలన మన నీవు సుమ్మీ। చలనరహిత మనిన బయలు**
**చలనమెకలయీ। చలనము చలన రహితము। గలదని కని**
**తొలగ మేలు కగునోయప్పా॥ 83**

## ప్రతిపదార్థము

చలనమన నీవు సుమ్మీ=సమస్త కదలికలకు నేననే గుర్తే కారణముగా నున్నది
చలన రహితమనిన బయలు=ఎట్టి కదలికలు లేక స్థిరమై యున్నది పరిపూర్ణము
చలనమే కల = కదలికతో కూడుకున్న గుర్తు కలవంటిది
ఈ చలనము = ఈ గుర్తెరిగే శరీరము
చలన రహితము కలదని కని = కదలిక లేని అచల పరిపూర్ణమును

గురుసూచన ద్వారా దృఢపరచుకొని
తొలగ = గుర్తును విడిచి పెట్టగా
మేలు కగునో యప్పా = యిట్టి విధానమునే మెళకువగా చెప్పబడుచున్నది

## తాత్పర్యము

సమస్త చలనములకు నేనను ఎరుకయే కారణముగా నున్నది. ఇట్టి గుర్తుతో సంబంధ పడక కదలిక లేక అచలమై యున్నది పరిపూర్ణము. అట్టి దాని యందు కదలికకు కారణమగు గుర్తు కల వలె లేకపోవుచున్నది. యిట్టి గుర్తుచే వున్నపరిపూర్ణమును గురువాక్యముచే దృఢపరచుకొని, గుర్తును విడచి యుండుటయే మెళకువగా చెప్పబడుచున్నది.

**కం॥ ఈగుర్తెరిగే మేనును। బాగుగవిడిచుండుమిందు। బట్టకు దేనిన్।**
**ఆగడమౌ దానను విని।త్యాగము నీకుంటె మంచిదౌరావోరీ॥84**

## ప్రతిపదార్థము

ఈ గుర్తెరిగే మేనును = ఈ గుర్తెరగబడుచున్న శరీరమను నిన్ను
బాగుగా విడిచుండుము=స్పష్టముగా గురువాక్యముచేత లేదని దృఢ పరచుకొనుము
ఇందు బట్టకు దేనిన్ = ఏ మాత్రము సందేహపడక గ్రహించుము
ఆగడమౌ దానను = అత్యంత ముఖ్యమైన, మేలైన పనిగా భావించుము
విని = బాగా గుర్తించి
త్యాగము నీ కుంటే = గురుర్వాక్యముచే విడిచినట్లైతే
మంచిదౌరా = అతిముఖ్యమైన విలువైన పనిగా భావించుము
వోరీ = నాయనా

## తాత్పర్యము

పరిపూర్ణ బోధను విచారించు క్రమములో సర్వభ్రాంతులకు మూలకారణము నేననేగుర్తుగా తెలియబడుచున్నది. దేనిని విడచిన అన్నీ విడచినట్లౌను? అని ప్రశ్నించుకున్న వారికి ఈ గుర్తెరిగే శరీరము విడచిన

అన్నీ విడిచినట్లగునని, తెలియగలదు. ఇట్టి విధానము చేత మాత్రము జనన మరణ భ్రాంతి రహిత విధానము చేకూరగలదు. అందుచే గురు ప్రబోధలో ఈ గుర్తును విడచిపెట్టుటలో గల అవసరము, ప్రయోజనము చెప్పబడుచున్నవి. ఋణశేషం, శత్రుశేషం ఎట్లు వుండకూడదో ఆవిధంగానే ఈ గుర్తుయొక్క అవశేషం వుండుటకు వీలుకాదు. ఇది విడిచి యుండుట భ్రాంతి రహిత విధానమునకు చాలా అవసరం. ఇందు ఎట్టి సందేహము పడవలదు. కావున ఈ పద్యమునందు ఇట్టి విధానము స్పష్టముగా చెప్పబడుచున్నది.

**కం॥ వలదెక్కువ ముచ్చట్లిక। చలనము లేనట్టి బయలు।**
**చందముగని యీ। చలనమగు నీకునీవే తలిదంద్రులటంచు**
**దెలిసి తలగుము చాలున్॥ 85**

## ప్రతిపదార్థము

వలదెక్కువముచ్చట్లిక = వ్యర్థమైన సంభాషణలు ఏమాత్రము పనికిరావు
చలనము లేనట్టి = కదలిక లేనటువంటి
బయలు చందముగని = అచల పరిపూర్ణము యొక్క వాస్తవికతను గుర్తించి
ఈ చలనమగు = కదలికలతో కూడుకున్న నీగుర్తు
నీకు నీవే తలిదండ్రులటంచు దెలసి = ఈగుర్తుకు మూలము ఆధారముగా నీ గుర్తే అని గుర్తించి
తలగుము = విడిచి పెట్టి యుండుము
చాలున్ = భ్రాంతి రహిత విధానము నకు యిది సరిపోవును

## తాత్పర్యము

జనన మరణ రహిత విధానమునకు ప్రపంచములో పలు మార్గములు సూచింపబడుచున్నవి. ఇవన్నియు భ్రాంతి రహిత విధానమందు వ్యర్థములు నిష్ప్రయోజనములు అయి వున్నవి. కావున అట్టి విధములన్నియు విడిచి పెట్టి గురుముఖత: వస్తునిశ్చయపూర్వకంగా కదలిక లేనట్టి అచల పరిపూర్ణమును, కదలిక గలిగినట్టి గుర్తెరిగే శరీరమును,

విడి విడిగా గుర్తించి, నేననే గుర్తునకు, మూలము ఆధారము, అట్టి గుర్తే అని గట్టి గా దృఢపరచుకొని, ఆగుర్తును కూడా విడచి యుండుము. ఇట్టి ఆరూఢ స్థితిచేత మాత్రమే జనన మరణ భ్రాంతి తొలగును.

**కం॥ బ్రహ్మందులేక కలిగిన। బ్రహ్మకు నేననెడి మాయప్రబలె జగంబై**
**బ్రహ్మనుగని తానేగుటె। బ్రహ్మననే మాయకుపని। బ్రహ్మందుజుమీ॥86**

## ప్రతిపదార్ధము

బ్రహ్మందు లేక కలిగిన బ్రహ్మకు = వున్న పరిపూర్ణము నందు లేక తోచబడుచున్న ఎరుకకు
నేననెడి మాయ ప్రబలె జగంబై = లేక తోచబడుచున్నదై జీవేశ్వరజగత్తుగా పరిణామముచెంది
బ్రహ్మను గని = స్వత:సిద్ధమైన పరిపూర్ణమును ఉండజూచుకొని
తానేగుటే = తాను లేక పోవుటే
బ్రహ్మననే మాయకు పని = నేననే ఎరుక చేత చేయవలసిన ముఖ్యమైన పనిగా తెలిసి కొనుము
బ్రహ్మందు జుమీ = లేని విధముగా జీవించు ముఖ్యమైనపని

## తాత్పర్యము

స్వత:సిద్ధమై యున్న అచల పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేకనే నేననేగుర్తు కలవలె తోచబడి, జీవేశ్వర జగత్తుగా పరిణామము చెంది జన్మ పరంపరలకు లోనగుచున్నది. ఈ విధానమంతయు గురుముఖత: విచారించి,అన్నిటికి మూలము, స్థానము అయివున్న నేననేగుర్తుకు పరిపూర్ణము నందు మూలము లేదని గురువాక్యముచే దృఢపరచుకొని తానులేని విధానమును దృఢపరచుకొన్న మీదట లేకుండా జీవించ గలుగుటే తాను చేయవలసిన ముఖ్యమైన పని.

**కం॥ నిరుపాధికమగు బయలున। మరిలేకనే కలిగినట్టి మారుతమునకే। పరియాయ నామములగు। కరువలియన యెరుక యనిన। కడుమాయ యనన్॥ 87**

## ప్రతిపదార్థము

నిరుపాధికమౌ బయలున = క్షరా క్షరాపాధితో సంబంధపడక స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు
మరిలేకనే కలిగినట్టి = మూలముగాని స్థానముగాని లేక వున్నట్టి
మారుతమునకె = గాలి, వాయువు, సమిష్టి ప్రాణము
పర్యాయనామములగు = మారు పేరుగా చెప్పబడుచున్న
కరువలియన = చైతన్యముతో కూడుకున్న ప్రాణమనిన
ఎరుకయనిన = గుర్తెరగబడే చైతన్యమన్న
కడు మాయ యనిన్ = లేకనే తోచబడుచూభ్రమ, ప్రమలకు ఆధారముగా నున్న మాయఅనే వస్తువుగాను

## తాత్పర్యము

క్షరాక్షరో పాధిద్వయ దోషరహితమై యున్న అచల పరిపూర్ణము నందు మూలముగాని, స్థానముగాని లేక తోచబడుచున్న ఎరుకకు, ప్రాణమని, ప్రాణసహిత చైతన్యమని, చైతన్య రహిత ప్రాణమని, మాయ అని పలువిధములగు పేర్లతో వ్యవహరించబడుచున్నది.

**కం॥ మానసము దేహి జీవుం। డానందము సత్తు చిత్తు లహము జగ। దధిష్టానంబు సాక్షి సత్య। జ్ఞానము ద్రష్టనిన నీవె సత్యము సుజ్ఞా॥ 88**

## ప్రతిపదార్థము

సుజ్ఞా = శ్రేష్టమైన జ్ఞానము కలవాడా
మానసము = మనస్సు
దేహి = దేహమును ధరించినవాడు
జీవుడు = చైతన్యము కలవాడు
అనందము = సుఖ దు:ఖ ద్వంద్వరహితమైనది
సత్తు = త్రికాలా బాధ్యమైనది
చిత్తు = జ్ఞానమే స్వరూపముగా గలది

అహము = నేననేగుర్తు కలిగినది
జగదధిష్టానము = పంచభూతములకు ఆధారమైనది
సాక్షి = సృష్టి స్థితి, లయమును గమనించువాడు
సత్యము = నిజమైనది
జ్ఞానము = ఎరుగబడునది
ద్రష్ట = చూచువాడు
అనిన నీవె = పైన పేరొన్న పేర్లన్నిటతో నీవే వ్యవహరింపబడుచున్నావు
సత్యము = ఇవన్నీ వాస్తవము

## తాత్పర్యము

శ్రేష్టమైన జ్ఞానము కలవాడా! నేనను ఎరుకకు పలువిధములుగా వ్యవహరింపబడుటచే అనేకమైన పేర్లుచెప్పబడుచున్నవి. మనస్సు, దేహి, జీవుడు, ఆనందము, సత్తు, చిత్తు, అహము, జగదధిష్టానము, సాక్షి, సత్యము, జ్ఞానము, ద్రష్ట మొదలగునవి అని నీవు నిశ్చయముగా గుర్తెరుగుము.

**కం॥ జ్ఞానా జ్ఞానంబులు యీా జ్ఞానంబువె కాని వేరుగావెన్నటికిన్।**
**జ్ఞానాజ్ఞానానికీ పని జ్ఞానాతీతమును గాంచి। చనుటయు సుమ్మీ॥89**

## ప్రతిపదార్థము

జ్ఞానా జ్ఞానములు = ఎరుక మరుపులు
యీా జ్ఞానంబు వేగాని వేరుకావెన్నటికి = గుర్తు ఎరగబడుచున్న తెలివి యొక్క స్థితిగతులు మాత్రమే
జ్ఞానా జ్ఞానానికి = తెలివి, మరుపుగా తెలియబడుచున్న ఈ తెలివికి
పని = చేయవలసిన అతిముఖ్యమైన పని
జ్ఞానా తీతమును గాంచి = తనకువేరైవున్న పరిపూర్ణమును వుండ జూచుకొని
చనుట యు సుమ్మీ = లేకపోవలెను

## తాత్పర్యము

ఎరుక, మరుపు అను రెండు శబ్ధములు ఒక ఎరుక కే చెప్పబడు

చున్నవి. ఎట్లనగా రూపాయి నాణెమునకు గల బొమ్మ బొరుసులవలె ఇట్టి ద్వంద్వపద్ధతిగా నున్న ఎరుకచే దాని కన్యముగానున్న అచలపరిపూర్ణమును వుండజూచుకొని అట్టి దానియందు తనకు మూలముగాని స్థానముగాని లేదని దృఢపరచుకొని గుర్తును విడచుటయే అతిముఖ్యమైన పనిగా తెలియవలెను.

కం॥ స్థిరముగ నిల్చేద్వైతే। పరుగెత్తక భ్రాంతి నిల్వ బడదాభువిలో।
నరులు విమర్శించిన తా। నురుకుట మదియందు కోస
మూహను కనరా॥ 90

## ప్రతిపదార్థము

స్థిరముగ నిలచేద్వైతే = శాశ్వతముగా నిలబడేద్వైతే
పరిగెత్తక భ్రాంతి నిలబడదా భువిలో = ఈ భూమండలమందు శాశ్వతముగా ఎట్టి భ్రమ, ప్రమలకు లోనుగాక వుండవలసినది కదా!
నరులు విమర్శించిన = మానవులు వాస్తవమును విచారించగా
తానురుకుట = తాము లేకపోవుట
మదియందు కోసము = మనస్సులో గట్టిగా
వూహను గనరా = విచారించి తెలిసి కొనుము

## తాత్పర్యము

స్వత:సిద్ధమైవున్న పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న ఎరుక అశాశ్వతమై వున్నది. గురువాక్యము చేత నిలువ జాలని యిట్టి ఎరుక శాశ్వతమైనది కాదని స్పష్టముగా మనసులో విచారించి, దృఢపరచుకొన్న మీదట వాస్తవమును తెలుసుకొనవలసియున్నది.

## ఎరుక వుత్పత్తి లక్షణము

పరిపూర్ణబోధయందు విచారణ చేయుక్రమములో ఎరుకయొక్క వుత్పత్తి, స్థితి, నాశనములు అత్యంత ముఖ్యమైవున్నవి. ఈ వివరణ సమగ్రముగా పొందిన గాని ఎరుకను విడచుట అనునది సాధ్యముకాదు.

సిద్ధాంతరీత్యా ఎరుక లేనిదే అయినా శిష్య ప్రబోదార్థము ఈ వివరణ అవసరమైవున్నది.

**కం॥ జలమందు మొదలులేకనె। జలచరములు బుట్టి పెరిగి సమసినరీతిన్। అచల పరిపూర్ణములో నీ విలసజ్జననంబు స్థితియు। విలయములౌరా॥ 91**

## ప్రతిపదార్థము

జలమందు మొదలు లేకనె = నీటియందు ఎట్టి ఆధారము లేకనే
జలచరములు = నీటియందు నివసించే జీవులు
పుట్టి పెరిగి సమసిన రీతిని=వుత్పత్తి, స్థితి, నాశనములు చెందుచున్నవిధముగా
అచల పరిపూర్ణములో = స్వతఃసిద్ధమై కదలిక లేనట్టి పరిపూర్ణమందు
ఈవిలసత్ = పంచభూతాత్మకమైన ఈ బ్రహ్మాండము
జననంబు,స్థితియు, విలయము లౌరా= వుత్పత్తి, స్థితి, నాశనములు పొందుచున్నవి

## తాత్పర్యము

నీటియందు, ఎట్టి మూలము ఆధారములేకనే అందలి జీవరాశులు, ఉత్పత్తి, స్థితి నాశనములు చెందుచున్నవిధంగానే కేవలత్వము కల్గినట్టి కదలికలేని అచల పరిపూర్ణములో పంచభూతాత్మకమైన ఈ బ్రహ్మాండము కూడా వుత్పత్తి, స్థితి, నాశనములు పొందుచున్నది.

**కం॥ అచలమున మొదలు లేకనె। సచరాచర। జంతునిశ్చయ జననమగు యప్పుచయమున లేని జలచర నిచయము జన్మించినట్లు। నిశ్చయము సుమీ॥ 92**

## ప్రతిపదార్థము

అచలమున = కదలని పరిపూర్ణములో
మొదలు లేకనే = ఎట్టి మూలము ఆధారము లేకనే
సచరాచర జంతువులు = కదలని, కదులుతున్నజీవరాశులు

నిశ్చయ జననమగు = స్పష్టముగా వుత్పత్తి యగుచున్నవి
అప్పుచయమున = స్వచ్ఛమైన నీటిసమూహమునందు
లేని జరచరములు = మూలము ఎట్టి ఆధారము లేకనే
నిచయము = సమూహము
జన్మించినట్లు = వుత్పత్తి చెందుచున్నట్లుగా
నిశ్చయము సుమీ = స్పష్టముగా తెలియబడు చున్నది

## తాత్పర్యము

శుద్ధ, స్వచ్ఛమైయున్న నీటిసమూహమునందు, మూలము ఆధారము లేకనే జలచరములు వుత్పత్తి చెందిన విధముగా, ఎట్టి కదలిక లేని పరిపూర్ణమందు మూలము ఆధారము లేకనే స్థావర, జంగమాత్మకమైన జీవోపాధులు సమూహముగా పుట్టి పెరుగు చున్నవి.

**కం॥ నీరందు చేపలేకనె। నీరున జన్మించి మించి నీల్గినరీతిన్ తోరమగు**
**బట్టబైటను। వారక గుర్తెరుగు మేను। వచ్చున్ బోవున్॥ 93**

## ప్రతిపదార్థము

నీరందు చేపలేకనే = నీటియందుచేపలు ఎట్టి మూలము ఆధారము లేకనే
నీరున జన్మించి మించి నీల్గిన రీతిన్=నీటయందుపుట్టి, పెరిగి, నశించిన విధంగా
తోరమగు బట్ట బైటను = స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము నందు
వారక = ఎడతెగక, తెంపులేక
గుర్తెరుగు మేను వచ్చును, పోవును = గుర్తెరిగే శరీరము, వుత్పత్తి, స్థితి, నాశనములు పొందుచుండును

## తాత్పర్యము

నీటియందు ఎట్టి ఆధారము, మూలములేకనే తనకు తానుగా చేపలు పుట్టి పెరిగి నశించిన విధముగా, స్వచ్ఛమైన పరిపూర్ణము నందు, గుర్తెరిగే శరీరము క్రమములో ఎడతెగకుండా వుత్పత్తి, స్థితి, నాశనములు చెందుచుండును.

**కం॥ జలధి జలచరములోపల। గలదా జలరాశిలోని జలచరము వలెన్। జలధి నిత్యం బనిత్యము। జలచర మట్లచల చలముల। సరుణులు గనుమీ॥ 94**

## ప్రతిపదార్థము

జలరాశిలోని జలచరముల వలెన్ = సముద్రమందు చేపలు ఉన్నట్లుగా
జలధి జలచరము లోపల కలదా = సముద్రము చేపలోపల కలదా
జలధి నిత్యము = సముద్రము శాశ్వతముగా నుండును
అనిత్యములు జలచరములు=అశాశ్వతము లైనవి చేపలు మార్పుకులోనై వున్నవి
అట్లు = ఆ విధముగా
అచలచలముల = ఎరుక పరిపూర్ణముల
సరణులగనుము = విధానము విచారించుము

## తాత్పర్యము

సముద్రమందు చేపలు ఉనికి కలిగి వున్నట్లుగా, చేపలోపల సముద్రము యొక్క ఉనికి లేదు. సముద్రము నిత్యమై, శాశ్వతమై వునికి కల్గి వుండును. అట్లే జలచరములు అనిత్యములు, చలనాత్మకములు అయి వున్నవి. ఈవిధముగా పరిపూర్ణము, స్వత:సిద్ధమై నిశ్చలాత్మకమై ఉనికి కల్గియుండగా అందు ఎరుక మూలముగాని, స్థానముగాని లేకనే ఉత్పత్తి, స్థితి, నాశనములు చెందుచున్నది.

**కం॥ జలరాశికి బుట్టవుగద। జలచరములు వాటికవ్వే జనియించు గదా। కలకాలమిట్లు బయలెరుకల గాంచిన సంశయంబు। కడకేగుజుమీ॥ 95**

## ప్రతిపదార్థము

జలరాశికి పుట్టవుకదా జలచరములు = చేపలయొక్క వుత్పత్తికి సముద్రమెట్టి కారణము కాదు
వాటికవే జనియించుకదా=చేపలయొక్క వుత్పత్తికి చేపలే కారణములు కదా

ఇట్లు కలకాలము = ఈ విధముగా ఎల్లపుడు సర్వకాలములందు
బయలెరుకల గాంచిన=పరిపూర్ణము ఎరుకలను వస్తునిశ్చయముగా విచారించిన
సంశయము= ఎరుక వుత్పత్తినిగూర్చి కలిగిన సందేహము
కడకేగు సుమీ = లేకుండా పోవును

## తాత్పర్యము

జలమునందు పుట్టి నశించే జలచరములు నీటిలో పుట్టి పెరిగి, నశించి ఎట్టి ఆధారములేకనే వాటికవే మూలము ఆధారముగా వుండి, పుట్టి,పెరిగి, నశించిన విధముగా సర్వకాల సర్వావస్థలయందు వునికి కలిగిన పరిపూర్ణమునందు ఎరుక దాని పరిణామము కలుగుచుండునని వస్తునిశ్చయపూర్వకంగా విచారించిన వారికి అన్ని సంశయములు నశించి భ్రాంతి రహిత విధానము దృఢము కాగలదు.

**కం॥ పుట్టదు గిట్టదు నొకరిని।పుట్టించదు చంపబోదు భూమయెరు**
**కదా। పుట్టును గిట్టును నొకరిని। పుట్టించును సమయ జేయు**
**భూమకితరమై॥ 96**

## ప్రతిపదార్థము

భూమా = అచలపరిపూర్ణము
పుట్టదు, గిట్టదు = స్వయముగా తానెట్టి పరిణామములకు లోనుకాదు
ఒకరిని పుట్టించదు, చంపబోదు = వేరొక వస్తువును పుట్టించదు, చంపబోదు
ఎరుక = గుర్తెరిగే తెలివి
పుట్టును, గిట్టును = వుత్పత్తి, స్థితి నాశనములు పొందును
ఒకరిని పుట్టించును = ఇతరులను పుట్టించును
సమయచేయు=వుత్పత్తి, స్థితి నాశనములకు ఆధారముగాను కేంద్రముగాను వుండును
భూమకితరమై = అచలపరిపూర్ణమునకు వేరై వుండును.

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన అచలపరిపూర్ణము తనకు తానుగా ఎట్టి వుత్పత్తి, స్థితి, నాశనములు చెందబోదు. అట్టి లక్షణములు కల వస్తువుతో సంబంధ పడివుండదు. గుర్తించే ఎరుక వుత్పత్తి, స్థితి, నాశనములు కలిగుండి మరియొక వస్తువుయొక్క వుత్పత్తి నాశనములకు కారణమై వుండును. ఈ విధముగా అచలపరిపూర్ణమునకు ఎరుక వేరైవుండును.

**కం॥ కలలోపల యేనుగుపై। గలదొర మేల్కనిన నిల్వ గలడా గురుడున్। దెలిపి బయలు నీవు లేవిక దలపకుమన నీకు నిల్వదర మాతలపన్॥ 97**

## ప్రతిపదార్థము

కలలోపల = స్వప్నావస్థ యందు
ఏనుగు పైన దొర = ఏనుగుపై కూర్చొని వూరేగుచున్న రాజు
మేల్కనిన = మెళకువ స్థితి పొందిన పిదప
నిల్వగలడా = అట్టి స్థితిలో వుండ గలడా
గురుడున్ తెల్పి బయలు = వస్తునిశ్చయముగా గురుమూర్తి బయలును సూచించగా
నీవులేవు = మూలములేని గుర్తెరిగే శరీరము ఏమీలేదని
యిక తల్పకుమన = ఇది శాశ్వతమని, సత్యమని తలచవద్దు
అని నీకు తెల్పి = గట్టి గాదృఢపరచగా
తలపన్ = బాగా ఆలోచించి చూడగా
నిల్వతరమా = వుండుటకు వీలున్నదా

## తాత్పర్యము

స్వప్నమునందు రాజ్యపాలన చేయు రాజు ఏనుగు నధిరోహించి విహరించు సంధర్భమున మెళుకువ చెందగా అట్టి స్వప్నానుభవము ఎట్లు నిజము కాకపోవుచున్నదో, ఆ విధముగానే పరిపూర్ణగురువు వస్తునిశ్చయ పూర్వకంగా పరిపూర్ణము, ఎరుకలను గుర్తింప జేసి వున్న పరిపూర్ణము

నందు లేని ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదని స్పష్టపరచి గురుర్వాక్యము ద్వారా గుర్తును విడవమని చెప్పగా, అట్టి గుర్తును విడచిన పిదప చేయబడుచున్న పనులన్నియు శాశ్వతములు, సత్యములు అగునా!

**కం॥ ఎందరు లేదన్నునుతా। నెందుకు లేకుండు బయలు నేనీవన**
**కన్। ఎందరు కలదని యన్నను యెందుకు కలిగిండు యెరుక**
**నేనీ వనుచున్॥ 98**

## ప్రతిపదార్థము

ఎందరులేదన్నను = ఎంతమంది లేదని చెప్పుచున్నను
తానెందుకు లేకుండు బయలు నేనీవనకన్ = నేను నీవనే గుర్తు లేకుండా పరిపూర్ణము స్వత:సిద్ధమై వుండును
ఎందరు కలదని అన్నను=ఎంతమంది శాశ్వతము, సత్యమని పలుకు చున్నను
ఎందుకు కలిగుండు ఎరుక నేనీవనుచున్ = నేను నీవనే గుర్తుతో ఎరుక ఎందుకు వునికి కలిగి వుండును

## తాత్పర్యము

నేను నీవను గుర్తుతో ఎరుక ఎందుకు వ్యవహరించును. నేను నీవను గుర్తులేక సర్వకాల సర్వావస్థలయందు అచల పరిపూర్ణము స్వత:సిద్ధమై వున్నది. ఎంతమంది లేదని అన్నా ఇది సత్యము. నేను నీవను గుర్తుతో కూడివున్న ఎరుక ఎంతమంది సత్యమని వాదించినా గురువాక్యముచే లేనిదగుచున్నది.

**కం॥ నీకచ్చిరాని యూరును। నీకేగృహ మచ్చన్నట్లు నీవౌమేనన్।**
**నీకచ్చిరాదు నివునిను। చేకొనుటయుమానవయ్య శ్రేయస్కామా॥99**

## ప్రతిపదార్థము

శ్రేయస్కామా = జనన మరణ రాహిత్యరూపమగు మంచిని కోరుకొనువాడా
నీకచ్చిరాని వూరును = నీ వునికి ఏమాత్రము సరిపడని గ్రామము నందు
నీకే గృహము అచ్చనట్లు=ఆ గ్రామమందుగల యిళ్ళు ఏవక్కటీ నీకెట్లు

పనికిరావో
నీమేనున్ = నీ గుర్తుతో కూడి, నీవైయున్న శరీరము
నీకచ్చిరాదు = నీకు పనికిరాదు (భ్రాంతి రహితము కాబోదు)
నిను నీవును చేసికొనుటయు = నిన్ను నీవొక గొప్ప వస్తువుగా శాశ్వత మైనదిగా భావించుట
మానవయ్యా = అట్టి భావము లేక గుర్తు విడిచి యుండుము

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతిరహిత విధానము లక్ష్యముగా కలిగి ఉన్నవాడా! నీ మంచికి, వునికికి నీవు నివసించు గ్రామము కలిసిరానపుడు. అందలి గృహములు ఏఒక్కటీ నీకెట్లు మంచిని కలిగించవో, నీవు నేనుగా తోచబడుతున్న నీగుర్తు(మూలములేని గుర్తైరిగే శరీరము) భ్రాంతి రహితవిధానము నందు నీకు కలిసిరాదు. కావున ఈ గుర్తును, శాశ్వతమని సత్యమై వున్నదనే భావమును గురు ప్రబోధ ద్వారా విడిచి యుండుము.

**కం॥ నీరాంశ మసృగ్వోదన। సారము రేతస్సు రెంటి సమ్మిశ్రంబే।**
**ధారుణి తనువై నిలుచును। నారీనర సంగమమున**
**నయగుణరత్నా॥ 100**

## ప్రతిపదార్థము

నయగుణరత్న = శ్రేష్టమైన సద్గుణసంపత్తి కలవాడా
నీరాంశ మసృగ్వోదన సారము రేతస్సు = అన్నము, నీళ్ళు ఈరెంటి మధ్యమాంశములైన శుక్ల శోణితములు
రెంటి సమ్మిశ్రంబె = రెండింటి యొక్క కూడికచే
ధారుణి = ఈ ప్రపంచములో
నారీ నరసంగమమున = భార్యా భర్తల కలయికలో
తనువై నిలుచును = శరీరముగా ఏర్పడుచున్నది

## తాత్పర్యము

జన్మరాహిత్యమునకు అనువగు సద్గుణ సంపత్తి గల ఓ శిష్యుడా! ఈ భూమండలమునందు మనము తినుచున్న కఠినాంశమగు, పృధ్వీభూత సంబంధ ఆహారము, ద్రవాంశ జలభూత సంబంద మైన ద్రవాహారము త్రివృత్కరణి పద్ధతిచే పచన క్రియ ద్వారా సప్త ధాతువులుగా మార్పుచెంది, స్త్రీ, పురుష శరీరమందు శుక్ల శోణితములుగా మారి వారి కలయికచే రెండూ కలసి పిండోత్పత్తి చెంది ఈ శరీరము లేర్పడుచున్నవని తెలిసి కొనుము.

**కం॥ మనసన్నపు సూక్ష్మాంశము। వినుజల సూక్ష్మాంశము నను వెల**
**సెను ప్రాణం। బును రెండు గలసి పిండం। బన బ్రహ్మాండం**
**బనంగ బరగును వత్సా॥ 101**

## ప్రతిపదార్థము

మనసన్నపు సూక్షాంశము = అన్నపు సూక్షాంశము వలన మనసు
జల సూక్ష్మాంశము నను వెలసెను ప్రాణంబును = జలసూక్ష్మాంశము ప్రాణముగాను
రెండు గలసి = మనఃప్రాణములు రెండు కలసి
పిండంబన = పిండాండము అందలి నేనుగాను
బ్రహ్మాండంబను = బ్రహ్మాండంబు అందలి నేను గాను
బనగ = పైన చెప్పినరీతిగా
బరగును = చెప్పబడును
వత్సా = నాయనా

## తాత్పర్యము

త్రివృత్కరణి విధానముచే అన్నము యొక్క సూక్ష్మ భాగము మనస్సు, జలము యొక్క సూక్ష్మ భాగము ప్రాణము గా పరిణామము చెంది రెండు ఒక చోట కలసి పిండాండము అందలి నేనుగాను, బ్రహ్మాండము అందలి నేనుగాను వ్యవహరించు చున్నవి, కదా నాయనా!

(ఈ కలయిక అధిష్టానము నందు ఎట్లు కలుగు చున్నవో గురుముఖత: మాత్రమే తెలియ వలసి వున్నది).

**కం॥ రెండురీతుల గనంబడు। చుండే యీ మేనిచేత చూచి బయలునుద్ధండత దీని నుళ్ళుక్క్యని యుండుము దీనందు వాంఛ। నుంచకు శిష్యా॥ 102**

## ప్రతిపదార్థము

శిష్యా = నాయనా
రెండు రీతులుగా = పిండాండ బ్రహ్మాండములుగా, ప్రకృతి పురుషులుగా, ఆత్మాకాశములుగా, క్షరా క్షరములుగా, మన:ప్రాణములుగా
కనబడుచుండే ఈ మేనిచేత = తోచబడుచుండే గుర్తెరిగే శరీరముచేత
ఉద్ధండత = స్పష్టముగా, గట్టిగా
చూచి బయలును = దీనికి వేరైవున్న అచల పరిపూర్ణమును దృఢపరచుకొని
వుళ్ళుక్క్యని = దానియందు లేక తోచబడుచున్న గుర్తునిజము కాదని
యుండుము = విచారించుము
దీనందు వాంఛ నుంచకు=విడచుట యందు ఎట్టి అలసత్వమును చూపవద్దు

## తాత్పర్యము

ఓశిష్యుడా! నేననేగుర్తు పిండాండ బ్రహ్మాండములుగా, మన:ప్రాణములుగా, దేహి దేహములుగా, నేను మేనులుగా, ప్రకృతి పురుషులుగా, క్షరాక్షరములుగా, ఆత్మాకాశములుగా, తెలియబడుచున్నది. దీనికివేరై స్వత:సిద్ధమై వున్నది అచల పరిపూర్ణముగా గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించి, గుర్తించిన గుర్తుకు, వున్నదానియందు, మూలముగాని, స్థానముగాని లేదని నిర్భయంగా ఎట్టి సంశయము లేక విడిచి యుండుము.

## మతాల లక్షణము

జన్మరాహిత్యమునకు సంబంధించిన మార్గములు నిర్ధేశించుటలో

శాస్త్రమందు అనేక మార్గములు సోపాన క్రమములో సూచింపబడుచున్నవి. అందు జ్ఞానమార్గము, యోగమార్గము, భక్తి మార్గము, కర్మ మార్గము ప్రముఖముగా చెప్పవచ్చును. ఇందు ఒకటి గాని రెండు గాని మార్గములుగా ఎంచుకొని మతములన్నియు ఆనాటి దేశ కాల పరిస్థితుల ననుసరించి ప్రచారములోనికి వచ్చినవి. మార్గములు వేరైనా వీటిలక్ష్యము ఒకటే అను సూత్రముపై ఆయా మతకర్తలచే ఇవి లక్ష్యములుగా ప్రచారం గావింపబడినవి. "ఏకంసత్‌విప్రాబహుదా వదంతి" అను సూత్రముయొక్క అభిప్రాయమిదియే. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా ఈచెప్పబడిన మార్గములన్ని ఒక పరమలక్ష్యమును చేరుటకు చెప్పబడిన సోపాన క్రమములేగాని ఇవియేలక్ష్యములు మాత్రమూ కాదు. మతి అనగా బుద్ధి. అగ్నిభూత సంబంధమై విషయ నిర్ణయమందు నిర్ణయాత్మకమైన శక్తి కలిగి యున్నది. విషయ సంబంధమైనది గాక ఆత్మ సంబంధమైనదిగా దీనిని వినియోగించి సాధనా బలంచే అతీంద్రియముగా మార్చినపుడు దీనికి సాక్షి అయివున్న ఆత్మ తత్వమును అనుభూతము కావించుకొను శక్తి, సామర్ధ్యములు గలిగి యున్నది. మంత్రద్రష్టలైన ఋషులు ఈ సూత్రము మీదనే భిన్నభిన్న కోణములలో బ్రహ్మానుభూతిని పొందగలిగి యున్నారు. ఏకత్వమందు భిన్నత్వము, భిన్నత్వములో ఏకత్వము ఈ విధంగా ప్రచారంలోకి వచ్చియున్నవి. ఇవియే మతములుగా చెప్పబడుచున్నవి. పరిపూర్ణ భోధయందు బుద్ధి, దీనికి అధిష్టానముగానున్న జ్ఞానముకూడా ఎరుక యొక్క పరిణామములే. త్రిపుటి రూపముగానున్న(కర్త, కర్మ,క్రియ) అను బాహ్య త్రిపుటి ద్రష్ట, దృక్కు, దర్శనము అను మధ్య త్రిపుటి జ్ఞానం, జ్ఞాత, జ్ఞేయము అను అంతర్ త్రిపుటి అను త్రిపుటిలకు లోబడి ఉన్నవే గాని కేవలత్వము కలిగి మనో వాక్కుల కందక ఉన్నఅచల పరిపూర్ణమును ఇందు ప్రతిపాదింప బడలేదు. గురువాక్యము ద్వారా మాత్రము తెలియబడి వాక్యమునకు లక్ష్యార్థమైయున్న జ్ఞానమునకు కూడా లక్ష్యార్థముగా వుండి, రహస్యమై, గుహ్యాతి గుహ్యామైవున్న పరిపూర్ణ పరబ్రహ్మము ప్రతిపాదింపబడి జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ఒక యోగ్యమైన మార్గముగా

అచలఋషులచే సిద్ధాంతీకరింపబడి ఉన్నది. ఈ మార్గమునకు ఎట్టి భ్రాంతులకు తావులేదు. ప్రస్తుతము ప్రపంచంలోవున్న మార్గములన్నియు ఈశీర్షిక ద్వారా ప్రతిపాదింపబడి, వారిలక్ష్యములందు ఏమాత్రమూ భ్రాంతి లేకుండుటకు బోధదృఢీకరణ కొరకు ఈ పద్యములు చెప్పబడుచున్నవి.

**కం॥ అష్టాంగయోగముల నతి। కష్టించేప్రజలవలెనే కష్టించక**
**యీ। స్పష్టమగు బోధవినుమీ। కష్టము లన్నియును దొలగి।**
**కడకేగుసుమీ॥ 103**

## ప్రతిపదార్థము

అష్టాంగ యోగముల = యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము,ధారణ, సమాధి అనునవి
అతి కష్టించే ప్రజలవలె కష్టించక = అత్యంత నియమ నిష్టలతో కూడి పోషించే యోగాభ్యాస పరులవలె కష్ట పడక
ఈ స్పష్టమగు బోధను విను = వస్తునిశ్చయముతో కూడియున్న బోధనా పద్ధతిగల ఈ మార్గమును అనుసరించుము
నీ కష్టములన్నియు తొలగి=జన్మ పరంపరలకు లోనగుచున్న నీ కష్టములు రద్దయి
కడకేగుసుమీ = అంత మొందును, లేకుండా పోతుంది, ముగుస్తుంది

## తాత్పర్యము

షడ్దర్శనములలో యొకటైయున్న యోగదర్శనము, సాధనామయమై యమ నియమాదులతో కూడి అత్యంత కష్టములతో, శ్రమలతో కూడియున్న విధానము ప్రతిపాదింపబడి యున్నది. అట్టి విధానమును పాటింపవలసిన పనిలేక స్పష్టమైన, వస్తునిశ్చయజ్ఞానముతో కూడియున్న బోధనా పద్ధతిచే జన్మ కర్మలనుండి విముక్తి కలిగించు, భ్రాంతిరహిత విధానము ఈ పరిపూర్ణ సిద్ధాంతము నందు ప్రతిపాదింపబడుచున్నది. దీని ననుసరించుట వలన జన్మ కర్మల భ్రాంతి తొలగును.

**కం॥ ఇదిగాదు బోధనే దెల్పెద రమ్మని నీకు వేరే। పేరిడి యవలన్।
ముదముననే బ్రహ్మనను చు। వదరు మనిన వాడే మాయ
వసుమతి లోనన్ ॥ 104**

## ప్రతిపదార్థము

వసుమతి లోనన్ = ఈ ప్రపంచము నందు
ఇదికాదు బోధ = ఈ పరిపూర్ణ భావము సరియైన మార్గము కాదు
నేతెల్పెద రమ్మని = స్పష్టమైన మార్గము నే చెబుతానని
నీకు వేరే పేరిడి = మూలము లేకతోచబడుచున్న నీకు అనేక స్థాయి బేధములు కల్పించి
ఆవలన్ = ఆ తరువాత
ముదమున =సంతోషముతో
నే బ్రహ్మననుచు = తత్వమస్యాది మహా వాక్యము అహంబ్రహ్మాస్మి అనుభావము కలిగించి
వదరు మనిన వాడే = మంత్రముగా జపించు మనువాడే
మాయ = భ్రాంతి కారకులుగా చెప్పబడుచున్నారు

## తాత్పర్యము

సంప్రదాయ బద్ధమైన పరిపూర్ణ భావమునందు సిద్ధాంతీకరింప బడి యున్న బోధనా క్రమము సరియైనది కాదని, అంతకు మించి మేలై వున్న సాధనా విధానము వుపదేశించెదనని తన్నాశ్రయించిన వారిని నమ్మించి "సన్యస్త్వంశ్రవణం కుర్యాత్" అన్నట్లుగా వారికి వేరే స్థాయి, భేదములు, పేర్లు మార్చి బ్రహ్మమును గూర్చి, శ్రవణ, మనన, నిధి, ధ్యాసలచే 'అహం బ్రహ్మాస్మి' భావమును కలిగించి అట్టి భావమునందే ముక్తి సిద్ధించగలదని ప్రచారం చేయువాడు, ఈ భూమండల మందు అత్యంత మోస పూరితమైన వాడుగా చెప్పవచ్చును.

**కం॥ మంత్ర యంత్రములు ముద్రలు। తంత్రంబులు నీకు దెల్పెధన
మడిగెడి యా। మంత్రజ్ఞుల మంత్రములకు యంత్రములకు
తంత్రములకు నీగకు కూనా॥ 105**

## ప్రతిపదార్థము

కూనా = చంటి పిల్లాడా
నీగకు = దొంగలకు స్వాధీనం కాకు
మంత్రములు = మనసుతో మాత్రమే చేయునవి
యంత్రములు = బీజాక్షరములతో కూడి వస్తువుగా నిర్ధేశింపబడినవి
ముద్రలు = మనస్సు, ప్రాణము, దృష్టి అను వాటిని ఏకాగ్రము చేయుటకు చెప్పబడినవి
తంత్రంబులు = పనులు, ఇంద్రజాల మహేంద్ర జాలములు
నీకు తెల్పి = నీకుపదేశించి
ధనమడిగెడి = ధనార్జనమునకు లోబడి
ఆమంత్రజ్ఞుల మంత్రములకు యంత్రములకు, తంత్రములకు = భ్రాంతి కారకములైన ఈ పద్ధతులనుపయోగించు వారి మాటలకు

## తాత్పర్యము

మంత్రశాస్త్ర రీత్యా బీజాక్షర బద్ధమైవున్న కోట్ల మహామంత్రములు, దైవశక్తిని అక్షరబద్ధము చేయంత్రము నందు, బంధించి ప్రాణప్రతిష్ట గావింపబడి, వుపాసనా సౌలభ్యము కొరకు నిర్ధేశింపబడిన 64 యంత్రములు ఖేచరి, భూచరి, మొదలగు ముద్రలచే దృక్సాధన, గావించుటకొరకు చెప్పబడిన ముద్రలు గాని, ఇంద్రజాల మహేంద్రజాలములతో కూడిన తంత్ర విద్యలుగాని వుపదేశించి యిహ పర సౌఖ్యముల కొరకు వీటిని మార్గములుగా సూచిస్తూ, ధనార్జనయే ఉద్ధేశ్యముగా ప్రచారంలోవున్న ఇట్టి భ్రాంతులను కలిగించు గురువుల యొక్క మార్గములయొక్క మోసములకులోనుగాకు.

**కం॥ దీపముగతి కన్నులలో। పాపవలెన్। మెలగునిన్ను। పరమాత్ముడవం। చీ ప్రజలు దలతు రెరుగక। నీపాల్జైరిగుండి నేను నిను నమ్ముదునే॥ 106**

## ప్రతిపదార్థము

దీపముగతి = వెలుగుతున్న దీపమువలె
కన్నులలో పాపవలెన్ = కంటిగ్రుడ్డులో ప్రకాశించే జ్యోతివలె
మెలుగు నిన్ను = తెలియబడుతున్న నీశరీరమును, నీతెలివిని
పరమాత్ముడవనుచు = పరమాత్మస్వరూపుడిగా
ఈప్రజలు తలతురు ఎరుగక = పరిపూర్ణ భావమును వస్తు నిశ్చయ పూర్వకంగా గుర్తించనివారు ఈవిధంగా భావిస్తారు
నీపాట్లెరిగుండీ=పరిణామక్రమమునకు లోనైవున్న నీ వాస్తవరూపమును గుర్తించి
నేను నిను నమ్ముదునె = నీవు సత్యస్వరూపుడవనే మాట నేనంగీకరించను

## తాత్పర్యము

భగవంతుని యొక్క రూపము జ్యోతిర్మయమని, స్వప్రకాశమని, స్వయంసంజాతమని శాస్త్రమందు చెప్పబడుచున్నది. దీనిని ఆధారముగా గైకొని, భగవంతుడు స్వయంప్రకాశ స్వరూపుడని, కోటిసూర్య ప్రభా భాసురమని, బంగారు కాంతితో కూడిన స్వప్రకాశమని అలంకారికముగా నిర్ణయించి, అట్టిదైన తత్వము మానవోపాధియందు శిరోభాగమున అత్యంత ముఖ్యభాగముగా చెప్పబడుచున్న నేత్రమునందు ప్రతిఫలించి ఆపోజ్యోతి రూపముగా తెలియబడుచున్నదని, అర్య దర్పణము ద్వారా శిస్యులకది అనుభూతము గావించి అదియే మోక్ష స్థానముగా చెప్పుచున్నారు. మిడి మిడి జ్ఞానముచే అల్పబోధ పరాయణులైన వారిచే చెప్పబడుచున్న ఈ విధానమంతయు భ్రమరూపమ్మైనట్టిదే. సాంప్రదాయబద్ధముగా నిర్ణయింపబడిన వస్తునిశ్చయ జ్ఞానపద్ధతి తెలిసినవారు ఇట్టి భ్రమ, ప్రమలకు లోనుకారు. ఏలననగా ఎరుక పరిణామ క్రమములో ఏర్పడిన చిత్కళల ప్రభావమె ఇట్టి భ్రాంతులకు కారణమని వారు దృఢపరచు కొన్నారు.

**కం॥ తర్జనులవలన జూపును। నర్జున వర్ణగతనీలమని శిష్యుల కున్। దౌర్జన్య గురుడు నీవువి। సర్జింపు మసత్యమనుచు। సజ్జనతిలకా॥ 107**

## ప్రతిపదార్థము

సజ్జన తిలకా = యోగ్యమైన శిష్యుడా
తర్జనుల వల్ల చూపును = చూపుడువ్రేలితో సూచింపబడుతూ
అర్జున వర్ణగత నీలమని = నేత్ర పంచీకరణ విధానమందు తెలుపు ఎరుపు రంగులతో మిశ్రమ నీలి రంగుగా తోచబడు(కంటి కొనలను ఒకటిగా చేసినపుడు) కనిపించే నీలి రంగే పరమాత్మ అని
శిష్యులకున్ = తన్నాశ్రయించిన వారిని
దౌర్జన్య గురుడు = అ సాంప్రదాయక గురువు
నీవు విసర్జించుము, అసత్యమనుచు = అట్టి వానిని, వాని బోధనలను, సాధనలను నిజము కాదని విడచి వుండుము

## తాత్పర్యము

ఆర్యదర్పణము అను సిద్ధాంతము ప్రకారము పైపద్యమునందు చెప్పబడిన విధముగా శిష్యునకు పరమాత్మ సాక్షాత్కారము కలిగించుటకొరకు, శిష్యుని రెండు కళ్ళ కొనలను ఒక్కటిగా చేస్తూ, గురువు తన చూపుడు వేళ్ళతో కంటి గుడ్లను అదిమిపెట్టి శిష్యుని మనసులో కలుగు భావములను వర్గీకరిస్తూ, తెలుపు, ఎరుపు రంగుల మిశ్రమంతో ఒక్కటిగా ప్రకాశించే నీలి రంగే ఆపో జ్యోతి అని అదియే పరమాత్మ ప్రకాశమని ఉపదేశించును. ఇవన్నీ అసత్యములని, భ్రాంతి కారకములని తెలిసి ఇట్టి భావమును విసర్జించుము.

**కం॥ పురుషోత్తముడని పూజలు। నరులొనరింపుదురు భువిని నానా**
**చోట్లన్ ధర మొదలగు భూతములను। చిరుత శిశువులాడు**
**కొనెడి। చేష్టల రీతిన్॥ 108**

## ప్రతిపదార్థము

భువిని = ఈ ప్రపంచంలో
పురుషోత్తముడు = పురుషులలో కెల్ల వుత్తముడు అనగా భగవంతుడు
పూజలొనరించెదరు=దైవానుగ్రహము కొరకు అర్చనలు, ఆరాధనలు చేసెదరు

నానాచోట్లను = పలు ప్రదేశములలో
ధర మొదలగు భూతములను = భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము మొదలగు భూతములను
చిరుత శిశువు లాడు కొనెడి చేష్టల రీతిన్ = చిన్న పిల్లలాడు కొనే బొమ్మలాటల వలె నున్నది.
పురుసైనేన పురుష=పురమందు శయనించి వ్యవహరించు వాడు పురుషుడు

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమందు, జ్ఞానమును పురుష శబ్దము చేతను, ప్రాణమును లేక ప్రకృతిని స్త్రీ శబ్దము చేతను చెప్పబడు చున్నది. ఇట్టి పురుషులు, క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడుగా చెప్పబడుచున్నది. భగవంతునిపురుషోత్తముడుగా లేక ఉత్తమ పురుషుడుగా సూచిస్తూ, అతడు సర్వ వ్యాపకుడని "బ్రహ్మైవేదం విశ్వం మిదం వరిష్టం" అన్నట్లుగా ఈ ప్రపంచమంతయు ఆయన వ్యాపించివున్నాడని, ఆ కారణముచేత పిపీలికము మొదలు బ్రహ్మాండ మంతయు ఆయన స్వరూపమేనని పేర్కొను చున్నారు. ఈ పద్ధతిచే పంచ భూతములు, ఆయన స్వరూపమే. త్రిగుణాత్మకమైన వుపాసనా పద్ధతులు నిర్ణయించి భగవదనుగ్రహము పొందుటకు అనేక మార్గములు ప్రచారములోనికి తీసుకువచ్చి, చిన్నపిల్లలు వినోదము కొరకు ఆడుకొనే బొమ్మలాట లాగ వ్యవహరించు చున్నారు. ఇవన్నియు భ్రాంతి కారకములే అని తెలియవలెను.

**కం॥ రసమన దగనిది వస్తువు। బసవన్న కదెట్టు లెరుక ప్రభువుకు**
**దెలుసున్। రసమైతె విసము సగుణము। పసిగాదాముచ్చటంత।**
**చెవుల వినుటకై॥ 109**

## ప్రతిపదార్థము

రసమనదగనిది = ప్రాణ ప్రజ్ఞలు లేనిది
వస్తువు = పరిపూర్ణ పరబ్రహ్మము
బసవన్నకు = శైవ మతము నందు అత్యంత గొప్పవాడైన బసవేశ్వరునకు

అదెట్లు ఎరుక = పరిపూర్ణ భావము ఎట్లు తెలియ బడినది?
ప్రభువునకు తెలుసున్ = అచల పరిపూర్ణభావము నందు విశేషముగా కృషి చేసిన అల్లమా ప్రభువు అను పేరుగల గురుమూర్తిని ఆశ్రయించుటచేత
రసమైతే విషము=ప్రాపంచిక, ప్రజ్ఞలతో కూడిన వస్తువు విషముతో సమానమైనది
సగుణము = జ్ఞానసంబంధమైనది
ససిగాదు = జన్మరాహిత్య విధానమునకు సరిపోదు
ముచ్చటంత = సంబంధించిన విషయజ్ఞానమంతా
చెవుల వినుటకై = బోధను క్రమములో వినుటకు

## తాత్పర్యము

కన్నడ దేశమునందు వీరశైవ మతము చాలా ప్రబలముగా ప్రచారములో వున్నది. అందు బసవేశ్వరుడు చాలా ప్రముఖముగా చెప్పబడుచున్నాడు. శైవ మతాన్ని వుద్ధరించడానికి, పరమేశ్వరుడు తన వాహనమైన నందీశ్వరుడ్నే బసవేశ్వరుడుగా జన్మింపజేసినట్లు ఒక కథ ప్రచారములో నున్నది. అణి మాది అష్ట సిద్ధులు కలవాడై, ఎన్నో మహత్యములు ప్రదర్శించి నట్లుగా బసవపురాణమునందు ఇతనిని గూర్చి చెప్పబడుచున్నది. ఈయనకు 'చెన్నయ' అను గురువు శైవదీక్ష నిచ్చినట్లుగా తెలియు చున్నది. శివాద్వైతమునందు ఆరూఢత చెందినప్పటికి, సంతృప్తి చెందక జనన మరణ భ్రాంతి రహితమునకు అల్లమా ప్రభువు అను పేరుగల పరిపూర్ణ భావజ్ఞుని ఆశ్రయించి, భ్రాంతి రహిత విధానమును, ఈ పరిపూర్ణ బోధ ద్వారా గ్రహించినట్లుగా చరిత్ర చెప్పుచున్నది. ఏలననగా జన్మ కర్మలకు అత్యంత మూలకారణమైన, అధిష్టాన వస్తువు రసబలములు కలిగి యున్నది. (రసము అనగా ప్రాణము, బలమనగా జ్ఞానము) దీనిని తెలుసుకొనుటచేత భ్రాంతిరహితము కలుగ జాలదని ఏలననగా అన్నింటికీ మూలమై స్థానమై ఈ గుర్తే ప్రకాశించుచున్నదని దీని రహితమునందు తప్ప భ్రాంతి రహితము కాజాలదని తెలియ వలెను.

**కం॥ ద్వైతా ద్వైత విశిష్టా। ద్వైతులమని కీచులాడు। దయ్యాముల వలెన్**
**ద్వైతా ద్వైత విశిష్టా। ద్వైతులతో కీచులాడ। దగునేనీకున్॥ 110**

## ప్రతిపదార్ధము

ద్వైతా ద్వైత విశిష్టాద్వైతులు=ద్వైతులు అనగా జీవుడు ఈశ్వరుడు వేరని అనేవారు
అద్వైతులు అనగా = జీవేశ్వరులు ఒకటేనని అనేవారు
విశిష్టాద్వైతులు అనగా=జీవుడు ఈశ్వరుడు జగత్తు మూడు వేరని చెప్పువారు
కీచులాడు దయ్యాములవలె = ఒకరి భావముతో ఒకరు సరిపెట్టు కొనక ఎవరికి వారే గొప్పవారమని
ద్వైతా ద్వైత విశిష్టాద్వైతులతో = పైనపేర్కొన బడిన మతవాదులతో
కీచులాడదగునేనీకున్ = వాదప్రతివాదములు చేయతగదు

## తాత్పర్యము

వేదాంత విచారణయందు ఈసృష్టి విధానమును 3 గా విభజించినారు. ఈశ్వరుడు, జీవుడు, జగత్తు మతవాదులు ఈ మూడింటిని ప్రమాణములుగా స్వీకరించి వారి మతములను వ్యాప్తి చెందించినారు.

1. అద్వైతము = జీవేశ్వరులకు తత్వమసి మహావాక్యవిచారణ ద్వారా ఏకత్వము ప్రతిపాదించిజగత్తును మిధ్యావస్తువుగా, పేర్కొంటు (బ్రహ్మసత్యం, జగన్మిధ్య, జీవోబ్రహ్మైవానపర:) అని అద్వైత భావము శంకరాచార్యులచే ప్రతిపాదింపబడినది.
2. ద్వైతము = జీవేశ్వరులకు భేధమునుకల్పించి పంచముక్తులను, లక్ష్యముగా ద్వైత మతమను పేరుతో మధ్వాచార్యులవారు ప్రతిపాదించిరి.
3. విశిష్టా ద్వైతము = జీవుడు, ఈశ్వరుడు, జగత్తు అను మూడూ భిన్నములని ఏకదృష్టితో చూచినపుడు మాత్రమే ఒకటిగా చెప్పవచ్చునని అను ఒకవిశిష్టమైన భావమును, రామానుజులచే విశిష్టాద్వైతము పేర ప్రచారములోనికి వచ్చినవి. ఈ మతములు మూడును ఆయా దేశకాల పరిస్థితులను బట్టి ప్రచారము లోనికి వచ్చినవి. వీరిలో ఒకరి కొకరికి సరిపడక వాద ప్రతివాదములతో, భిన్న భావములు ప్రచారము

లోనికితెచ్చిరి

ఇవన్నియు అధిష్టాన రూపమైన ఎరుక యొక్క పరిణామములే. కావున పరిపూర్ణబోధను ఆరూఢపరచుకునే విధానములో యిట్టి వారితో ఎట్టి చర్చలకు తావులేకుండా పరిపూర్ణ భావజ్ఞుడు జీవించవలసి వున్నది.

**కం॥ అనుభవేదాంతులమని। తినరాని పదార్ధమెల్ల। తినుదుర్జనులన్।
కనబోకుము తద్భోధను। వినుబోకుము యెన్నటికి వివేక విచారా॥ 111**

## ప్రతిపదార్థము

వివేక విచారా = వివేకవంతమైన విచారణా పద్ధతి కలవాడా

అనుభవ వేదాంతులమని = వేదాంతమందు చెప్పబడిన ఆత్మానుభవము నందు గట్టి అనుభవము పొందినవారమని

తినరాని పదార్ధమెల్ల=బ్రహ్మవిద్యోపాసనకు అనుకూలముకాని పదార్థములను

తిను దుర్జనులను = తినుటకు అలవాటు పడిన దుష్టప్రవృత్తి గలవారిని

కనబోకుము = వారితో సంబంధము కలిగి వుండకుము

తద్బోధను = వారుపదేశించు బ్రహ్మవిద్యను

వినబోకుము = వినవలదు

ఎన్నటికీ = ఎప్పటికీ

## తాత్పర్యము

బ్రహ్మవిద్య యందు అనుభవమును సాధించిన వారికి లౌకిక జీవితమునందు గల ఆహార విహారాదులయందు ఎట్టివిధి నిషేదములు వుండవని వారేమి చేసినా వ్యాటిప్రభావము అట్టి వారికి చెందదని విపరీత భావన చెంది, లౌకిక జీవితము నందు అనేకమైన, నీచమైన ఆహారపుటలవాట్లు కలిగియున్న దుర్మార్గుల యొక్క సహవాసముగాని వారిబోధనలకు గాని ఏమాత్రము విలువ నీయవద్దు. నిర్దుష్టమైన విచారణతో కూడిన వివేకము గల ఓ శిష్యుడా! యిట్టి విధి విధానమందు బహూజాగ్రత్త కలిగి యుండుము.

కం॥ జిహ్వోపస్థ విషయము। లెవ్విగలవో వాట్ని విడువలేని
గురువులన్ యెవ్వరుజేరి కొలుతురో। యివ్వసుధను వారు
జెడుదురిది నిజము సుమీ॥ 112

## ప్రతిపదార్థము

జిహ్వ = జ్ఞానేంద్రియములలో జలభూత సంబంధమైన ఆహారరుచులు గుర్తించు ఇంద్రియము
ఉపస్థ = కర్మేంద్రియములలో జలభూత సంబంధమగు సృష్టి కార్యార్థమై ఏర్పడిన యింద్రియము
విషయము లెవ్విగలవో=వీటి పనులేమైతే వున్నాయో (ఆహారము, ఆనందము)
ఎవ్విగలవో = ఏఏక్రియలు గాచెప్పబడుచున్నవో
వాట్ని విడువలేనిగురువులన్ = అట్టి పనులను విడువక లౌకిక వృత్తితో కూడిన గురువులను
ఎవ్వరు చేరి కొలుతురో = వారిని ఎవరు గొప్పగా భావించి ఆశ్రయిస్తారో
ఈ వసుధను = ఈ సమాజమునందు
వారుచెడుదురు = యిహ పరాలు రెంటికీ వారు దూరము కాగలరు
ఇది నిజము సుమీ = ఇది చాలా సత్యమైన విషయము

## తాత్పర్యము

జ్ఞానేంద్రియములలో జిహ్వ, కర్మేంద్రియములలో గుహ్యము ఈ రెండునూ విషయాసక్తమై, సృష్టి కార్యములో ప్రపంచాభి ముఖములై వున్నవి. బ్రహ్మ విద్య యందు ఆరూఢత చెందిన మహనీయులు వీటివిలువలను కాపాడు కొనుచూ ఆదర్శవంతులై యాదృచ్ఛా లాభసంతుష్ఠి కలిగి యితరులకు ఆదర్శ వంతులై జీవించ వలసి వున్నది. ఇందులకు భిన్నముగా బ్రహ్మవిద్య యందు ఆరూఢత చెంది కూడా, సామాన్యులవలె పైవిషయములకు ప్రాధాన్యతలిచ్చి లౌకిక పద్ధతిగా జీవించు గురువులను ఎవరాశ్రయించెదరో "యతోభ్రష్ట తతోభ్రష్ట" అన్నట్లుగా చెడిపోవుదురు. ఇదిఅత్యంత సత్యమైన విషయము.

కం॥ పాషండ మతము వారల। వేషంబులు జూచి శిష్యవితతి
భ్రమించున్। యీ షత్తీబోధెరుగక। దూషింతురు విన్న కన్న
దుర్భాషణలన్॥ 113

## ప్రతిపదార్థము

పాషాండ మతములవారల=అనుష్టానహీనమైన మతాచారవిచారములు గలవారు
వేషంబులు చూచి = వారుధరించిన వస్త్ర, నడకలను చూచి
శిష్య వితతి భ్రమించున్ = ఆయా మార్గములందు పాటించు శిష్యులు భ్రమించు చుందురు
ఈ షత్తీబోధ ఎరుగక = పరిపూర్ణబోధయందు ఏమాత్రము ప్రవేశములేక
దూషింతురు = పరిపూర్ణభావజ్ఞలను చూచి నిందించెవరు
విన్న కన్న దుర్భాషణములను = వినిచూచి కఠినమైన మాటలతో నిందిస్తారు

## తాత్పర్యము

అచలపరిపూర్ణబోధ యందు ఆరూఢత చెందిన మహాత్ములు వారిస్థితికి తగినవిధముగా నిరాడంబరులై, తమ ఉనికిని కాపాడుకొనుచూ గ్రహించిన బోధకు తగిన విధముగా ఆదర్శవంతమైన జీవితము గడిపెదరు. ఇట్టి ఆరూఢత తెలియక మతములవారు, వేషభాషలకు ప్రాధాన్యత నిచ్చి, వారల నాశ్రయించిన శిష్యులకు భ్రమ, ప్రమలకు వీలుగానున్న ఆచార విచారములు కల్గించి పరిపూర్ణ బోధగాని, మహాత్ముని జీవితముగాని కొంచమైనా అవగాహన లేక కఠినమైన మాటలతో నిందించెదరు.

కం॥ నిజగురుబోధ నెరుంగక గుజగుజ శిష్యులకు జెప్పు
గురువులబోధల్ భుజగ విషోప మగుసుమి। సుజనౌఘము
మెచ్చదట్టి। సుద్దిని పట్టీ॥ 114

## ప్రతిపదార్థము

నిజగురుబోధ నెరుంగక=జననమరణరహిత విధానమునకు అచల ఋషులచే వస్తునిశ్చయ పూర్వకముగా సిద్ధాంతీకరించబడిన పరిపూర్ణ

భావము తెలియక
గుజ గుజ = జనన మరణములచే బాధింపబడుచున్న
శిష్యులకు చెప్పు గురువులబోధల్ = తమ్మాశ్రయించిన వారికి తమకు తోచిన విధముగా మిడి మిడి జ్ఞానముతో బోధించు గురువుల బోధలు
భుజగ విషోపమగు సుమీ=నాగుపాము విషము త్రాగిన విధముగా నుండును
సుజనౌఘము=సాంప్రదాయ పద్ధతిగా వాస్తవ జ్ఞానమును పొందిన మహాత్ములు
మెచ్చరు = అంగీకరించరు,పాటించరు
అట్టి = పైన చెప్పిన విధముగా
సుద్దిని పట్టి = సాంప్రదాయ మార్గమును అనుసరించును

## తాత్పర్యము

జననమరణ భ్రాంతిరహిత విధానమునకు మేలైన పద్ధతిలో వస్తునిశ్చయ పూర్వకంగా అచల ఋషులచే రాజయోగ ధర్మముగా పరిపూర్ణభావము ప్రతిపాదించబడి వున్నది. సత్పురుషులైన వారు వాస్తవమును తెలుసుకోవలెను అను తలంపుతో ఇట్టి మార్గమునే అనుసరించెదరు. ఇట్టి విధానము తెలియక, తన వూహ, అపోహలచే అసంప్రదాయకమైన పద్ధతులతో వాస్తవమును గుర్తించ లేక జన్మ కర్మలు తొలుగుటకు పలు మార్గములు మత వాదులచే ప్రచారము గావింపబడుచున్నవి. ఈ విధానములన్నియు ప్రమాద భరితములై, కఠినతరమై జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు బదులుగా జన్మ కర్మలకు బంధింపబడి యుందురు. ఇవన్నియు నాగుబాము విషముతో సమానముగా తోచబడుచున్నది. ఏలననగా ఉదాహరణకు "అహం బ్రహ్మాస్మి" అను భావము కలవాడు అట్టి బ్రహ్మ భావనయందు జీవిస్తూ మరణమనే నాగుపాము నోట చిక్కినపుడు విషగ్రస్తుడైనవాడు క్షణ క్షణమునకు విషప్రభావముచే జ్ఞాన శూన్యతను పొంది మరణించునట్లుగా మరుపు రూపము చెందునేగాని, అఖండాత్మ రూపుడై వుండుట పొసగదు.

**కం॥ తనువును విడి బ్రహ్మనునే। నను మునుపటి నీ విచార। మటు బెట్టిపుడున్। నిను నీతనువును వేరని। యనకను పరిపూర్ణ మరసియవి విడువదగున్॥ 115**

## ప్రతిపదార్థము

తనువును విడి = శరీరమును విడిచిపెట్టి
బ్రహ్మను నేను = అహంబ్రహ్మాస్మి అను భావమును
అనునీ మునుపటి విచారము=నీచేత పాటింపబడుచున్న విచారణ క్రమము
మటు పెట్టి = విడిచి పెట్టి
యిపుడున్ = నాచే చెప్పబడుచున్న పరిపూర్ణ బోధ క్రమములో
నిను నీ తనువుకు వేరనియనకన్ = నీవు, నీశరీరము(ఈశ్వరుడు, జగత్తు) నీవు నీ శరీరము వేరుగా వున్నావని భావించక
పరిపూర్ణ మరసి = గురుముఖత: పరిపూర్ణ భావమును దృఢపరచుకొని
అవి విడువ దగున్ = నీ శరీరము, నీవు అను ద్వంద్వ పద్ధతిగా తోచబడుచున్న ఈ గుర్తును గురువాక్యముచే విడిపెట్టి యుండుము

## తాత్పర్యము

అద్వైత సిద్ధాంతమందు తత్వమసి మహా వాక్యము ద్వారా అహంబ్రహ్మాస్మి అను భావము ఏర్పడుచున్నది. ఇట్టి భావముచే తాను బ్రహ్మము నని, జగత్తంతయు మాయ అని తెలియబడుచున్నది. జననమరణ భ్రాంతి రహితవిధానమునకు ఇట్టి భావము సరిపోదు. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా ఈ భావము కూడా విడువ వలసి వున్నది. కావున ఇది వరకు నీకు గల ఇట్టి భావమును ప్రయత్న పూర్వకంగా విడిచిపెట్టి, ఈశ్వ రుడు, జగత్తు అను ద్వంద్వ పద్ధతిగా, (నేను, మేనులుగా) గుర్తెరబడుచున్న నిన్ను ఒకటిగా భావించి గురుముఖత: ఈ రెంటికీ వేరైవున్న అచల పరిపూర్ణమును వుండ జూచుకొని, దృఢపరచుకొన్న మీదట, ద్వంద్వ పద్ధతిగా తోచబడుచున్న నీ శరీరమును గురువాక్యముచే విడచి వుండుము.

**కం॥ కొందరు వైరాగ్యంబున, కొందరు తీర్థాటనమున। కొందరు కర్మంబందున వ్రత జపతపముల। కొందరు నటియింతు రిట్టి। కోర్కెల మనుజుల్॥ 116**

## ప్రతిపదార్థము

కొందరు వైరాగ్యంబందున = మోక్షాపేక్ష కోరి ఐహికమైన జీవిత సుఖములను విడచి సన్యాసి మార్గమును స్వీకరించుదురు కొందరు
కొందరు తీర్థాటనమున = తీర్థయాత్రలవల్ల ముక్తి కలుగునని కొందరు
కొందరు కర్మంబందున = నిత్య కర్మల వల్ల మోక్షమని కొందరు
వ్రత జపతపముల కొందరు = అనేక వ్రతములు, పెక్కు జపములు కఠినమైన నియమ నిష్టలతో కూడిన తపస్సుమోక్ష మార్గములని కొందరు
నటియింతురు = ఏర్పాటు చేసుకొందురు
ఇట్టి కోర్కెల మనుజుల్ = ఆయా కోరికలు ఫలాలు కోరిన మనుజులు

## తాత్పర్యము

మోక్షా పేక్షనుకోరి సమాజమునందు మనుజులు, పలువిధములైన, మార్గములను లక్ష్యములుగా ఎంచుకొని,అందుకు సరిపడులక్ష్యములతో, విధి విధానములను పాటిస్తూ కృషిచేయుచున్నారు. అందు ముఖ్యమైనవి, సన్యాసధర్మము, తీర్థయాత్రలు,పుణ్యనదీ స్నానములు, నిత్యనైమిత్తిక కర్మలు, వ్రతములు, జపములు, తపస్సు మున్నగునవి.

**కం॥ కొందరు భక్తి త్రయమున। కొందరు యోగముల యందు కొందరు జ్ఞానం। బందు రమింతురు వారల। కందరికీ బోధ యిష్టతౌనా తనయా॥ 117**

## ప్రతిపదార్థము

కొందరు భక్తి త్రయమున=బాహ్య భక్తి, అనన్యభక్తి, ఏకాంత భక్తి అనునవి లక్ష్యములుగా కొందరు
కొందరు యోగములందు=మంత్ర, లయ, హఠ, రాజయోగములను

మార్గములుగా కొందరు
కొందరు జ్ఞానంబందున=వేదాంతము నందు మహావాక్యవిచారణ గొప్పదని కొందరు
రమింతురు=ఆయా మార్గములందు కృషి సల్పుచూ ఆనందము చెందెదరు
వారల కందరికీ = పైన పేర్కొన్న మార్గములందు కృషి చేయు వారందరికీ
ఈ బోధ యిష్టతౌనా = జనన మరణ భ్రాంతి రహిత మార్గముగా చెప్పబడుచున్న ఈ విధానము నచ్చదు
తనయా = నాయనా

## తాత్పర్యము

నాయనా! భక్తి మార్గము అందు తరగతులు బాహ్య భక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి,తరగతుల వారీగా ప్రయాణించువారు కొందరు. యోగ మార్గముగా చెప్పబడుచున్న, మంత్ర, లయ, హఠ, రాజయోగములు మార్గములుగా కొందరు. జ్ఞాన మార్గముగా చెప్పబడు చున్న మహావాక్య విచారణ యందు మరి కొందరు, ఆయా మార్గములందు ప్రేమ పెంచుకొని మోక్షమునకు మార్గముగా ప్రయాణించుచున్నారు. అందు ఆనందానుభూతిని పొందుచున్నారు. సర్వ భ్రాంతి రహిత విధానమే లక్ష్యముగా గల్గి రాజయోగ ధర్మమందు భుక్తి, ముక్తి క్రియల యందు పరిపూర్ణత్వము సాధించు రాజయోగ ధర్మముగా చెప్పబడుచున్న ఈ మార్గము అట్టి వారలు అంగీకరించలేరు లేక పాటించలేరు.

## అశరీర పద్ధతి

శరీరమనగా గుర్తెరిగే శరీరము. అశరీరమనగా యిట్టి గుర్తుతో సంబంధపడక స్వయంసిద్ధమైవున్న పరిపూర్ణ పరబ్రహ్మము నందు స్థితి కల్గియుండుట. సిద్ధాంతరీత్యా పరిపూర్ణ భావము వర్గీకరించుటలో పరిపూర్ణ మెరిగి, ఎరుకను ఎరిగి, ఎరుకను మాను అను క్రమములో ఆరూఢత కల్గి, ఆదర్శవంతులై తాను జీవించినంత కాలము తాను దృఢపరచుకొన్న భావమునకు అను గుణ్యంగా ప్రాపంచీక, పారమార్ధిక విషయము లందు ప్రాధాన్యత కలిగిన అంశములలో కర్తృత్వరహిత కర్మాచరణతో కూడి

గురువాక్యము యథాతథా అన్నట్లు లోక కళ్యాణము కొరకు, సమాజ వికాసమును తాను గ్రహించిన పరిపూర్ణ భావము ఎట్టి విలువ గలిగి వున్నది అనుభవపూర్వకంగా, నడక ద్వారా ప్రవర్తించు విధానము అశరీరపద్ధతిగా చెప్పబడుచున్నది. ఈ పద్ధతిగా జీవించు వ్యక్తిని గుర్తించుట చాలా కష్టము. వృత్తపరిపూర్ణమే వారు వారే వృత్తపరిపూర్ణము అని దీక్షితులవారు సెలవిచ్చినట్లుగా పరిపూర్ణత దనరుచు జీవించు చుందురు. ఆ విధి, విధానం ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ భ్రమ రహిత సహిత జనులను। సుమనసులను నరులసమము।**
**జూచిన విశ్వం। బమరిలేకుండు నుండును। క్రమమున కల**
**వంటి దగుచు। కడు నిజము సుమీ॥ 118**

## ప్రతిపదార్థము

భ్రమరహిత జనులు = భ్రాంతి రహిత విధానము దృఢపరచుకొని అందుకు తగిన విధంగా జీవించువారు, భ్రమరహితులు అనబడెదరు.

భ్రమసహితజనులు = భ్రమ, ప్రమలకు కారణమైన వస్తువునందు సత్యము అనే భావము కలిగి వున్నవారు

సుమనసులు = మంచి మనసు కలవారు, అనగా సత్వగుణ సంపన్నులు

నరులు = అజ్ఞాన విశిష్టమైనతమో గుణముచే జీవించువారు

సమము చూచిన = వీరికిగల సంబంధమును అనగా జీవన విధానమును, పరిశీలించిన, లేక గమనించిన

విశ్వము = ప్రపంచము(విశ్వసించునది)

అమరి లేకుండ = వున్నట్లుగా, సత్యముగాను లేనట్లుగాను నిజముకానట్లుగాను

వుండును = తోచబడును

క్రమమున = నిర్దుష్టమైన విధానముచే

కలవంటిదగుచు = కలవలె తోచబడును

కడు నిజము = వాస్తవముగా, యదార్థముగా వున్నట్లు

## తాత్పర్యము

భ్రమరహిత జనులనగా పరిపూర్ణ భావమును వున్నదున్నట్లుగా వస్తునిశ్చయపూర్వకంగా, గురుముఖత: దృఢపరచుకొని సర్వభ్రాంతి రాహిత్యస్థితియందు ఆరూఢత చెందియున్నవారు.

భ్రమసహిత జనులనగా :- జగత్‌పరిణామమునకు కారణమైన అఖండ ఎరుక యొక్కస్థితి యందు సత్యత్వము కలిగి యున్నవారు. పరిపూర్ణ భావమందున్నవారు, మనస్సనే పదార్థము కలిగి వుండియు, అందలి వాసనలు, సంస్కారములు గుర్తురూపముగా వున్న వీటిని పరిపూర్ణ బోధయందలి బోధాగ్నిచే నిర్వీర్యము గావించుకొని నిర్విషయాంత:కరణ గలవారు.

నరులనగా = నారము అనగా ప్రాణము, శక్తి స్వరూపము, గుణసంబంధము అయిన మనసు గలవారు, వీరిరువురు ఒకే ప్రపంచమునందు కలసిమెలసి జీవించు చున్నను. దానియొక్క ప్రభావమునకు పరిపూర్ణ భావజ్ఞుడు లోనుకాక, ఎట్టి భ్రాంతి చెందక కలవలె తోచబడుచున్నదని దృఢపరచుకొని వ్యవహరించును. ఇట్టి భ్రాంతి రహిత విధానము ఎరుగని వారు ప్రపంచము నిజమని భ్రాంతి చెందుటచే అందలి విషయ స్పర్శకు లోనై భ్రమ, ప్రమలకు లోనగు చుందురు.

**కం॥ కలతనను లేనుకలనని। తలపోశెటివారిమాట। తమకే నిజమౌ।**
**కలలేనివారు కలవారలు వీరలె యొకరి నొకరు నరయ**
**రిరువురున్॥ 119**

## ప్రతిపదార్థము

కల = గుర్తెరిగే శరీరము
తనను = తోచబడుచున్న తనను
లేను = లేకపోవుచున్నాను, నిజముకాదు
కలను = నిజముగా వున్నాను, తెలియబడుచున్నాను.
అని = పై విధముగా భావించి

తలపోసేటి వారి మాట = నిజము కాదని ఒకరు, నిజమని ఒకరు తెలుసుకొన్నవిధానము
తమకే నిజము = వారి వారి స్థితినిబట్టి స్వఛ్ఛముగా తోచబడును
కలలేనివారు = గుర్తెరిగే తెలివిని నిజము కాదని దృఢపరచు కొన్నవారు
కలవారలు = గుర్తెరిగే తెలివిని సత్యమని నమ్మివున్నవారు
వీరలె =ఇట్టి ఆరూఢతలో బేధము గలవారు
ఒకరి నొకరు అరయరు = ఒకరిని గూర్చి ఒకరికి తెలియ బడరు
ఇరువురున్ = పైన పేర్కొన్నవారిద్దరు

## తాత్పర్యము

భ్రాంతి కారణమగు ఎరుక, పరిపూర్ణమందు లేక తోచబడు చున్నదని, కలవంటిదని నిజము కానిదని, దృఢపరచుకున్నవారు ఒకరు, గుర్తెరగబడే తెలివి సత్యమైనదని, శాశ్వతమైనదని, భావించి జీవించువారొకరు. ఈవిధముగా ఒకరి కొకరు వారిభావనలకు సరిపడిన విధానముగా, ప్రపంచమందు వ్యవహరించెదరు. వారి వారి ఆరూఢతలచే తగిన విధముగావ్యవహారములు జరుపుకొనెదరు. ఒకే ప్రపంచమందు వీరు కలసి జీవించు చున్నను అంత:కరణ యందలి ఆరూఢ విధానముచే ఒకరికొకరు సంబంధ పడక, ఒకరి గూర్చి ఒకరికి తెలియక జీవించు చుందురు.

**కం॥ కలవారికి మేలుకలో। గలవారికి జాగ్రతందు। కలహము గలదా।**
**కలహించిరేని వారలు। కలవారలెగాని మేల్క। వారుగారెన్నటికిన్॥120**

## ప్రతిపదార్థము

కలవారు = ఎరుకనే కలలో వున్నవారు
మేలుకలో కలవారు = పరిపూర్ణ బోధచే ఆరూఢత చెందిన వారు
జాగ్రతందు = ప్రాపంచీక వ్యవహారములందు
కలహము కలదా = బేధ ముండదు, తేడా వుండదు
కలహించిరేని = బేధముగా, తేడాగా ప్రవర్తిస్తే, లేక జీవిస్తే
వారలు = అట్టి తేడాగా ప్రవర్తించేవారు

కలవారే గాని = ఎరుక భ్రమలో వున్న వారే గాని
మేల్కొ వారు కారు = బోధాగ్నిచే భ్రాంతిరహిత స్థితిని పొందిన వారు కారు
ఎన్నటికిన్ = ఎప్పటికి

## తాత్పర్యము

ఎరుక అనే కలలో ప్రకృతి జన్యముగా కలుగు జాగ్రత, స్వప్నము, సుషుప్తి అను అవస్థలు అందలి వ్యవహారములు పరిపూర్ణ బోధచే సర్వభ్రాంతి రహిత స్థితిని బోధాగ్నిచే దృఢపరచుకొని, మెళకువ స్థితిని పొందినవారు. పైన పేర్కొన్న వారు అందరివలెనె ప్రాపంచీక పద్ధతియందు కలవారి వలె ప్రకృతి జన్యక అవస్థలయందు వాటి వ్యవహారములందు జీవన విధానమందు ఎట్టి తేడాలున్నట్లుగా కన్పించరు. అనగా ప్రాపంచీక వ్యవహారములందు, అందరి వలె అన్ని వ్యవహారములు, వాస్తవముగా జరుపుచుందురు. అట్లు బేధములేక ప్రవర్తించనిచో, వారు కలలో వున్నట్లే గాని మెళకువ స్థితిని పొందినవారు కారు.

**కం॥ సురలందు దోచుకలవలె। నరుదెంచును బ్రహ్మాయందు నఖిల జగంబుల్। యరుదెంచి యజుని గన్గొని। బిరబిర తామేగు నిల్వ। బిడియం బగుచున్॥ 121**

సురలందు తోచు కలవలె = దేవతలకు వచ్చు కలవలె
అరుదెంచును = ఏర్పడెను,తోచబడెను
బ్రహ్మాందు = పరిపూర్ణ పరబ్రహ్మామందు
అఖిల జగంబులు = సమస్త ప్రపంచము
అజునిగనుగొని = గురుముఖత: పరిపూర్ణము స్వత:సిద్ధమై యున్నదని దృఢపరచుకొని
బిరబిర = తక్షణం, వెను వెంటనే
తాము ఏగు = తమంతట తానుగా లేకపోవును
నిల్వ = నిలచుటకు
బిడియంబనుచు = నిజము కాదని సిగ్గు పడుతు

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన అచలపరిపూర్ణమునందు లేక తోచబడుచున్న ఎరుక సురస్వప్నము వంటిది(అన్నిటికి మూలము, ఆధారమై ఉన్న తనకు ఉన్న పరిపూర్ణమునందు ఉనికిలేదని దృఢపరచుకున్నవారు సురలు) లేనిది, వాస్తవము కానిది అట్టి దానియందు కలవలె తోచబడిన ఈ జీవేశ్వర జగత్తులు వీరికి లేకనే తోచబడుచున్నవి గురుముఖత: వస్తు నిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము ఎరుకల ఉనికిని దృఢపరచుకొని తన ఉనికి లేనిదని సిగ్గుపడుతూ వెను వెంటనే తమకు తాముగా లేకపోవు చున్నవి.

**కం॥ రోగపు చేష్టలు బోయిన। రోగము గలదనినమాడ్కి।రోయక నిన్నున్। నీగురుతెరుగుట మణగిన। నేగలనన నీదుమాట నిశ్చయమటరా॥ 122**

## ప్రతిపదార్థము

రోగపు చేష్టలు = వ్యాధియొక్క లక్షణములు
పోయిన = వైద్యవిధానంచేత నశించిన తరువాత
రోగము కలదనిన = వ్యాధి వున్నట్లవుతుందా
మాడ్కి = ఆ పద్ధతిగానే
రోయక = విడిచిన పిదప
నిన్నున్, నీగుర్తెరుగుట = నీవు నీ గుర్తెరిగే లక్షణము
అణగిన = బోధాగ్నిచే నశించిన పిదప
నేకలను = నేను సత్యమును శాశ్వతమును
అన = అనే
నీదు మాట = నీయొక్క అభిప్రాయము
నిశ్చయమటరా = నిజము కానిది

## తాత్పర్యము

పంచభూతాత్మకమైనది శరీరము. ఇది వాత, పిత్త, శ్లేష్మములనే

కాలానుగుణముగా వచ్చు వ్యాధులచే బాధింపబడుచుండును. ఈ వ్యాధుల లక్షణములు, అనగా గుణములచే మాత్రమే తెలియబడుచుండును. వీటికి సరిపడు వైద్య విధానముచే ఈ వ్యాధిలక్షణములు వాటి తీవ్రత నశించును. వ్యాధి, వ్యాధి లక్షణములు సూక్ష్మము. వాటి నివారణకు పాటించిన ఔషధము స్థూలము. వ్యాధి లక్షణములు పోయిన తరువాత వ్యాదికి ఎట్లు ఉనికి లేదో స్వత:సిద్ధమై యున్న పరిపూర్ణమునందు లేక తోచబడుచున్న నీవు నీ గుర్తెరిగే లక్షణము లేనివని, నిజము కానివని గురుప్రబోధచే ఆరూఢపరచుకొన్న మీదట జనన మరణ పరంపరలు కలుగవు. ఏల ననగా పరిణామ క్రమమునకు వీలైన గుర్తు నశించిన పిదప దాని లక్షణములు పైన పేర్కొన్నవిధముగా ఇక వుండుటకు వీలు లేదు కదా!

## జ్ఞాన పద్ధతి

భారతీయ తత్వశాస్త్రమునందు షడ్దర్శనములు ప్రముఖముగా చెప్పబడుచున్నవి. ఇవి సోపాన క్రమములో, న్యాయదర్శనము, సాంఖ్యదర్శనము, వైశేషిక దర్శనము, యోగదర్శనము(పూర్వమీమాంస దర్శనము) (కర్మ) ఉత్తరమీమాంస దర్శనము(జ్ఞానము) ఆపైన పరిపూర్ణ దర్శనముగా చెప్పబడుచున్నది. ఇందు పైన పేర్కొన్న 6 దర్శనములను క్రోడీకరించి, నాలుగు మార్గములుగా సూత్రీకరింప బడినవి. 1. జ్ఞానమార్గము 2. యోగ మార్గము 3. కర్మ మార్గము 4. భక్తి మార్గము. ఇందు జ్ఞాన మార్గమును విశేషమైనది గాను అత్యంత సులభమైనది గాను శాస్త్రకారులచే చెప్పబడుచున్నది. దీనికి అనుబంధముగా ప్రస్థానత్రయము, అనగా విచారించవలసిన విషయములు 3గా చెప్పబడుచున్నవి. అవి 1. బ్రహ్మ సూత్రాలు 2. ఉపనిషత్తులు 3. భగవద్గీత. ఇందు ఏది తెలిసిన మీదట అన్నీ తెలిసినట్లగునో అట్టి చరమ స్థితియే జ్ఞానము. ఇదియే స్వస్వరూప జ్ఞానముగా, ఆత్మ జ్ఞానముగా, బ్రహ్మ జ్ఞానముగా చెప్పబడుచున్నది. అన్ని మతముల వారు ఈ స్థాయి వరకు మాత్రమే చేరగలిగారు. ఈ జ్ఞానము నంతనూ క్రోడీక రిస్తూ చరమ లక్ష్యమైన మోక్షమునకు, పరిపూర్ణ భావమును ఒక మార్గముగా జగద్గురువగు శ్రీకృష్ణ భగవానుడు తన శిష్యుడగు

అర్జునునకు సమస్త వేదాంత సారమగు భగవద్గీత ద్వారా లక్ష్య లక్ష్యార్థములుగా ఉత్తమాధి కారుల కొరకై మాత్రమే చెప్పబడుచున్నట్లుగా పేర్కొని యున్నారు. అందు "అచలోయం సనాతన: రహస్యం హేత దుత్తమం " అను సాంకేతిక శబ్దములచే చెప్పబడినట్లుగా తెలియు చున్నది. కావున భగవద్గీత యందు ఉపదేశ పద్ధతిగా చెప్పబడుచున్న ఇట్టి అంశ ములను ఈ శీర్షిక ద్వారా మనకు ఈ గ్రంథకర్త గారు వివరించుచున్నారు.

**కం॥ ఎరుగుట జ్ఞానము దానను। జరిగేపని కర్మమనుచు। జనులెన్నిరి యూ। యెరుకయు కర్మము లేనిదె। పరిపూర్ణము వీటి నీవు। బట్టకు మెపుడున్॥ 123**

## ప్రతిపదార్థము

ఎరుగుట జ్ఞానము = జ్ఞానేంద్రియముల ద్వారా, పంచతన్మాత్రలను గుర్తించుదానిని అంతరేంద్రియములలో వున్న జ్ఞానముగా చెప్పబడును. గుర్తెరుగుట దీని ఆది భౌతిక వ్యవహారము

దానను జరిగేపని = అనగా కర్మేంద్రియములచే చేయు పనులు

కర్మమనుచు జనులెన్నిరి = జరుగుచున్న క్రమము లేక క్రియ అని జనులు నిర్ణయించినారు

ఈ ఎరుకయూ, కర్మమూ లేనిదె పరిపూర్ణము = ఈగుర్తించుట, పనిజరుపుట అను రెంటితో సంబంధ పడకయున్నది అచల పరిపూర్ణము

వీటిని = పైన పేర్కొన్న రెండు పద్ధతులు(జ్ఞానము, కర్మము)

పట్టకు మెపుడున్ = వాటితో సంబంధ పడకుము లేక విడచి పెట్టుము

## తాత్పర్యము

ఆకాశభూత సంబంధమైన అంతరేంద్రియములలో జ్ఞానము సమిష్టి యింద్రియముగా చెప్పుదురు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను గుర్తెరుగుట దీని పని. జ్ఞాన మార్గముగా చెప్పబడుచున్నది. పృద్వీభూత సంబంధమైన కర్మేంద్రియములైన వాక్కు, పాణి, పాదము, గుహ్యాము,

గుదములచే క్రియలు జరుప బడును. దీనిని కర్మ మార్గముగా చెప్పబడును. ఈ రెండు విధానములు గుర్తెరిగే ఎరుక యొక్క పరిణామమందలి దశలు. ఈ రెంటితో సంబంధపడక స్వత:సిద్ధమై వున్నది అచల పరిపూర్ణమని గురుముఖత: దృఢపరచుకొని పై రెండు మార్గములకు విలువను, ప్రాధాన్యతను ఇవ్వక విడిచి యుండుము. వీటిని గూర్చి విపులముగా భగవద్గీత యందు కర్మ యోగము, జ్ఞానయోగము అను పేర నిర్దుష్టముగా శ్రీకృష్ణునిచే అర్జునునకు ఉపదేశింపబడెను.

**కం॥ జ్ఞానంబు సత్వగుణమను। దానికి జన్మించె ననుచు దామోదరుడా। మేనత్త కొడుకు తోననె। జ్ఞానమునకు జన్మ మొకటి। గలిగెగదోయీ॥ 124**

## ప్రతిపదార్థము

జ్ఞానము = గుర్తెరగబడే తెలివి
సత్వగుణము = త్రిగుణాత్మకమైన మాయ యొక్క మొదటి పరిణామము సత్వగుణముగా చెప్పబడును
అను దానికి = సత్వగుణము అను వస్తువుచే
జన్మించెననుచు = ఏర్పడి నట్లుగా, ఉత్పత్తి అయినట్లుగా
దామోదరుడు = శ్రీకృష్ణ భగవానుడు
మేనత్త కొడుకుతో = కుంతీ దేవి కుమారుడైన అర్జునునితో
అనెను = వుపదేశించెను
జ్ఞానము నకు జన్మ మొకటి కలిగిన దోయి = ఈ విధముగా జ్ఞానమను వస్తువునకు కూడా పుట్టుక కలదని తెలియుము, దృఢపరచుకొనుము

## తాత్పర్యము

భగవద్గీత యందు గుణత్రయ విభాగ యోగము నందు, జ్ఞానమును గూర్చి వుపదేశిస్తూ, "సత్వా సంజ్ఞాయతే జ్ఞానమ్" అనగా సత్వగుణముచే జ్ఞానము కలుగు చున్నదని, అట్లనే రజోగుణముచే ప్రాణము, తమోగుణముచే వాక్కు ఏర్పడుచున్నవని చెప్పబడి యున్నది.

ఆ విధముగా జ్ఞానముపుట్టుటకు సత్వ గుణం ఆధారముగా వున్నదని శ్రీకృష్ణభగవానుడు, అర్జును కుఉపదేశించినట్లుగా చెప్పబడుచున్నది. శాస్త్రమునందు అధిష్టాన రూపమైన జ్ఞానము ముక్త దశగా చెప్పబడుచున్నది.పరమాత్మ యొక్క స్వరూపము జ్ఞానముగా చెప్పబడుచున్నది."జ్ఞానా దైవతు కైవల్యం" ఇట్టి స్థితిని పొందుటయే కైవల్యమని చెప్పబడుచున్నది. ఇట్టి భావమును పూర్వ పక్షం చేస్తూ జ్ఞానం యొక్క పరిణామ దశలు వివరిస్తూ ఈపద్యము ద్వారా మోక్ష శబ్దమునకు "నసపునరావర్తతే" అను శబ్ధముచే లక్ష్య లక్ష్యార్ధములచే జ్ఞానమునకు కూడా పుట్టుక వున్నట్లుగా దాని రహిత విధానముచే గాని జన్మరహితము కాదని, అందుకు మార్గముగా పరిపూర్ణభావమును ప్రతిపాదిస్తున్నట్లుగా గీతయందు చెప్పబడుచున్నది.

**కం॥ పుట్టింది గిట్టు జ్ఞానము। పుట్టెననుచు కృష్ణమూర్తి పురుహూ**
**తజుడౌ। నట్టి తన ముద్దుమరిదికి। గట్టిగ వినజెప్పె నిందు।**
**కలతేమోయీ॥ 125**

## ప్రతిపదార్ధము

పుట్టింది గిట్టు = సృష్టి నియమాను సారంగా పరిణామ క్రమమునకు లోనై వున్న వస్తువు నశించు స్వభావము కూడా కలిగి ఉన్నది.
జ్ఞానము పుట్టెననుచు = గుర్తెరగబడే జ్ఞానము మన:ప్రాణముల సంయోగముతో వుత్పత్తి చెందుచున్నది
కృష్ణమూర్తి = శ్రీకృష్ణుడు
పురుహూతజూడైనట్టి = శ్రేష్టుడైనట్టి అర్జునునకు
తనముద్దుమరదికి = తనబావ మరిదికి
గట్టిగా విన జెప్పె = చాలా స్పష్టముగా దృఢముగా వివరించెను
నిందు కలతే మోయీ=యిట్టి ఆరూఢత యందు ఎట్టి సందేహము పడవలదు

## తాత్పర్యము

సృష్టి పరిణామ క్రమమునకులోనై వున్న ప్రతీ వస్తువు, వుత్పత్తి,

స్థితి, నాశనములు కలిగి వుండును. ఇది సృష్టి నియమము. ఈ న్యాయమునకు సమస్త వుపాధులు, వస్తువులు లోనైవుండును. "జాతస్య ధృవో మృత్యు: ధృవం జన్మ మృతస్యచ" అని సూత్రీకరించబడినది. ఈ విధముగా కైవల్య పదమైన జ్ఞానము కూడా ఈ పరిణామక్రమమునకు లోనయ్యేవున్నది, అను ఈ విధానమంతయు, శ్రీకృష్ణ భగవానుడు తన బావమరిది, శిష్యుడు అయిన అర్జునునకు స్పష్టముగా దృఢపరచి యుండెను. ఈ విషయమందు నీవు ఎట్టి సందేహమునకు లోను కావలదు.

**కం॥ జ్ఞానమగు నీవు జ్ఞేయంబైన బయలుంగాంచి। జ్ఞానమగు నిను నీవే। లేనంచు తెలియుమని తానానరునకు వాసుదేవు డానతి యిచ్చెన్॥ 126**

## ప్రతిపదార్ధము

జ్ఞానమగు నీవు = గుర్తెరగబడే ఎరుకస్వరూపుడవైన నీవు
జ్ఞేయంబైన బయలు గాంచి = గురువాక్యముచే పరిపూర్ణము స్వత:సిద్ధమైవున్నదని దృఢపరచుకొని
జ్ఞానమగునిను = గుర్తెరగబడే నీ స్వరూపమును
నీవేలేనంచు = మూలముగాని స్థానముగాని లేనిదని
తెలియుమని = దృఢపరచుకోమని
తాను = జగద్గురువైన తాను
నరునకు = అర్జునునకు
వాసుదేవుడు = శ్రీకృష్ణ భగవానుడు
ఆనతిచ్చెను = ఆజ్ఞాపించెను

## తాత్పర్యము

ఉత్తరగీతయందు "ఉల్కహస్తో" అనుశ్లోకమునకు ఈ కందపద్యము యధాతధముగా చెప్పవచ్చును. గుర్తెరగబడే ఎరుక స్వరూపుడవైన నీవు, నీకన్యమై కేవలత్వము కలిగిన అచల పరిపూర్ణమును గురుసూచన ద్వారా దృఢపరచుకొని స్వత:సిద్ధమైవున్న అట్టి దానియందు

గుర్తెరగబడే ఎరుకకు మూలము గాని, స్థానముగాని లేదని గురువాక్యముచే (షోడశి) విడచి యుండుము. జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ఇదియే సరియైన విధానమని గురువగు శ్రీకృష్ణుడు అర్జునునకు ఆదేశించెను.

**కం॥ మనమచలమనదగదు తగదనుటయు మనమచలమునకు।**
**తగవేరని రెండని। లేవు మనమచలమనివిను మనముళ్ళుక్కి**
**తెలియ విడు మనము మనన్॥ 127**

## ప్రతిపదార్థము

మనమచలమనదగదు = గుర్తెరగబడే జ్ఞానా జ్ఞేయములుగా గుర్తెరగ బడే మనము అచల పరిపూర్ణము కాజాలము
తగదనుటయు = అనుటకు వీలు లేనిది
మనమచలమునకు తగవేరని=అచలమునకు వేరై వున్నామనుటయు సరిపోదు
రెండని లేవు = పరిపూర్ణము ఎరుక అను రెండు వస్తువులకు వునికి లేదు
మనమచలమని = ఎవరూ అచల పరిపూర్ణులుకారు
వినుము = గట్టిగా ధృఢ పరచుకొనుము
వుళ్ళుక్కి = ఎరుక లేనిదగుచున్నది
తెలియ = గట్టిగా దృఢపరచుకున్న మీదట
విడువు మనము మనన్ = నీవు నేనుగా గుర్తెరగబడుచున్న గుర్తును విడిచి యుండుము

## తాత్పర్యము

జ్ఞానము మనమనియు దానికి వేరై తెలియబడు, జ్ఞేయము పరిపూర్ణము అని అనుకో వడము తగదు. ఏలననగా, పరిపూర్ణము అను శబ్దము నందు యితరముండుటకు వీలు లేదు. ఒకే కాలములో, పరిపూర్ణము ఎరుకకు వునికి వుండదు, కేవలత్వము కలిగిన పరిపూర్ణము తప్ప ఇతరమైనదేమి లేనిదని స్పష్టముగా దృఢపరచుకుని, అట్లు దృఢపరచుకున్న నీవు, నేనుగా తోచబడుతున్న గుర్తును కూడా విడచి యుండుము.

**కం॥ జ్ఞానము నేననవొక్కటె జ్ఞానము నేవేరంటంచు। గనబోకు సుమీ।
జ్ఞానము వచ్చును బోవును। జ్ఞానాతీతమును తాను। గాంచిన
దాకన్॥ 128**

## ప్రతిపదార్థము

జ్ఞానము నేనన నొకటే=తెలుసుకొనే తెలివి నేననే అహంకారము ఒకటేనని గుర్తించుము
జ్ఞానము, నేవేరటంచు కనబోకు సుమీ = జ్ఞానము, నేననుగుర్తు వేరుగా వున్నవి అను మాట పనికిరాదు
జ్ఞానము వచ్చును పోవును = నేనను గుర్తు రాక పోకలు కలిగి వుండును
జ్ఞానాతీతమును తానుగాంచిన దాకను = జ్ఞానాతీతమైన పరిపూర్ణము వున్నదని గురుముఖత: స్పష్టముగా దృఢపరచుకొనేవరకు

## తాత్పర్యము

గుర్తెరగ బడే జ్ఞానము, నేనుగా వ్యవహరించు వస్తువు ఈ రెండూ ఒకటే వేరుగా భావించవలదు. గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా స్వత:సిద్ధమైన పరిపూర్ణము వున్నదని దృఢపరచుకొని నీపర్యంతం గుర్తెరగబడే జ్ఞానం పుట్టుట, నశించుట అను క్రమమునకు లోనై వుండును.

**కం॥ నీకలను వచ్చిపోయిన। లోకుల లోకములవలెనె లోనిను
గనుమీ। నీకలను నీవు మేల్కని। యాకల నటువలెనె చూస్తె।
యెటునిల్వవురా॥ 129**

నీకలను వచ్చిపోయిన లోకులు, లోకములవలె = గుర్తెరగబడే నీకలయందు తోచబడే నీవు, లోకులు, లోకంబులు వలె వచ్చి పోవుచున్నట్లుగా
లో నిను గనుమీ = నీలోపట, నీగుర్తుచే నిన్ను ఆలోచించు కొనుము
నీ కలను నీవు మేల్కొని = గుర్తెరగబడే నీకలనుండి నీకు నీవుగా గురుప్రబోధచే మేలుకొని
ఆకల నటువలెనె చూస్తే=పొందిన మెళుకువ స్థితిని కూడా కల వలె భావిస్తే
ఎటు నిల్వవురా = మూలము గాని స్థానముగాని లేకుండును

## తాత్పర్యము

గుర్తెరగబడే నీకలయందు వస్తువులు, వ్యక్తులు ఏవిధముగా వచ్చి పోవుచున్నట్లు తెలుసుకొను చున్నావో ఆవిధముగానే గురు సూచనద్వారా అచల పరిపూర్ణము స్వత:సిద్ధమై యున్నదని, దానియందు గుర్తెరగబడే ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదని, బోధచే మెళకువ పొందిన పిదప కలయందు గల నీ స్థితి వలె మెళకువయందున్న స్థితి కూడా లేనిదని దృఢ పరచుకున్న మీదట నీవు లేక పోవుచున్నావు.

**కం॥ అందరికల నీకలెకద। అందరు నీకలను వచ్చి। యగుపడి పోవన్।**
**కందువుగద నిన్నట్లనె। మందమతీ కనగదోయి। మరిలేనను చున్॥130**

## ప్రతిపదార్థము

మందమతీ = ఓ మందబుద్ధి కలవాడా
అందరి కలా నీకలేకదా = ప్రకృతి సిద్ధముగా మనసున్న ప్రతివారికి క్రమము లోవచ్చు కల ఎట్టిదో, నీకు కలుగు కల కూడా అట్టిదే కదా
అందరూ = పైన పేర్కొన్న అందరూ
నీకలను వచ్చి అగుపడ పోవన = గుర్తెరగ బడే నీకలయందు వచ్చి పోవుచున్నట్లుగా
కందువు కదా = గమనిస్తున్నావుకదా
నిన్నట్లనే కనగదోయి = నిన్ను గూర్చి కూడా నీవు అట్లనే ఆలోచించుము
మరి లేననుచున్ = నిజము కాదని, మూలము లేనిదని

## తాత్పర్యము

స్వప్నావస్థనునది ప్రకృతి నియమానుసారంగా మనసున్న ప్రతివారికి కలుగు ఒక భావనా రూపమగు అవస్థ. అందు వస్తువులు వ్యక్తులు నీతో సహా వచ్చిపోవుచుండుట నీవు గమనిస్తున్నావు కదా, ఆ విధముగానే పరిపూర్ణము స్వత:సిద్ధమై వున్నదని, దానియందు గుర్తెరిగే ఎరుక కలవలె నిజము కానిదని గురుముఖత: దృఢపరచుకొని అట్టి

గుర్తించిన గుర్తును, భావనను, నీతోసహా లేనివని నిజము కానివని విడచి వుండుము.

## ఆకాశ లక్షణము

**కం॥ చలియించనిదాకాశము। చలనంబే వాయువనుచు। సాటింప దగున్ చలనమె విశ్వము నేనన। చలనమె తనువెరుకలనిన జగమనినసుతా॥ 131**

## ప్రతిపదార్థము

సుతా! = నాయనా
చలియించనిదాకాశము = కదలిక లేక ఉనికి కలిగినది, పంచ భూతములందలి మొదటిదైన ఆకాశము
చలనంబే వాయువనుచు= కదిలే లక్షణం ద్వారా రెండవదైన వాయువును
పాటింపదగున్ = వస్తునిశ్చయ పూర్వకంగా గుర్తించదగును
చలనమే విశ్వము = ఈ ప్రపంచ మంతయు కదలికతో కూడుకున్నదే
నేనని చలనమే = నేనని అహంకారము కూడా కదలికతో కూడుకున్నదే
తనువెరుకలనినీ=ఈశ్వర తనువు, జీవతనువు, జీవేశ్వరులు కూడా కదలికయే
జగమనిన = పంచభూతాత్మకమైన ఈ సమస్తము కూడా

## తాత్పర్యము

సృష్టి పరిణామమునందు అధిష్టాన రూపమైన బ్రహ్మము తనయందలి సంకల్పముచే "నేననేక మగుదును గాక" పరిణామ క్రమమునకు లోనై పంచభూతములుగా మార్పుచెందినది. అందు మొదటిదైన ఆకాశము కదలనిదై ఉన్నది. రెండవదైన వాయువు కదలికతో కూడి ఉన్నది. కావున తదనంతరపు పరిణామ క్రమములో ఏర్పడిన బ్రహ్మాండము అందలి వస్తుసముదాయము, పిండాండము అందలి వస్తు సముదాయము మొత్తము, ఈ సృష్టి అంతయూ చలనాత్మకమై ఉన్నదని తెలియుము.

**కం॥ ఆకాశ మనిన శూన్యం। బాకశంబనిన సగుణమా కాశమనన్।**
**కాకివలె నల్లరూపుది। యాకాశము మితములోన నణగుండు**
**సుమీ ॥ 132**

## ప్రతిపదార్థము

ఆకాశమనిన శూన్యము = ఆకాశమనగా ఏమీలేనిది, ఖాళీప్రదేశము, చక్షురేంద్రియగోచరములేనిది
ఆకాశమనిన సగుణము = ఆకాశమనగా గుణములతో కూడివున్నది
ఆకాశమనిన కాకివలె నల్ల రూపుది = అజ్ఞానరూపము, తమస్సుతో కూడినది గనుక నలుపు రంగుతో పోల్చబడుచున్నది
మితములోననణగివుండు = పరిమితమై, వస్తువులయందు వ్యాపించి యుండును (ఘటాకాశము, మటాకాశము)

## తాత్పర్యము

ఆకాశమనగా అవకాశము, శూన్యప్రదేశము, గుణములతో కూడియున్నది. అజ్ఞానరూపమై తమస్సుతోకూడి, భూతాకాశముగా పిలవబడుచూ సృష్టిలోని వస్తుజాలమందు వ్యాపించి, అందు ఇమిడిపోయి తన ఉనికి ఏమాత్రము గుర్తించుటకు వీలు లేక ఉండును.

**కం॥ ఆకాశ మనినకాలం। బాకాశంబనవిలంబ మాకాశ మనన్।**
**లోకమున చంచలంబగు। నాకాశము శబ్దరూపమగు విన**
**వోయీ॥ 133**

## ప్రతిపదార్థము

ఆకాశమనిన కాలము = ఆకాశమనగా, భూత, భవిష్యత్, వర్తమాన కాలములు తెలియుటకు కేంద్రమై ఉన్నది
ఆకాశ మన విలంబము=ఆకాశం అనగా శూన్య పద్ధతిగా గుర్తింపబడుచున్నది
ఆకాశమన లోకమున చంచలమగున్ = పరిణామక్రమంలో స్థూల భాగము, కామక్రోదాధికములు గాను, సూక్ష్మభాగము జ్ఞానమనోబుద్ధి చిత్త

అహంకారములుగాను తెలియుచున్నది
ఆకాశము శబ్దరూపమగు = ఆకాశమను పదార్ధము శబ్దము అనుగుణముచేత మాత్రమే తెలియబడుటకు వీలైవున్నది
వినవోయి = ఈ విధముగా వివరమును స్పష్టముగా గ్రహించుము

## తాత్పర్యము

ఆకాశమను వస్తువు భూత, భవిష్యత్, వర్తమాన కాలములు తెలియజేయుటకు కేంద్రమై ఉన్నది. శూన్యమనే పదార్ధ లక్షణముగా కలిగి ఉన్నది. పరిణామ క్రమమునందు స్థూలభాగము, కామ క్రోధ మోహ భయములను గుణములుగాను, సూక్ష్మభాగము జ్ఞాన మన, బుద్ధి అహంకారముగాను తెలియబడుచున్నది. వస్తువుగా గుర్తింపబడుటలో ఒక్క శబ్దగుణము చేత మాత్రమే తెలియబడుచున్నది. ఈ విధముగా ఆకాశము యొక్క వస్తు నిశ్చయ జ్ఞానము స్పష్టముగా గుర్తించుము.

## అహము యొక్క నిర్ణయము

**కంII అహమేతనువీ విశ్వం। బహమే జీవేశ్వరులన। నహమేతదైక్యం।**
**బహమే యహమునకు మూలం। బహమణిగిన నణగునన్ని**
**యనఘచరిత్రా॥ 134**

## ప్రతిపదార్థము

అనఘచరిత్రా = గొప్పదైన చరిత్ర లేక సంస్కారము కలవాడు
అహమే తనువు = ఈ శరీరమంతయు (బ్రహ్మాండము) నేనుచే వ్యాపించ బడియున్నది
విశ్వంబహమే = తెలివిచే ప్రకాశించునదంతయు నేనే
జీవేశ్వరులన అహమే = పిండాండమందు జీవుడుగాను, బ్రహ్మాండమందు ఈశ్వరుని గాను నేననే తెలివి వ్యాపించి యున్నది
తదైక్యాంబహమే = మహావాక్య విచారణ ద్వారా వీటి ఏకత్వము నందు తెలియబడుచున్న బ్రహ్మముకూడా నేనే
అహమేఅహమునకు మూలము = ఈ అహమునకు అహంకారమే

మూలముగాను, స్థానముగాను చెప్పబడుచున్నది
అహమణిగిన అణుగునన్నీ = నేననే గుర్తు రద్దుఅయిన పిమ్మట దాని పరిణామక్రమమునకు వీలైయున్న సమస్తము, తనతో పాటే రద్దగుచున్నది.

## తాత్పర్యము

గొప్పదైన సంస్కారము గలవాడా, నేనని అహంకారము నుండియే ఈ సమస్త సృష్టియు ఏర్పడు చున్నది. విశ్వము, జీవేశ్వరులు, వీటి ఏకత్వమందు తెలియబడు బ్రహ్మ పదార్థము లన్నియు కూడా అహంకార పరిణామములే. ఈ అహమునకు అహమే మూలము, ఆధారముగా నున్నది. ఈ గుర్తు పోయిన ఎడల సమస్తము దీనితో పాటే లేకుండా పోవు చున్నది.

## భ్రమ నిర్ణయము

భ్రమ = అనగా మిథ్యాజ్ఞానము. దీని పర్యాయ పదములుప్రమ, అనగా యదార్థ జ్ఞానము. భ్రమణము = అనగా తిరుగుట తన చుట్టూ తాను తిరుగు చుండుటలో తన పరిసర ప్రాంతము లందలి ఇతర వస్తు జాలమంతయు అట్టి కదలికకు లోనై ఉన్నదని పొర బడుటకు వీలున్నది. ప్రమ యందు స్థిరమైన, దృఢమైన, వాస్తవమైన వస్తు జ్ఞానము కలుగు చున్నది. వేదాంత శాస్త్రమునందు సృష్టి యందలి కదలికలకు మూల ప్రకృతియే (అవ్యక్తమై) పరమ కారణముగా చెప్పబడుచున్నది. "తేన వినా తృణా గ్రమపి నచలతి" అను సూత్రము కూడా దీనిని ధృఢ పరచు చున్నది. దీనిని మాయా శబ్ధముచే సూత్రీకరించినారు. కదలిక రెండు విధములు 1. స్థూలము 2 సూక్ష్మము. స్థూలము ఇంద్రియ గోచరమగుచున్నది. సూక్ష్మము అత్యంత గోప్యమై కానరాక వ్యవహరించు చున్నది. ఆగమ ప్రమాణము ననుసరించి సమస్త చలనములకు అధిష్ఠానమే అత్యంత మూలకారణముగా చెప్పబడుచున్నది. కావున భ్రమ జ్ఞానమునకు కదలిక కారణముగా నున్నది. ఇట్టి కదలికలకు అధిష్టానము పరంపరా కారణములుగా తెలియ బడు చున్నది. ఇట్టి భ్రమ అందలి తరగతులు ఈ శీర్షిక ద్వారా చెప్పబడు చున్నవి.

కం॥ భ్రమ యనిన పుట్టుకనినను। భ్రమ కేనామంబు లిట్టి। భ్రమనే
నీవుం। భ్రమయీ మేను జగత్తులు। భ్రమ యెరుకయు మరుపు
రెండు భ్రమె భ్రమ వినరా॥ **135**

## ప్రతిపదార్థము

భ్రమయనిన = మిధ్యాజ్ఞానమనిన
పుట్టుకనిన = పరిణామము అనినను
భ్రమకేనామంబు = భ్రమరూపమైన ఎరుకే పర్యాయ పదములు
ఇట్టి భ్రమనే నీవున్ = ఇట్టి భ్రమ చేతనే నీవును నేనును తోచబడుచున్నాము
భ్రమయే మేను జగత్తులు = మేనుగాను, నేనుగాను, జగత్తుగాను తోచబడుచున్నది కూడా భ్రామయే
భ్రమ ఎరుకయు, మరుపు = సృష్టికి పూర్వం తాను తానున్న అఖండ జ్ఞాన స్వరూపముగాను, పరిణామ క్రమంలో ప్రపంచరూపం వహించి, మరుపు రూపంగాను, ఈ భ్రమగానే వ్యవహరింప బడుచున్నది
రెండూ భ్రమే = ఒకటే రెండుగా తోచబడుటయు గూడా భ్రాంతియే
భ్రమ వినరా = స్వత: సిద్ధమైన దానియందు, మూలముగాని స్థానము గాని లేక తోచుచూ, భ్రాంతికిలోనై వున్న నీవు కూడా భ్రమ స్వరూపుడవే

## తాత్పర్యము

ఈపద్యము వశిష్ఠ గీతయందు వశిష్టుడు శ్రీరామచంద్రునికి ఉపదేశించినట్లుగా చెప్పబడుచున్న "భ్రమేణాహం భ్రమేణత్వం" అను××× శ్లోకముతో పోల్చి విచారించ వచ్చును. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా ఉన్న పరిపూర్ణమునందు లేక 'తోచబడుచున్న ఎరుక సర్వ భ్రమలకు మూలముగాను ఆధారముగాను చెప్పబడుచున్నది. సర్వభ్రాంతులకు మూలం, మూలములేని గుర్తెరిగే శరీరమే అని దీక్షితులవారు సిద్ధాంత పరచి ఉన్నారు. ఉన్నది లేనట్లుగాను, లేనిది ఉన్నట్లుగాను, తనకు తానుగాను తోచబడుటయే భ్రమ లక్షణము. కావున ఈ పద్యము నందు, ఎరుక పరిణామము నందు"నేననేకమౌదును గాక" అను సంకల్పము,

దాని పరిణామములగు జీవేశ్వర జగత్తులు, నేను, మేనులు, పిండ, బ్రహ్మాండాకారములు, ఎరుక మరుపులు మొదలగు సర్వ ద్వంద్వములు కల్పింపబడినవి. అన్ని నిర్ణయములు చేయుగలుగు గుర్తు కూడా ఈభ్రాంతిలోనికే చేర్చబడి "భ్రాంతి రహిత మిదం మోక్షం" గా సిద్ధాంతీకరింపబడుచున్నది.

## ఎరుక నిర్ణయము

ఎరుక అనగా గుర్తెరుగుట. ఇది జ్ఞాన లక్షణము. ఇది త్రిపుటే రూపము(జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాత) గా వ్యవహరించును. మలినపు టెరుక, మిశ్రపుటెరుక, శుద్ధ ఎరుక, కేవలపు టెరుక, అఖండ ఎరుక అను ఎరుక యందు గల తరగతులను శ్రీ రాజయోగీంద్రులవారు తమ నిజ ప్రభోధ విధానమను గ్రంథమందు చాలా స్పష్టముగా వివరించి యున్నారు. ఇదే రీతిలో జ్ఞానము, మలిన జ్ఞానము, మిశ్రమ జ్ఞానము, ఇంద్రియ జన్య జ్ఞానము, సమిష్టి జ్ఞానము, ప్రజ్ఞానము, శుద్ధ జ్ఞానము, సుజ్ఞానము, విజ్ఞానము, అఖండ జ్ఞానము అను తరగతులుగా చెప్పబడుచున్నవి. పరిపూర్ణ సిద్ధాంతమునందు, పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమములో ఎరుక నిర్ణయము చాలా ప్రముఖమైనదిగా చెప్పబడుచున్నది. ఎరుక అనగా సమస్త సృష్టికి అత్యంత మూలకారణమై ఉన్నది. అధిష్ఠానమునే అర్థముగా తీసుకొన వలెను. ఇది అఖండ ఎరుకగా చెప్పబడుచున్నది. తెలివికి తెలియబడు గమ్యము కూడా ఇదియే. "ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి" అనగా ఏది తెలిసిన మీదట సమస్తము తెలిసినట్లవునో, ఇక తెలియ వలసిన దేమీ మిగలదో, ఇట్టి జ్ఞానమునే అఖండ జ్ఞానముగా చెప్పవచ్చును. పరిపూర్ణ బోధయందు ఈ నిర్ణయ విధానము చాలా అవసరమై ఉన్నది. బోధనా పద్ధతిచేత, పాఠక్రమాల ద్వారా బుద్ధినిశ్చయమును గురు అనుగ్రహముచే వస్తు నిశ్చయ జ్ఞానము ద్వారా(స్థానము, స్వరూపము,స్వభావము) ఉపదేశ పద్ధతిగా, ఆత్మ నిశ్చయ జ్ఞానమును(స్వస్వరూప జ్ఞానము) కలిగించు విధానము కలదు. పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మానుటకు ఇట్టి నిశ్చయ విధానము

చాలా అవసరమై ఉన్నది. ఎరుక నిరూపణ, ఎరుక నిరసన చాలా అవసరము. కందార్థములందు "విధితముగా లేని ఎరుక వివరింతు" అను హామీతో ఎరుక నిర్ణయము కావింప బడి ఉన్నది. ఈ పద్ధతిగా ఈ కంద పద్యమును వివరించుట జరుగు చున్నది.

**కం॥ ఎరుకసుమీ బ్రహ్మానినను యెరుకసుమీ మాయ యనిన**
**యెరుకే జీవుండెరుకసుమీ యీశ్వరుడన। యెరుక సుమీ నేను**
**విశ్వ। మది సత్యమురా ॥ 136**

## ప్రతిపదార్థము

ఎరుక సుమీ బ్రహ్మానినను = జగదధిష్టానమైన బ్రహ్మము గుర్తెరిగే జ్ఞానమే
ఎరుక సుమీ మాయనినను = పరబ్రహ్మము యొక్క శక్తిగా లేనిదిగా చెప్పబడుచున్నది. మాయ కూడా ఎరుకయే
ఎరుకే జీవుండు = 25 గురు అధిష్టాన దేవతల చైతన్యాంశ స్వరూపమైపిండాండ గతమైన జీవుడుఎరుక స్వరూపమే
ఎరుకసుమీ ఈశ్వరుడు = బ్రహ్మాండ గతమై విశ్వచైతన్యముగా చెప్పబడుచున్న ఈశ్వరుడు ఎరుక స్వరూపమే
ఎరుక సుమీ నేను విశ్వము = గుర్తెరగబడే నేను, పంచభూతాత్మకమైన ఈప్రపంచము కూడా ఎరుకే
అది సత్యమురా = పైన పేర్కొన్న వన్నియు వాస్తవమని, సత్యమైనవని గ్రహించుము

## తాత్పర్యము

జగదధిష్టానమైన, అధిష్టాన బ్రహ్మము, బ్రహ్మము యొక్క శక్తిగా చెప్పబడుచు జగనిర్మాణమునకు కారణమై యున్న మాయ, విశ్వచైతన్యముగా బ్రహ్మాండ అధిష్టాన దేవతగా చెప్పబడు ఈశ్వరుడు,జీవచైతన్యముగా పిండాండగతము చెందిన జీవుడు, పంచ భూతాత్మకమైన ప్రపంచము, వ్యష్టి సమిష్టి రూపముగా నున్న అహంకారము మున్నగునవన్నియు ఒక ఎరుకగా గుర్తెరుగుము. ఇది అంతయు వాస్తవ

రూపమై ప్రమాణబద్ధమై ఉన్నదని తెలియుము.

## మాట నిర్ణయము

మాట అనునది వాక్కుగా చెప్పబడును. ఇది శబ్ధ స్వరూపము. పర, పశ్యంతి, మధ్యమా, వైఖరీ అను నాలుగు విధములుగా ఉన్నది. దీనికి మూలము శబ్ధము. ఇది పరబ్రహ్మ వాచకము. అకార, ఉకార, మకార అర్థమాత్ర స్వరూపమైన ప్రణవముగా చెప్పబడుచున్నది. "ఓం మిత్యాకాక్షరం బ్రహ్మ" అను శ్రుతి ఉద్ఘాటించు చున్నది. శబ్ధబ్రహ్మము అని వాగ్మయము నందు దీనికి ఉనికి కలదు. త్రిహూత్కరణి విధానముచే ఉపాదులందు అగ్ని సత్తా కలిగిన వాక్కుగా చెప్పబడుచున్నది. ఇది ధ్వన్యాత్మకము, వర్ణాత్మకముగా తెలియ వలెను. ఇదంతయు గుర్తెరగబడే తెలివికి లోబడియే ఉన్నది. ఇట్టి గుర్తు తో సంబంధ పడక కేవలత్వము కలిగి ఉన్నది అచల పరిపూర్ణము.

**కం॥ మాటసుమీ నేననినను। మాట సుమీ మాయయనిన మరిజీవ**
**శివుల్ మాటసుమీ బ్రహ్మనినను మాటసుమీ మేను జగము**
**మాటేసుమ్మీ॥** **137**

## ప్రతిపదార్థము

మాట సుమీ నేననినను = పిండాండము నందు మన:ప్రాణముల చేరికలో వాక్కు వుత్పత్తి అగుచున్నది
మాటసుమీ మాయనినను = జగన్నిర్మాణమునకు కారణమైన మూలప్రకృతి కూడా మాట శబ్ధమునకు లోబడియే ఉన్నది
మరజీవ శివుల్=జీవేశ్వరులిరువురు కూడా శబ్ధమునకు లోబడియే ఉన్నారు
మాట సుమీ బ్రహ్మనినను = సృష్టి కారణమైన బ్రహ్మము కూడా మాటకు లోబడియే వున్నది
మాటసుమీ మేను, జగము=మేను జగములుగా తోచబడునదంతయు మాటయే

## తాత్పర్యము

జ్ఞాన పరిణామము శబ్దము, శబ్ద బ్రహ్మముగా కీర్తించబడుచున్నది. ఇది ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము అను రెండు రీతులుగా ఉన్నది. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ రూపముగా వ్యవహరించుచున్నది. వస్తుజాలమంతయు దీనికి లోబడియే పని చేయును. నేను, నీవను గుర్తు జగద్రచనకు కావలసిన మూల ప్రకృతి, జీవేశ్వరులు, అధిష్టాన బ్రహ్మము, నేను, మేను, జగత్తు మొదలైన వన్నియు ఈశబ్ధావరణములోనికి చేరి ఉన్నవి. ఇట్టి మాట కందక కేవలత్వము కలిగి ఉన్నది అచల పరిపూర్ణమని తెలియ వలెను.

## ప్రతిబింబ నిర్ణయము

కం॥ ప్రకటమగు బింబమందున। ముకురము ముకురస్త
బింబములు లేవెపుడున్। ముకురంబు వలన బుట్టును।
ముకురస్థము దానివలన ముకురము దోచున్॥ 138

## ప్రతిపదార్థము

ప్రకటమగు బింబము = స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము
అందున = దానిలో
ముకురము = అధిష్టాన రూపమైన ఎరుక
ముకురస్త బింబములు = దాని పరిణామ రూపమగు జీవేశ్వర జగత్తులు
లేవు ఎపుడున్ = మూలముగాని స్థానముగాని లేక తోచుచున్నవి
ముకురంబు వలన = గుర్తెరిగే తెలివి వలన
పుట్టును ముకురస్తము = జగత్తు పరిణమించు చున్నది
దాని వలన = జగత్తు వలన
ముకురము తోచున్ = గుర్తు తోచబడుచున్నది

## తాత్పర్యము

కందార్థములందు మేనెరుకల రెంటిలో దానినిది, దీనినది

తగసృజియించున్ అను దానితో ఈ పద్యమును పోల్చ వచ్చును. స్వత:సిద్ధమైన పరిపూర్ణమందు మూలముగాని స్థానముగానీ లేకనే అధిష్టాన రూపమైన ఎరుక, దాని పరిణామము జగత్తు తోచబడుచున్నవి. ఈ రెంటికి ఒకదాని కొకటి సంబంధములేక ఉన్నవి. వస్తునిశ్చయముగా విచారించిన వారికి, ఎరుకకు జగత్తు, జగత్తుకు ఎరుక అన్యోన్యాశ్రితములై ఒకదాని కొకటి మూలము, ఆధారమై తోచబడుచున్నవి. పరిపూర్ణమునకు వీటికి ఏవిధమైన సంబంధము లేదు.

## కల మేలుకల నిర్ణయము

పరిపూర్ణ సిద్ధాంతమునందు ఈ కల మేల్కాల నిరూపణ చాలా ప్రముఖమై ఉన్నవి. కేవలము"బోధనా" _చేతనే పరిపూర్ణ భావము దృఢ పరచు కొనవలసి యున్నది. ఇందుకు దృష్ట, ద్రాష్టాంతములు ప్రమాణముగా తీసుకొని స్వత:సిద్ధమై కేవలత్వము కలిగి యున్నపరిపూర్ణమందు మూలముగాని స్థానముగాని లేకనే తోచబడుచున్న గుర్తెరిగే ఎరుకను కల దృష్టాంతముతో పోల్చి చెప్పబడుచు పరిపూర్ణము ఉన్నది ఎరుక లేనిది అను అంశములు ధృఢపరచు కొనుటకు బోధించు బోధనా పద్ధతిని మెళకువగాను చెప్పబడుచున్నది. పరిపూర్ణమునందు లేక తోచిన ఎరుకే కల అని శివరామ దీక్షితులవారును గురుబోధను మేల్కఅని కృష్ణదేశికేంద్రుల వారును పేర్కొన్నారు. ఇట్టి కల మేల్కాల సమగ్ర వివరము ఈ శీర్షిక ద్వారా మనకు వివరింపబడుచున్నది.

**కం॥ లేనినీరాకడే స్వప్నానందము నీకు గురుడు పరిపూర్ణంబున్**
**పూనితెల్పి మేల్కొల్పిన। నేననకను నీవుబోవ నీ మేల్కదిరా॥139**

## ప్రతిపదార్థము

లేని నీరాకడే=వున్నదాని యందు లేక తోచబడుచున్న ఎరుక యొక్క పరిణామమే స్వప్నానందము=కలయందు పొందుచున్న ఆనందము వంటిది (నిజము కానిది) నీకు పరిపూర్ణమును పూని తెల్పి = గురుమూర్తి ద్వారా వస్తునిశ్చయ

పూర్వకయుగా పరిపూర్ణము యొక్క ఉనికిని ధృఢపరచుకొన్న మీదట
మేల్కొల్పిన = గుర్తెరిగే ఎరుక లేనిది అని ఉపదేశించగా
నేననకను = నేననే గుర్తులేకుండా
నీవు పోవ = గుర్తెరిగే శరీరము విడచిన మీదట
నీమేల్కదిరా= నీవు మెళుకువ చెందినట్లు కాగలదు (జనన మరణ బ్రాంతి నుండి బయట పడుట సిద్ధించును)

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేకనే తోచబడు నీఉనికి నరుని స్వప్నానందము వంటిది. వస్తునిశ్చయ పూర్వకంగా పరిపూర్ణము, ఎరుకలను దృఢపరచి ఉన్నది పరిపూర్ణమని లేనిది ఎరుక యని ఆరూఢపరచుకొని, గురుర్వాక్యము ద్వారా దృఢపరచుకొన్నగుర్తును కూడా విడిచి యుండుటయే మెళుకువగా చెప్పుబడుచున్నది.

**కం॥ కలలో వానికి మేలుక। గలదని గుర్తెరుగ వశమె కల మేల్కనినన్
కలవాడు గలడె తెలియను। తలపోయుము నిన్ను నీవు
తగనీరీతిన్॥ 140**

## ప్రతిపదార్థము

కలలో వానికి = ఎరుకనే గుర్తు తో కూడుకున్న వానికి
మేలుక కలదని =స్వత: సిద్ధమైన పరిపూర్ణమువున్నదని
గుర్తెరుగ వశమె = తెలివి చేత గుర్తెరుగుట సాధ్యపడునా(సాధ్యముకాదు)
కలమేల్కనినన్ = కలనుండి మెళకువ స్థితిని పొందిన పిదప
కలవాడు కలడే తెలియును = కల, అందలి గుర్తు, వున్నదానిని గుర్తించుటకు మిగిలి యుండునా
తలపోయుము = ఈ అంశమును స్పష్టముగా విచారించుము
నిన్ను నీవు తగు నీరీతిన్ = నీవు నీగుర్తునీ అనుభవము పై విధముగా సమాధాన పరచుకొని విచారించి యుండుము

## తాత్పర్యము

కలగనువాడు, మెళకువయందు గల అనుభవమును మెళకువ పొందిన పిదప చెప్పగలుగుటకు నిలచి యుండునా. అట్లని స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరము కలవంటిదని బోధచే మెళుకువ స్థితిని చెందిన మీదట కల, కలతోపాటు గుర్తు లేకపోవుచున్నది. ఇట్టి స్థితియందు ఉన్నదానిని గురించి చెప్పుటకు తాను లేకపోవు విధానము గట్టిగా ధృఢపరచుకొని నీఉనికిని ఇట్టి విచారణ తో సమన్వయ పరచుకొని సమాధాన పడి యుండుము.

**కం॥ కలవాడు వాని చడువులు గలవా। తామేలుకనిన। గనుగొను మటులన్। కలనిన్ను నీదు చదువును। ఫలమేమిక చాలు పెక్కు। పలుకుల తండ్రీ॥ 141**

తండ్రీ = నాయనా
కలవాడు = ఎరునే కలయందు తోచువాడు
వాని చదువులు = వానిచే చేయబడిన క్రియలు(పరిణామములు)
కలవా = వాస్తవములా, యదార్ధములా
తామేలు కనిన=గురువాక్యము చేత పరిపూర్ణ బోధను దృఢపరచుకొన్న మీదట
కనుగొను మొదలున్ = వస్తునిశ్చయ పూర్వకంగా నిన్ను నీవునికిని దృఢపరచుకొనుము
కలనిన్ను నీ చదువును=కలలో లేక తోచబడుచున్న నీ వునికిని, పరిణామమును
ఫలమేమి =ప్రయోజనము లేని
ఇకచాలు = ఇక విడచి పెట్టుము
పెక్కు పలుకులు = నిజము కాని (వాస్తవముకాని) మాటలను లేక అనుభవమును

## తాత్పర్యము

ఎరుకనే కలలో లేక తోచబడుచున్న, చదువులు, వ్యవహారములు, మెళకువ స్థితియందు విచారించగా లేక పోవుచున్నవి. ఆవిధంగానే

గురుప్రబోధచే ఎరుకనే కలనుండి మెళుకువ చెందినపిదప ఎరుక పరిణామమగు సమస్తము ఎరుక వలెనే లేకపోవుచున్నవి. ఇట్టి ఆరూఢతయందు మిగిలిన శాస్త్రజ్ఞానమంతయు నిరర్ధకమే అని తెలియ వలెను.

**కం॥ కలరాజు సకల సంపత్కలితుండై తానుమేలు కొన లేడచటన్।**
**కలనిన్ను వాని విధమున। తలుపుము దలచితివెచాలు ధన్య**
**చరిత్రా॥** **142**

## ప్రతిపదార్ధము

ధన్య చరిత్రా = జీవితమును, ధన్యము చేసుకున్నవాడా!
కల రాజు = ఎరుకనే కలలోతోచబడుచున్న అక్షర పురుషుడు
సకల సంపత్కలితుండై=అనేక విధములైన పై భావములతో కూడి యుండి
తాను మేలుకొన = పరిపూర్ణ బోధచే మెళుకువ స్థితిని చెందగా
లేడచటన్ = మూలముగాని స్థానముగాని లేకపోవుచున్నాడు
కల = విచారణద్వారా
నిన్ను = గుర్తెరగబడే నిన్ను
వాని విధమున తలుపుము = పై విధముగా దృఢ పరచు కొనుము
తలచితివె చాలు = గట్టి గా దృఢపరచుకొన్న మీదట భ్రాంతి రహిత విధానము సిద్ధించును

## తాత్పర్యము

కలయందు తోచబడుచున్న రాజు(అక్షర పురుషుడు) సకల సంపదలతో కూడియుండి, మెళుకువ చెందిన మీదట తాను, తనసంపదలు తనతోపాటే ఎట్లు లేకపోవుచున్నవో ఆవిధంగానే ఎరుకనే కలలో తోచబడుచున్న అక్షరపురుషుడు వాని పరిణామము బ్రహ్మాండ, పిండాండ ములు అందలి వ్యవహారములు, గురువాక్యము(షోడశి) చేత మెళకువ చెందిన స్థితియందు లేకపోవుచున్నవి. ఈ విధముగా ధృఢపరచుకొన్న మీదట మానవోపాదికి చెంది వచ్చిన నీ జీవితము ధన్యము కాగలదు.

# అచల పరిపూర్ణ ప్రబోధ

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ బోధ ఒక శ్రేష్ఠమైన మార్గముగా అచల ఋషులచే ప్రతిపాదించబడుచున్నది. తత్వ శాస్త్రమునందు సోపానములుగా చెప్పబడుచున్న షడ్దర్శనములపైన సమగ్రమైన అవగాహనముతోకూడి "ఏకవిజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" "బ్రహ్మైవాహమస్మి" అన్నట్లుగా జన్మ కర్మలకు అత్యంత మూలకారణమైన వస్తువును గూర్చి సమగ్రమైన అవగాహన కలిగించి ఆగమ నిగమ ఉపనిషత్సాగర మధితార్ధము, దాని అవలిదిఅయి, ఏది విడిచిన సమస్తమును విడిచినట్లు కాగలదో(అహంపదార్ధ రహిత:) వస్తునిశ్చయపూర్వకమైన బోధనా విధానముచే పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మానుము అను సిద్ధాంత పద్ధతితో ప్రచారములో నున్నది. ఇది అత్యంత గురుగోప్యమై గురు శిష్యన్యాయముగా మాత్రమే తెలియ వలసిన అంశమై ఉన్నది. భ్రాంతి రహిత విధానమునకు ఇదియే నిర్ధుష్టమైన మార్గముగా విజ్ఞులచే చెప్పబడుచున్నది.

**కం॥ తనకుదా నొరులుచణకిన। ధ్వనిబుట్టని చోటు బ్రహ్మ తనుదా**
**నొరులున్। చనకిన ధ్వని గలచోటది। విను మాయయు**
**లేనిమాయ విడులేనవినన్॥ 143**

## ప్రతిపదార్ధము

తనకుతా = తనంతట తానుగా

బయలు చణికిన = ఇతర వస్తువులతో ఏమాత్రము సంబంధపడక

ధ్వనిపుట్టని చోటు=శబ్దాది పంచతన్మాత్రలు, వాటికి కారణమైన ఆకాశము లేనిప్రదేశము

బ్రహ్మము = అచల పరిపూర్ణ పరబ్రహ్మము

తనకు దానొరులు చనకిన = తనకుతాను తన సంకల్పముతో జీవేశ్వర జగత్తుగా మార్పుచెందినపుడు

ధ్వని గలచోటు = శబ్దాది పంచతన్మాత్రలతో కూడిన బ్రహ్మాండము

అది = గుర్తెరిగే శరీరము
విను = వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించుము
మాయయు = లేనిది, నిజము కానిది
మాయ విడు లేననినన్=నిజము కానిదని షోడశి వాక్యముచే విడిచి వుండుము

## తాత్పర్యము

సృష్ఠి కారణమైన అధిష్టానము సృష్టికిపూర్వము తాను తానైఉన్న అచలస్థితినుండి అనేకమగుదునుగాక అను సంకల్పముచే పంచతన్మాత్రలచే కూడిన బ్రహ్మాండాకారము వహించెను. ఇట్టి వస్తువుతో, పరిణామముతో సంబంధపడక పంచతన్మాత్రలు లేశముకూడా లేని వస్తువును అచల పరిపూర్ణముగాను విడమరచి వస్తునిశ్చయపూర్వకముగా ధృడ పరచుకున్నమీదట స్వత:సిద్ధమై ఉన్నదానియందు లేనిదిగా తోచబడుచున్న మాయా స్వరూపమైన ఎరుకను గురువాక్యముచే (షోడశి) లేనిదని ధృడపరచుకొనుము.

**కం॥ మనసుకు వాక్కుకు దెలియని। ఘనవస్తువు బయలటంచు
గనియా రెంటిన్। నినునను విశ్వముగా గని। వినుమూలము
లేనివీటి విడరా శిష్యా॥ 144**

## ప్రతిపదార్థము

వినరా శిష్యా = ఓ శిష్యుడా స్పష్టముగా గ్రహించుము
మనసుకు వాక్కుకు తెలియని ఘన వస్తువు బయలటంచు = మనో వాక్కులకు అందక కేవలత్వము కలిగి, అంతటా నిండి వుండి స్వత: సిద్ధమైన వస్తువును అచల పరిపూర్ణముగాను
గని = చక్కగా విచారించి
ఆ రెంటిని = మనస్సును, వాక్కును
నినునను విశ్వము గా గని = జీవేశ్వర జగద్రూపముగా గుర్తించు ఎరుకగా తెలుసుకుని,

విను = వస్తునిశ్చయముగా గుర్తించి
మూలము లేని వీటిని=మూలముగాని, స్థానముగాని లేక తోచబడుచున్న వీటిని
విడరా = గురువాక్యము చేత విడచి యుండుము

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన అచల పరిపూర్ణము మనసుచేత గుర్తించుటగాని, వాక్కుచేత వచించుట గాని సాధ్యపడదు. ఏలననగా ఈరెంటికీ ఆధారమైయున్నజ్ఞానము లేక ఎరుక లేనిది కావున వీటికి సాధ్యపడదు. ''యతోవాచో నివర్తంతే అప్రాచమనసా సహ'' అని శ్రుతికూడా చెప్పబడుచున్నది. ఇట్టి లక్షణము కలిగిన వస్తువును అచల పరిపూర్ణముగాను పైన పేర్కొన్న మనోవాక్కులను వీటికి అధిష్టానమైన జ్ఞానమును ఈ ప్రపంచముగాను గుర్తించి, మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న గుర్తును షోడశి వాక్యముచే విడిచి యుండుము.

**కం॥ ఏ నిర్ణయమును జేయడు। నేనని మహాత్ముడెపుడు। నేననువాడే**
**నానావిధాల వదరును నేనను తనవంటి వారినెప్పుడు గనినన్॥ 145**

## ప్రతిపదార్థము

ఏ నిర్ణయమును చేయడు నేననని మహాత్ముడుఎపుడు = గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము ఎరుకలను గుర్తించి ఎరుకను విడచిన పరిపూర్ణ భావజ్ఞుడు, పరిపూర్ణము ఉన్నదని గాని ఎరుక లేదని గాని ఎట్టి నిర్ణయము చేయ జాలడు
నేననువాడే = నేననే గుర్తుతో కూడు కున్నవాడే
నానావిధాలా వదరును = అనేక భిన్న భావములకు వీలుకల్పించు కొనేలా సిద్ధాంత పరచు కొనును
నే నను తనవంటి వారి నెప్పుడు గనినన్ = నేననే గుర్తుతో కూడిన కూడుకున్న వారిచే చేయబడిన మత వాదులతో చర్చించినపుడు

## తాత్పర్యము

సిద్ధాంతమునందు పేర్కొన్నవిధముగా ఉన్నది పరిపూర్ణము లేనిది ఎరుక అని ధృడ పరచుకొని గుర్తును విడచి, గురువాక్యము యధా తధాగా జీవించువాడు(పరిపూర్ణత దనరువాడు) పరిపూర్ణము ఉన్నదని గాని, ఎరుక లేనిదనిగాని, గుర్తెరిగే శరీరము ఏమీలేదని గాని గుర్తుతో ఎట్టి నిర్ణయము చేయక స్థితి కలిగి ఉండును. ఇట్టి ఆరూఢత లేనివారు గుర్తు తోకూడి ఉండి గుర్తును విడిచే విధానము ఎరుగక, తమలో ఒకరి నొకరు సంభాషించుకొనుచు భిన్నభిన్న మత నిర్ణయములకు వీలు కల్పించుకొని, భిన్నభిన్న సాంప్రదాయములకు కారణముగా నున్నారు.

**కం॥ మలుకలు లేవీ త్రోవను। చులకనగా దెలియవచ్చు। సుజనుల కెల్లన్ తలపదగు దీని నెప్పుడు। మలకల త్రోవలకు బోక మాన్యచరిత్రా॥ 146**

## ప్రతిపదార్ధము

మాన్య చరిత్రా = స్తుతింప దగిన చరిత్ర కలవాడా

మలకలు లేవీ త్రోవను = జనన మరణ రహిత విధానమునకు మార్గముగా చెప్పబడుచున్న ఈ పరిపూర్ణ భావమందు ఎట్టి కష్ట నష్టములు లేవు

చులకనగా తెలియవచ్చు = సులభముగా, తేలికగా, వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచు కొనుటకు వీలున్నది

సుజనుల కెల్లన్ = పూర్వజన్మ పుణ్యఫలముచే పరిపూర్ణగురువు నాశ్రయించిన వారికి

తలపతగు దీని నెపుడు = అనన్య చింతనతో భావించగలిగే లక్షణము కలిగినది ఈ మార్గము

మలకల త్రోవలకు = భిన్న భిన్న మార్గములతో, లక్ష్యములతో ప్రతిపాదించ బడిన మతమార్గములు

పోక = పాటించక, అనుసరించక

## తాత్పర్యము

పూర్వపుణ్యవిశేషముతో స్తుతింపతగిన జీవితము కల శిష్యుడా! సాంప్రదాయ బద్ధమైన వస్తునిశ్చయ జ్ఞాన పద్ధతిచే నిర్ధేశింపబడిన పరిపూర్ణ భావము జనన మరణ రహిత విధానమును అనుసరించు మార్గములలో యోగ్యమైనదిగా చెప్పబడుచున్నది. ఉన్నది ఉన్నట్లుగా, లేనిది లేనట్లుగా, ఎవరికి వారే స్పష్టముగా గ్రహించులాగున వస్తునిశ్చయ పూర్వకమైన బోధనా క్రమము కలిగి యున్నది. పూర్వజన్మ పుణ్యవిశేషముచే తన్నాశ్రయించినవారికి జన్మ సాఫల్యమును కలిగించి, రాజ మార్గముగా చెప్పబడుచున్నది. అత్యంత జాగరూకతతో నిరంతర భావనా బలముతో జీవించగలుగు విధానము ఇందు నిర్ధేశింపబడుచున్నది. కావున యితరమైన మత మార్గములు, భిన్నభిన్న అంశములతో జనన మరణ రహిత విధానమునకు మార్గములుగా చెప్పబడుచున్న వాటిని విడిచిపెట్టి ఈ భావమునందే ప్రవర్తించుము.

**కం॥ నామాట నమ్మవేమో। నీ మానస మెరుగ కంటి నేనీ మాటన్। నామాట**
**పథ్యమైనను। యే మారకు దీన్ని నీవికెప్పటి కప్పా॥ 147**

## ప్రతిపదార్థము

అప్పా = తండ్రీ
నామాట నమ్మవేమో = పైన పేర్కొన్న విధముగా, నేను చూపించిన మార్గమునందు నీకు విశ్వాసము కలుగని యెడల
నీమానస మెరుగన్ = నీమనస్సు, ఆలోచన గ్రహించలేక
అంటి నేనీ మాటన్ = ఈ విధముగా నేను మాట్లాడ వలసి వచ్చినది
నామాట పథ్యమైనను = నామాటయందు, విధానమందు నీకు నమ్మకము కలిగిన ఎడల
ఏ మారకు దీన్ని నీవు ఎప్పటికీ = ఏ పరిస్థితుల లోనూ శ్రేష్టమైన మార్గముగా చెప్పబడుచున్న దీన్ని నిర్లక్ష్యము చేయక పాటించుము

## తాత్పర్యము

తండ్రీ! పైన పేర్కొన్నవిధముగా పరిపూర్ణ భావము యొక్క విశిష్టతను మీకు వివరించు సందర్భములో నీ మనస్సును ఆలోచననూ గ్రహించక అంటినేమో. నేనుపదేశించిన క్రమంలో నీకు విశ్వాసము కలిగిన ఎడల ఎట్టి పరిస్థితులందున నిర్లక్ష్యములేక దీనియందలి అరూఢతను పొంది యుండుము.

**కం॥ సిద్ధాంతోక్తులు ఇవి। నీబుద్ధికి దెలుసుండి చదువ బోకుము వీటిన్‌బద్ధుల వినుమన వారలు। యుద్ధమునకు కాలుద్రవ్వు। చుందురు పెలుచున్॥ 148**

## ప్రతిపదార్ధము

సిద్ధాంతోక్తులు ఇవి = సాంప్రదాయ బద్ధముగా చెప్పబడుచున్న ఈ పరిపూర్ణ భావము. గురూపదిష్టమార్గమునందు మాత్రమే నిర్ధుష్టముగా చెప్పుటకు వీలైవున్నది
నీ బుద్ధికి తెలిసుండి = నీవు స్పష్టముగా దృఢపరచుకొని
చదువబోకుమువీటిన్ = ఇతరుల ముందువ్యక్తపరచకుము
బద్ధుల వినుమని=ఇతర మతసాంప్రదాయములను పాటించుడని, లేకపొందుడని
అనిన = ఒక వేళ అన్నచో
వారలు = అయా మతసాంప్రదాయకులు
యుద్ధమునకు కాలు ద్రువ్వు చుందురు పెలుచున్ = నీ భావమును, నిన్ను, నిందించి శాస్త్రచర్చలకు నిన్ను పురికొల్పెదరు

## తాత్పర్యము

తత్వశాస్త్రమునందు ఈ పరిపూర్ణ భావము అత్యంత రహస్యముగా లక్ష్య లక్ష్యార్థముగా, ఉత్తమాధికారుల కొరకు మాత్రమే సూచించబడినది. ఈ అంశమును సర్వోపనిత్సారమైన భగవద్గీత యందు శ్రీకృష్ణ భగవానుడు, అర్జునకు ఉపదేశిస్తూ "రహస్యమేత దుత్తమమ్" అయివున్న భావము

శిష్యుడువైన నీకు మాత్రమే ప్రబోధించు చున్నాను అని పేర్కొన్నారు. మతవాదములన్నియు వాటి సిద్ధాంతములు ప్రతిపాదించుట పట్ల ఆగమ ప్రమాణము లేక శబ్ద ప్రమాణము మాత్రమే ఆధారముగా గైకొని ప్రతిపాదింపబడి ఉన్నవి. ఇవన్నియు ప్రస్థాన త్రయముగా చెప్పబడుచున్న బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీతగా చెప్పబడుచున్నవి. ఏసిద్ధాంతమైన వీటి కనుబంధంగా మాత్రమే స్థిరపరచ వలసి యున్నది. ఈ కారణముగా భిన్నభిన్న సిద్ధాంతములు ఆయా దేశకాల పరిస్థితులనను సరించి ప్రచారములోనికి వచ్చినవి. ఇవన్నియు మతములుగా ప్రచారములో నున్నవి. వీటి వలన సమాజంలో రాద్ధాంతములు బయలు దేరినవి. ఒక్క పరిపూర్ణ భావము మాత్రమే గురువాక్యము ద్వారా మాత్రమే త్రికరణ శు ద్ధితో కూడిన ప్రవర్తనచే గురుకృప ద్వారా గ్రహించ వలసి ఉన్నది. కావున వీటినిర్ణయ విధానమందు, శాస్త్ర ప్రమాణమునకంటే, గురుర్వాక్యమునకే ప్రాధాన్యత నీయవలసి ఉన్నది. అధికారులు (లక్షణయుతులు) అయినవారికి మాత్రమే ఉపదేశ క్రమములో చెప్పవలసియున్నది. అట్టి విషయ నిరూపణ నీవు తెలుసుకున్నమీదట ఎదుటి వారి ముందు దీనిని వివరించుటకు ఎట్టి తొందరపాటు పనికిరాదు. ఏలననగా మతవాదుల నిర్ణయమునకు భిన్నముగా ఈ సిద్ధాంత ముండుట పట్ల దీనిని ప్రమాణబద్ధమైన విధి విధానమును వారు ఆశించెదరు. అట్టి వారి ముందు ఈ చర్చ, వాదోప వాదములు పనికిరావు అని తెలియుము.

**కం॥ ముద్దుగ యా గ్రంథంబును। పెద్దలముందర వచింప
పిరుదివియకుమీ। దిద్దెదరు తప్పులున్నను। వద్దనకను
దిద్దనిమ్ము। వరకీర్తినిధీ॥ 149**

## ప్రతిపదార్థము

వరకీర్త నిధి = శ్రేష్టమైన కీర్తికి నిధి వంటివాడా!
ముద్దుగ = సంతోషముగా, ఆనందముగా
ఈ గ్రంథమును = జనన మరణ బ్రాంతి రహిత విధానమునకు మార్గమును

ప్రతిపాదించు (క్షరాక్షరోపాది ద్వయ దోషరహిత పరమ తత్వము)
పెద్దల ముందర=పరిపూర్ణ భావము ఆరూఢత చెందిన మహాత్ముల ఎదుట
వచియింప = చదువుటకు, వివరించుటకు
పిరుదివ్యకుమీ = ఎట్టి సందేహమునకు లోను కాకుము
దిద్దెదరు తప్పులున్నాను = నీవు వివరించుటలో సిద్ధాంతమందలి గ్రహింపులో కలిగిన తేడాలను వివరించి సవరిస్తారు
వద్దనకను దిద్దనిమ్ము = ఎట్టి సంకోచము భయము లేకుండా సరిదిద్దుకొను అవకాశము ఏర్పరచుకో

## తాత్పర్యము

శ్రేష్టమైన కీర్తియందు నిధివంటి లక్షణముకల శిష్యుడా ద్వయ దోష రహిత క్షరా క్షరోపాది పరమ తత్వము అను పేరున జనన మరణ భ్రాంతి రహిత విధానము నకు మార్గముగా చెప్పబడుచున్న ఈ గ్రంథమును గూర్చి అట్టి సిద్ధాంతము నందు (భావము నందు) ఆరూఢత చెందిన మహాత్ముల ముందర వివరించుటకు లేక విచారించుటకు ఎట్టి సందేహము పడవలదు. నీ గ్రహింపులో సిద్ధాంత భంగమునకు వీలుకాకుండా సరిపడు భావము నిర్ధుష్టముగా వివరించి సరిదిద్దుకొనుటకు ఇది ఒక చక్కటి అవకాశముగా నీవు భావించు కొనుము.

**కం॥ నేనుగల మేనులేదని। మేనున నీవుండియిట్లు। మిడుకుట మేలా। మేనును విడిచను వినియెద। మానుగ నీవనక యున్నమాయవెసుమ్మీ॥ 150**

## ప్రతిపదార్థము

నేనుగలను = అధిష్టాన రూపమైన బ్రహ్మము సత్యము
మేను లేదని = మాయ పరిణామమై బ్రహ్మమునకు శరీరముగా తోచబడుతున్న జగత్తు మిధ్యా స్వరూపమని
మేనుననేవుండి = శరీరమునందే నీవునికి కలిగియుండి
యిట్లు మిడుకుట మేలా = ఈ విధముగా భావించుట న్యాయమేనా

మేనును విడిచను = నిజముకాని శరీరమును, నిజమైన నీవు విడిచి బయటకు కేటాయింపుగావచ్చి
అను = నీ అనుభవమును వివరింపుము
వినియెద = నీ అనుభవమును ప్రమాణముగా, సత్యముగా స్వీకరించెదను
మానుగ = అట్లు లేని ఎడల
నీవనకయున్న = నేను నీవనే భావములచే తోచబడుచున్న
మాయవే సుమ్మీ = నీవు నీ శరీరముతో పాటే లేని వాడవే అవుదువు

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమందు బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య అని ప్రతిపాదించబడుచున్నది. దీనిని సిద్ధాంతముగా స్వీకరించి నేను మేనులు వ్యష్ఠియందు విచారించుటలో నేను రూపమైన జ్ఞానము సత్యమని, మేను రూపమైన దేహము అశాస్వతమని, నశించు స్వభావము కలదని దేహినిత్యము, దేహమనిత్యము అను సూత్రము ప్రతిపాదింప బడినది. ఇది అనుభవ విరుద్ధమైన అంశము. ఏలననగా నేను మేనులు, దేహి దేహములు అన్యోన్యాశ్రితములై ఒక దానినొకటి తీపి బెల్లమువలె నిలిచి వుండును. ఒకదానిని విడిచి రెండవది కలదనుట అనుభవ విరుద్ధము. కావున ఈ సిద్ధాంతమును ప్రతిపాదించుటలో అసత్యమైన మేనును విడచి సత్యమైన నేను బయటకు వచ్చి తన ప్రమాణమును ఋజువు చెప్పవలసి వున్నది. అట్లైనపుడే నీవాదము వాస్తవము కాగలదు. కావున ఈ రెండూ ఒకటేనని, ఒకదానిని విడచి ఒకటి వుండవని, స్వత:సిద్ధమైన పరిపూర్ణమందు ఈరెంటి ఏకైకరూపమైన ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదని పరిపూర్ణ బోధ ద్వారా దృఢపరచుకొనవలసి ఉన్నది.

**కం॥ కట్టెలు పిడుకలు లేకను। యెట్టుంబలె నిప్పు నిల్వ। కేగునో పుడమిన్। అట్టుంబలెనే నీవును యిట్టి శరీరంబు లేక। నెందుందు వురా॥ 151**

## ప్రతిపదార్థము

కట్టెలు పిడకలు లేకనే = కట్టెలు, పేడముద్దలు(పిడకలు) లేకుండానే
ఎట్టుంబలె = ఏ విధముగా
పుడమి = భూమియందు
నిప్పు నిల్వ కేగునో = అగ్ని ఉండుటకు ఎట్లు సాధ్యముకాదో
అట్టుంబలెనె = ఆవిధంగానే
నీవును = నేననే గుర్తెరిగే తెలివి
ఇట్టి శరీరము లేక=ఇంద్రియ సంఘాతముతో కూడిన ఈ శరీరము లేకుండా
ఎందుందువురా = పిండాండ బ్రహ్మాండము లందు నిలుచుటకు వీలుకాదు

## తాత్పర్యము

ఈ భూమి యందు స్వయంసిద్ధమైన అగ్ని భూతము, కట్టెలు పిడకలు వుపాధిగా జేసుకుని ఉనికిని కలిగి వున్నది. ఆ విధంగానే నేననే తెలివి, శరీరము, ఇంద్రియ సంఘాతము, మున్నగునవి ఆధారముగా చేసుకొనియే వునికి కలిగి వున్నది. ఇట్టి ఆధారములేని ఎడల ఆ యా వస్తువులకు ఉనికి యేలేదు. ఇందు దేహి, దేహా పాదనినిరసన ప్రతిపాదింపబడుచున్నది.

**కం॥ తనువును నేగాననంటె। ఘనసుఖదు:ఖములు రెండు।
గనుపడెనీవై। గనుకతనువు నీవొక్కటె। వినరానామాటనిట్టి।
వెఱ్రినబడకన్॥ 152**

## ప్రతిపదార్థము

తనువును నేగాననంటే = శరీరము నశించు స్వభావము కలది గనుక సుఖ దు:ఖములు శరీరమునకే గాని ఆత్మకులేవు అను మాట
ఘనసుఖ దు:ఖములు = అనగా జనన మరణములు
రెండూ కనపడెనీవై = జనన మరణములు పొందుచున్నవి. ఈ రెండూ కలిపి ఒకటిగా తోచబడుచున్న నేననే గుర్తెరిగే శరీరమే
గనుక = అందుచేత

తనువు నీ వొక్కటే = శరీరము గుర్తెరగబడే నీవు వస్తునిర్ణయముగా విచారించినచో ఒక్కటేనని చెప్పవచ్చును
వినరా నామాట=అనుభవములో ఈ అంశమును గట్టిగా దృఢపరచుకొనుము
ఇట్టి వెర్రిన పడకన్=వేరుగా నున్నాయీ అనుభవమును విడిచి యుండుము

## తాత్పర్యము

పై పద్యమునందు పేర్కొన్న విధముగానే ఈ పద్యమునందు కూడా భేదభావము తొలగించబడి, ఏక భావన కలుగుచున్నది. మానవో పాధి యందు అత్యంత దు:ఖ ప్రదమైన జన్మకు వచ్చుట, పరమ పురుషార్ధమైన మోక్షప్రాప్తి పొందగలుగుట, అత్యంత ఆనందప్రదమైన అంశములుగా చెప్పబడుచున్నవి. "దుర్లభం మానుషం దేహం" "వివేకమతి దుర్లభం" అని శ్రుతి చెప్పుచున్నది. కాని మత వాదములందు జనన మరణములు దేహమునకే గాని, ఆత్మ సత్యమని ప్రతిపాదింపబడినవి. ఇది అనుభవ విరుద్ధమైన అంశముగా తెలియుము. ఏలననగా సుఖ దు:ఖములు వ్యష్టి సమిష్టి రూపమైన అత:కరణమునకే అనుభవమునకు వచ్చు చున్నవి. కావున తనువు, ఎరుకలు రెండూ ఒక్కటే నని వస్తు నిశ్చయపూర్వకముగా నే ప్రబోధించిన బోధక్రమమునందు దృఢపరచుకొని, వేరుగా నున్నాయని వెర్రిని విడిచి యుండుము.

**కం॥ ఎరుకలేనట్టి బయలున। బిరబిర నరుదెంచి యెవరు। బిలువ నిదేతా। నరసి పరిపూర్ణమున్నది। యెరుకేగితె చాలు లేని। దెరుకని లేకన్॥ 153**

## ప్రతిపదార్థము

ఎరుకలేనట్టి బయలున = గుర్తెరిగే ఎరుకకు మూలముగాని స్థానముగాని లేక స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమునందు
బిరబిర అరుదెంచి = వెంటనే తనంతట తానుగా తోచబడి
ఎవరు పిలవనిదె = ఎటువంటి కారణము,ఆధారము, ప్రమేయము లేకనే
తానరసి = తన వునికిని గురుముఖతా తావిచారించి

పరిపూర్ణముఉన్నది యెరుకేగితే చాలు = గురుసూచన ద్వారా, పరిపూర్ణము యొక్క వునికిని దృఢపరచుకున్నమీదట ఎరుక పోయితే చాలు
లేని దెరుకని = మూలములేని గుర్తెరిగే శరీరము ఏమీలేదని
లేకన్ = ఆవిధముగా తానులేక పోవుట

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేకనే తోచబడుచున్న ఎరుక తానుగా ఎట్టి ప్రమేయము లేకనే తనకు తానుగా తోచబడి గురుసూచనద్వారా, పరిపూర్ణము ఉన్నది ఎరుక లేనిది అని భావించి తుదకు గురువాక్యము ద్వారా తానులేక పోవుచున్నదని తెలియ వలెను.

**కం॥ తనువునే గానంటివి వినుၢ సుఖ దు:ఖములు నెవరి విరనా తోడన్ၢ వినజెప్పుము నేవినియెదၢ తనయా తప్పితివనిన్నుၢ దండింతుజుమీ॥ 154**

## ప్రతిపదార్థము

తనయా = నాయనా
తనువునే గానంటిని = దేహి, దేహ విచారణయందు దేహము అసత్యమని దేహి నిత్యమని పలుకుట
విను = శ్రద్ధగా విచారించుము
సుఖ దు:ఖములు = జన్మ పరంపరలకు కారణమైన (శబ్దాది విషయములు)
ఎవరివిరా = ఎవరు అనుభవించు చున్నారు
నాతోడన్ వినజెప్పుము = నన్ను సమాధానపరిచేలా వివరించుము
నేవినియెద = నీ సమాధాముము నేను ఆమోదించెదను
తప్పితివె= ఏమాత్రము నీవు పొరబడినా
నిన్నుదండింతు సుమీ = నిన్ను శిక్షా పాత్రునిగా చేసెదను

## తాత్పర్యము

(152వ పద్యమునకు అన్వయించు కొనవలెను) దేహి దేహభావనయందు దేహమనిత్యము, దేహి నిత్యము, సుఖ దు:ఖములు, జన్మ పరంపరలు దేహమునకేగాని, దేహి అయిన ఆత్మకు లేవని మీమాంస చేయబడినది. కాని వస్తునిశ్చయపూర్వకముగా విచారించిన వారికి స్థూలముగా దేహమందు కష్ట నష్టములు కలుగుచున్నా, వీటి అనుభూతులను భావనా రూపంగా దేహి పొందుచున్నాడు. ఈ రెండూ ఒకదాని కొకటి ఆధార, ఆధేయములై ఉన్నవి. ఇట్లు కాక నీవు వివరించిన పద్ధతిగా దేహమునకే అన్నీ కలుగు చున్నపుడు దేహి అయిన ఆత్మ ఎట్టి వికారము చెంద కూడదు. దీనిని ఆధారముగా గైకొని నీ అనుభవము నా ముందు వివరించుము. గ్రహించుటలో(అను భవములో) ఎట్టి పొరపాటున్నా నేను నిన్ను శిక్షించి సవరించుటకు ప్రయత్నము చేతును.

**కం॥ అందరిమాటలకురికే। వెందుకు నామాటనమ్ము మిదె చాలును।**
**యా యందరు లేని బయలుగని। యందున నీలేమి యెరిగి।**
**యరిగితెసరిరా॥ 155**

## ప్రతిపదార్థము

అందరి మాటలకురికే వెందుకు = మతసాంప్రదాయకులు భిన్న భిన్న కోణములలో ప్రతిపాదించిన, బేధ భావములను పరిగణలోనికి తీసుకోవద్దు
నామాట నమ్ము = వస్తునిశ్చయ పూర్వకముగా నేప్రబోధించిన పరిపూర్ణ భావము విశ్వసించుము
ఇదే చాలున్ =జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ఇదియే సరియైన మార్గము
ఆ అందరులేని బయలును గని = జీవేశ్వర జగత్తుగాని, దానికి అధిష్టాన రూపముగానున్న ఎరుకగాని లేని స్వత:సిద్ధమైన పరిపూర్ణమును గురు సూచనద్వారా దృఢపరచుకొని
అందున = అట్టిదానియందు

నీలేమి ఎరిగి = నీకు మూలముగాని స్థానముగాని లేదని దృఢపరచుకొని
అరిగితె సరిరా = గురువాక్యము ద్వారా గుర్తును విడిచి పెడితే సరిపోతుంది

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ప్రపంచములో మత సాంప్రదాయకులచే భిన్న భిన్న మార్గములు సూచించబడుచున్నవి. వాటి యందు ఎట్టి భ్రాంతికి లోను కావద్దు. సాంప్రదాయ బద్ధముగా వస్తు నిశ్చయ జ్ఞానముతో కూడి యుండి భ్రాంతి రహితవిధానమునకు అనువైన మార్గముగా నాచే చెప్పబడుచున్న ఈ పరిపూర్ణ భావము దృఢపరచుకొనుము. నీ ఆశయసిద్ధి చేకూరును. సకల దేశములందు, సకల కాలములందు, సర్వ వస్తువులందు చలించక తనకు తాను స్వత:సిద్ధమై యున్న అచల పరిపూర్ణము నందు జీవేశ్వర జగద్రూపమై, సర్వ భ్రాంతులకు మూలముగానున్న గుర్తెరిగే తెలివికి మూలము గాని స్థానముగాని లేదని గురుర్వాక్యముచే దృఢపరచుకొని గుర్తును విడిచి యుండిన ఇట్టి ఆరూఢత నీకు సరిపోవును.

**కం॥ నాబోతు రుచికిరుచినెడు। నీబోధ నపేక్షచేత నేర్చిన వారిన్। యే
బాధలు బాధింపవు। బాబూ యిది నీవు నేర్చి। పఠియింప గదే॥ 156**

## ప్రతిపదార్థము

నాబోతు = పటిక బెల్లము పంచదార
రుచికి = జిహ్వేంద్రియమునకు
రుచినిడు = ప్రీతి పాత్రముగా నుండును
ఈ బోధను = పరిపూర్ణ భావమును
బాబూ = నాయనా
అపేక్షచేత = కావాలనే తీవ్రమైన ముముక్షత్వము చేత
నేర్చిన వారిన్=గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకంగా దృఢపరచుకొన్న వారికి
ఏ బాధలు బాధింపవు = జనన మరణ భ్రాంతి రహితము కలుగును
ఇది నీవు నేర్చి = ఉన్నతమైన ఈ మార్గమును పాటించి (అనుసరించి)

పరియింపగదే = నిత్య జీవితము నందు భ్రాంతి రహితస్థితియందు ఉ నికి కలిగి ఉండుము

## తాత్పర్యము

బ్రహ్మవిద్య యందు, బ్రహ్మపదార్థము, జ్ఞాన మయముగాను, ఆనందమయముగాను చెప్పబడుచున్నది. సత్, చిత్, ఆనందములే బ్రహ్మమునకు స్వరూపలక్షణముగా సిద్ధాంతీకరించబడినవి. ఈ ఆనందము మరల పరిణామ క్రమమునకు లోనై దు:ఖమయము కాగలదు. ఎట్లనగా పటిక బెల్లము రసగ్రాహ్యమగు జిహ్వేంద్రియమునకు రుచి కరముగానున్నను, గర్భాశయమునకు చేరి అది వ్యాధిని కలిగించును. ఆ విధముగానే బ్రహ్మానుభవమందుగల ఆనంద స్థితి దిగజారి విషయానుభవమునకు లోనగును. కావున సర్వభ్రాంతి రహిత స్థితియే లక్ష్యముగా అచల పరిపూర్ణస్థితితో కూడిన ఆరూఢతయే గమ్యముగా ఎట్టి పరిణామ క్రమమునకు లోనుకాక నే ప్రబోధించు ఈ పరిపూర్ణ భావము దృఢపరచుకొని జీవన విధానములో అశరీరుడవై ఉండుము.

**కం॥ తాము తమ తప్పునెరుగక। నా మాటలు తప్పులనుచు నవ్వే
జనముల్ సామాన్యులనుచు దెలియుము। నీమానసమందు
లెస్స। నిరుపమసుగుణా॥ 157**

## ప్రతిపదార్థము

నిరుపమ సుగుణా = ఎట్టి దోషము లేని సుగుణ సంపత్తి కలవాడా
తాము = మత వాదులు
తమ తప్పునెరుగక = జనన మరణ బ్రాంతి రహిత విధానమునకు తాము ప్రతిపాదించిన గుణదోషములు లెక్కలోకి తీసుకోక
నామాటలు = నే ప్రబోధించు పరిపూర్ణ భావము
తప్పులనుచు = శాస్త్రీయ పద్ధతిగా లేవని
నవ్వే జనముల్ = చులకనగా పరిహాసముచేసే ప్రజలను

సామాన్యులనుచు తెలియుము = పండితులై వున్నా, మానవ స్వభావము తప్పించే స్వభావము కలవారని
నీమానసమందు = నీ మనస్సులో
లెస్స తెలియుము = చాలా స్పష్టముగా గుర్తించుము

## తాత్పర్యము

శ్రేష్టమైన సుగుణ సంపత్తి కలవాడా! జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పెక్కు మార్గములు మత వాదులచే భిన్న భిన్న కోణములలో ప్రతిపాదించబడి ఉన్నవి. పరిపూర్ణ భావము దృష్టి తో వీటిని పరిశీలించిన ఎడల అన్నియు భ్రాంతి సహితములే కాని, రహితములు కావు ఈ లోపమును నే సవరించి పరిపూర్ణ భావమును సిద్ధాంత పరుస్తూ, ఈ మార్గమును ప్రతిపాదించగా తమ యందుగల గుణ దోషములు సవరించుకొనక పోగా, నాప్రతిపాదననే శాస్త్రవిరుద్ధమని ఆక్షేపించెదరు. ఇట్టి భావముచే వారెంత గొప్పవారై ఉన్నాసామాన్యులు గానే భావించుము. ఏలననగా సత్యాన్వేషణలో ఎన్నో పరిశీలనలు గావించి పరమ సత్యమును ప్రతిపాదించుట, అది సరియైనదే నని గుర్తించుట మహాత్ముల లక్షణం. ఇట్టి మనసు లేని వారు ఎంతటి వారైనా సర్వ సాధారణమైన వ్యక్తులుగానే భావించవలెను. ఈ అంశమును విజ్ఞాన దృష్టితో నీ మనసుతో నీవు ఆలోచించి పాటించుము.

**కం॥ దప్ప ్యప్పున జనినట్లుగ। నిప్పునచలిబాసినట్లు। నిజమోగి రమున్ నొప్పుగ దిన్నప్పుడెక్షుద। దప్పినగతి బోధవిన్న। దప్పును బాధా॥ 158**

## ప్రతిపదార్థము

దప్పు = దప్పిక, దాహము
అప్పున జనినట్లుగా = నీళ్ళు తాగిన మీదట దాహము తీరినట్లుగా
నిప్పున చలిబాసినట్లు = చలి బాధతోనున్నపుడు నిప్పు సెగచే కాచుకొన్నచో చలి పోయినట్లుగా

నిజము,యోగిరమున్ నొప్పుగ తిన్నప్పుడె=ఆహారమును తీసుకున్న మీదట
క్షుద దప్పిన గతి = ఆకలి తీరినట్లుగా
బోధవిన్న = పరిపూర్ణ బోధను గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకంగా దృఢపరచుకొన్న మీదట
తప్పును బాధ = జనన మరణ భ్రాంతి రహితము సిద్ధించును

## తాత్పర్యము

దాహము వేసినపుడు మంచినీరు త్రాగుట చేత, చలి వేసినపుడు వెచ్చటి సెగచేత, ఆకలి వేసినపుడు అన్నము తినుటచేత ఎట్లు నివారింప బడు చున్నవో అట్లే వస్తునిశ్చయముగా పరిపూర్ణ భావమును గురుముఖత: దృఢపరచుకున్న మీదట జనన మరణ భ్రాంతి రహితము సిద్ధించును.

**కం॥ సాధనలు జెప్పి శిష్యుల। బాధల బెట్టేటి గురుని। బాట వదలియే। బాధలు లేనీ బోధను। సాధుల సేవించి వినుము సద్గుణ శాలీ॥ 159**

## ప్రతిపదార్థము

సద్గుణ శాలీ =శ్రేష్టమైన గుణములు కల ఓ శిష్యుడా!
సాధనలు చెప్పి=యమ, నియమ, ఆసన మొదలగు ప్రక్రియలు ఉపదేశించి
శిష్యుల బాధలు పెట్టేటి గురుని = శిష్యులను జన్మకర్మలకు లోను కావించు గురుని
బాట వదలి = ఉపదేశించిన విధానమును విడిచి పెట్టి
ఏ బాధలు లేని బోధను = అన్ని బాధలకు పరిష్కారమును సూచించు పరిపూర్ణ భావమును
సాధుల సేవించి వినుము =అట్టి మహాత్ములను ఆశ్రయించి వారి అనుగ్రహ విశేషముచే అట్టి భావము దృఢపరచు కొనుము

## తాత్పర్యము

షడ్దర్శనములలో యోగ దర్శనము చాలా ప్రముఖముగా చెప్పబడుచున్నది. పతంజలి మహర్షి దీనికి ద్రష్టయై మోక్షమునకు యిదొక

మార్గముగా ప్రతిపాదించబడుచున్నది. యమ, నియమమాది అష్టాంగ యోగములు, ఇందు ప్రతిపాదింప బడి లక్ష్యములు, ముద్రలు మున్నగు సాధనలతో గురు శిష్య న్యాయముగా మాత్రమే ప్రచారములో నున్నది. ఇది అత్యంత కఠిన తరమై, బ్రహ్మచర్యాది కఠిన మార్గములుపాటించుట చేత మాత్రముననే ఫలప్రదము కాగలదు. క్రమములో అధ్యయనము కానిచో యోగభ్రష్టులై పెక్కు రోగబాధలు కలిగి సామాన్యులకు అందు బాటులో లేక ఉన్నవి. ఇట్టి మార్గమును విడిచిపెట్టి సాంప్రదాయ బద్ధమైన గురూపదిష్ట మార్గములో వస్తు నిశ్చయపూర్వకమైన బోధనా పద్ధతిచేత మాత్రమే, సర్వ భ్రాంతి రహిత స్థితి కలిగింప జేయును. ఇట్టి మార్గమును పరిపూర్ణ గురువుల నాశ్రయించి, చతుర్విధ శుశ్రూషలు పాటించి వారి అనుగ్రహముచే జనన మరణ భ్రాంతి రహిత విధానమును దృఢ పరచుకొనుమా! ఓ సద్గుణ సంపతి గల సచ్ఛిష్యుడా అని భావము.

**కం॥ బోధల కెల్లను గురువగు। బోధసుమీ దీన్ని నీకు। బోధిస్తిని యీ।**
**బోధను వదలకు మెప్పుడు। సాధుజనస్తుత వివేకసతాతాశోక॥ 160**

## ప్రతిపదార్థము

సాధుజనస్తుత వివేకా = సత్పురుషులుచేతపొగడబడే విలువైన జీవితముతో కూడిన వివేక వంతుడా

సతతా, అశోక = ఎల్లవేళల, దు:ఖము లేనివాడా సర్వభ్రాంతి రహిత విధానము దృఢపరచుకున్నవాడా

బోధల కెల్లను గురువగు = జనన మరణ రహిత విధానమునకు ప్రపంచములో పెక్కు మార్గములు కలవు. వాటన్నిటికీ ఆదర్శవంతమైన, అవలంబనీయమై, శ్రేష్టమైనది పరిపూర్ణ భావము

బోధసుమీ = చక్కటి మార్గమును సూచించు బోధనావిధానము కలది

దీన్ని నీకు బోధిస్తిని = అట్టి విలువైన బోధను నీకు దృఢ పరిచితిని

ఈ బోధను వదలకు మెపుడు = ఎట్టి పరిస్థితుల్లోను, ఈ భావమును మార్గమును విడచి యుండకు

## తాత్పర్యము

సత్పురుషులచేత కీర్తింపబడే లక్షణము, జీవన విధానము కలిగి జన్మకర్మలనుండి విడుదల పొందిన ఆరూఢత గలవాడా, జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ప్రపంచములో పెక్కు మార్గములు ప్రతిపాదింపబడి వున్నవి. ఇట్టి మార్గములన్నిటిలో తలమానికమై ఆచరణీయమైన పరిపూర్ణ భావమును నీకు వస్తు నిశ్చయపూర్వకముగా ఉపదేశించి యున్నాను. ఇట్టి అపూర్వమైన, అరుదైన ఈభావమును ఎట్టి పరిస్థితుల్లోను విడిచి వుండకు.

**కం॥ నీమదికీ నిజబోధను। ప్రేమతో నాటించదలచి। పెక్కు విధములన్ నేమొదలు బెట్టి చెప్పితి। దే మాత్రము రాత్రి పగలు। యేమారకుమీ॥ 161**

## ప్రతిపదార్థము

నీ మదికి = నీమనస్సునకు
నిజబోధను = పరిపూర్ణ బోధను
ప్రేమతో నాటించదలచి=ఉన్నదున్నట్లుగా వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొనుటకు.
పెక్కు విధములన్ = అనేక యుక్తి ప్రయుక్తులతో
నేమొదలు పెట్టి చెప్పితి = మొదటి నుండి చివరి దాకా సమగ్రమైన విచారణ పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమములో
ఏ మాత్రము = ఎట్టి నిర్లక్ష్యముఅశ్రద్ధ లేకుండా
రాత్రి పగలు = నిరంతరము; నిదుర వచ్చిన దనుక, చచ్చినదనుక
ఏమారకుమీ = విడిచి యుండకు

## తాత్పర్యము

ఓ శిష్యుడా! జనన మరణ భ్రాంతి రహితమునకు పరి పూర్ణ భావజ్ఞులచే ఈ సిద్ధాంతము ఒక శ్రేష్టమైన మార్గముగా ప్రతిపాదింప బడియున్నది. పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను

సూత్రాను సారముగా, సమస్త వేదోపనిషత్సారమై ఉన్నది. ఇట్టి విలువలతో కూడిన ఈభావమును నీమనసుకు దృఢ పడుటకు వస్తునిశ్చయ పూర్వకమైన పద్ధతిచే పెక్కు దృష్ట ద్రాష్టాంతములతో సమగ్రమైన విచారణ పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమంలో నీకు ఉపదేశించితిని. ఎట్టి నిర్లక్ష్యముచేయక, సర్వ కాల సర్వావస్థలయందు నిదుర వచ్చినక నీవు చచ్చిన దాక దీని యందే వునికి కలిగి ఉండుము.

**కం॥ నేనీకు జెప్పబూనిన। యీ నిజసద్బోధ మనసు। కిమిడిన వెనుకన్**
**నీనా పనిదీరునురా। వోనాముద్దుల కుమార వోనగధీరా॥ 162**

## ప్రతిపదార్థము

ఓనా ముద్దుల కుమారా = ప్రియమైన అపూర్వమైన, ఆరూఢత కలిగినవాడా
ఓనగధీరా = అత్యంత ధైర్యఉత్సాహములు కలవాడా
నేనీకు చెప్పబూనిన = నేను నీకు ఉపదేశింప బూనిన
ఈ నిజ సద్బోధ = ఈ అచల పరిపూర్ణ భావము
మనసుకిమిడిన వెనుకన్ = నీ మనసుకి దృఢపడి ఆరూఢత చెందిన పిదప
నీనా పనితీరునురా=మన యిరువురి ప్రమాణములు కృషి, ఉనికి పూర్తి కాగలవు

## తాత్పర్యము

అత్యంత ధీరోధాత్త గుణములు కలిగి జన్మ చరితార్థము చేసుకున్న ఓ సచ్ఛిష్యుడా! అత్యంత దుర్లభమై, శ్రేష్టతరమైన పరిపూర్ణ భావమును నీమనసుకు దృఢపడు లాగున ఎన్నో యుక్తి ప్రయుక్తులతో వస్తునిశ్చయ పూర్వకముగా నీకు ప్రబోధించి యున్నాను. అందలి రహస్యము లన్నియు నీవు జీర్ణింప జేసుకుని, ఆరూఢపరచుకొని సర్వ భ్రాంతి స్థితిని పొందిన పిదప గురు శిష్యులమైన మన యిరువురి ప్రమాణములు పూర్తికాగలవు. అనగా చెప్పుట వినుట అను క్రమము ఎరుక భ్రాంతి రహిత విధానముమందు పరిష్కారమై సర్వ సందేహములు తీరగలవు.

**కం॥ ఎన్నో గ్రంథజలధులను। తిన్నగ మధియించి చూస్తె। తేలెను సారం। బున్నబయలుగని మృషయగు నిన్నున్ నేమేను మృషని। నిలువకు మనుచున్॥ 163**

## ప్రతిపదార్థము

ఎన్నో గ్రంథజలధులను = ఆగమములు, నిగమములు, ఉపనిషత్తులు మొదలగు శబ్ద బ్రహ్మము ద్వారా ప్రకటమైన వర్ణాత్మకమగు సమస్త శబ్ధరాశిని
తిన్నగ = ఒకచోట చేర్చి
మధియించి = చిలికి, వడపోసి
చూస్తే = వస్తునిశ్చయ పూర్వకంగా నిర్ధేశిస్తే
తేలెను సారంబు = శ్రేష్టమైన సారము(పరిపూర్ణమును ఎరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మాను)
ఉన్న బయలుగని = స్వత:సిద్ధమైన పరిపూర్ణము ఉన్నదని
మృషయగు నిన్ను నీమేనును = లేక తోచబడుచున్న ఎరుక దాని శరీరము
మృషని = లేనివని, నిజముకానివని
నిలువకు మనుచున్ = విడిచి యుండుము

## తాత్పర్యము

తత్వ శాస్త్రమునకు ప్రమాణముగానున్న శబ్ద ప్రమాణమునుండి వర్ణాత్మకముగా ఏర్పడిన సమస్త శబ్దరాశిని, ఒక చోట చేర్చి, విచారణ అనే పద్ధతిచే మధించగా, సారభూతమైన రెండు అంశములు తేలి యున్నవి. స్వత:సిద్ధమైయున్నది అచల పరిపూర్ణమని, దానియందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్నది ఎరుక యని, అట్టి లేనిదానిని లేదని దృఢ పరచుకొనుటయే జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు సులభమైన మార్గమని, అచలఋషులచే ప్రతిపాదించబడుచున్నది.

**కం॥ కప్పురము నిప్పుగలసే చొప్పున వెలి గవలకండ్ల। జూస్తుండగనే। తప్పున గనరాదట్లనె। యిప్పుడు నినునన్ను బోధ। నెరుగుము బుద్ధిన్॥ 164**

## ప్రతిపదార్థము

కప్పురము = కర్పూరము
నిప్పున గలసె = అగ్నితో కలసినపుడు
చొప్పున వెలిగి = వెంటనే ప్రకాశించి
ఆవల = తరువాత
కండ్ల చూస్తుండగనే = మన ఎదుటనే
తప్పున కనరాదు = వెంటనే ఎట్లు లేకుండా పోవుచున్నదో
అట్లనె = ఆ విధంగానే
యిప్పుడు = ఈ విచారణా పద్ధతిచే
నిన్ను నన్ను బోధను ఎరుగుము=గురు శిష్యులమైన మనను విచారణను భావించుము
బుద్ధిన్ = చక్కటి విచారణతో

## తాత్పర్యము

పంచదశి యందు చెప్పబడిన ద్రాష్టాంత వాక్యము ద్వారా కర్పూరము దీప సంయోగము చెందినపుడు జ్వాలగా మారి, ఉజ్వలమై వెలిగి మన కళ్ళముందే రెండునూ లేకపోవుట ఎట్లు సిద్ధించు చున్నదో అవిధముగానే పరిపూర్ణ బోధను విచారించు మన నిరువురిని నిశ్చలమైన బుద్ధితో సమాధానపరచుకొనుము.

**కం॥ దీవించి యిస్తి నేనీ। సేవించిన సేవమెచ్చి। చిత్తము లోనన్ కావించు**
**మెపుడు గానము। భావించిది ముఖ్యమనుచు। పావనశీలా॥ 165**

## ప్రతిపదార్థము

పావన శీలా = పవిత్రమై·నీతివంతమైన శీలము కల శిష్యుడా!
దీవించి యిస్తి = అనుగ్రహ పూర్వకముగా, ఈ పరిపూర్ణ భావమును నీకు ఉపదేశించినాను
నేను = గురువునైన నేను
నేనీ సేవించిన సేవ మెచ్చి చిత్తము లోనన్ = నన్నాశ్రయించిన నాటి

నుండి చతుర్విద శుశ్రూషలద్వారా, గురుర్వాక్యం యధాతధాగా జీవించు నీ జీవన విధానమునకు నామనస్సులో సంతోషము చెంది
కావించు మెపుడూ గానము = మనస్సునకు వంటబట్టు లాగున దీనినిచక్కగా మాటి మాటికీ దృఢపరచుకొని
భావించు యిది ముఖ్యమనుచు = జననమరణ భ్రాంతి రహిత విధానమునకు ఇదియే సరియైన మార్గముగా గుర్తించుము

## తాత్పర్యము

పవిత్రమైన పావన మైన శీల సంపత్తి కలవాడా! ఉపదేశ పద్ధతిచే నీవు నన్నాశ్రయించి నే నిర్దేశించిన విధముగా జీవన విధానమందు మార్పు కలిగించుకొని చతుర్విధ శుశ్రూషల ద్వారా గురుర్వాక్యం యధా తధా అన్నరీతిలో జీవించు నీ జీవన విధానమునకు, నా మనస్సులో సంతృప్తి చెంది, అనుగ్రహ పూర్వకమైన ఆశీర్వచనము ద్వారా, శ్రేష్టమైన రహస్యమైన ఈ పరిపూర్ణ భావమును నీకు ప్రబోధించి యున్నాను. నిరంతరము ఈ నిష్ట యందే జీవిస్తూ, బోధయందలి స్థితియందు ఉనికి కలిగి జీవించుము.

## హీనగురు శిష్యోభయ లక్షణము

పరిపూర్ణ సిద్ధాంతమునందు గురు శిష్యుల ఆదర్శములు ప్రముఖములై ప్రకాశించు చున్నవి. "మణియేన వలయం, వలయేన మణి" అనగా బంగారు కంకణము, అందు పొదగబడిన విలువైన మణులు ఒక దానిచే ఒకటి, ప్రభావితములై, విలువలు పెంచు కొన్నట్లుగా ఇందలి గురుశిష్యులు కూడా ఒకరి కొకరు ఆదర్శవంతులై ఆచరణాత్మక మైన జీవన విధానంలో లౌకిక, పారమార్థిక విలువలకు ప్రాధాన్యము కలిగిస్తూ సాంప్రదాయమును పరంపరా గతముగా దీపో దీపాంతరం అన్నట్లుగా ప్రకటపరచుచుందురు. బ్రహ్మవిద్య యందు, శిష్యునికి ఆత్మోద్ధరణ యందు గురుని ఆవశ్యకత చాలా స్పష్టముగా కలిగి యుండును. కాని ఈ ధర్మము నందు గురువునకు కూడా శిష్యుడు అవసరమై ఉన్నాడు "శిష్యునికి గురువు అవసరమైతే, గురువునకు శిష్యుడు కూడా అవసరమై యున్నాడు అనే

నానుడి ప్రచారములోకి వచ్చింది. గురువుల యొక్క గొప్పదనం శిష్యుల ద్వారా బహిర్గతమౌతుందని దీక్షితుల వారు నుడివి యున్నారు. గురు శిష్య శబ్దములు అన్యోన్యాశ్రితమై ఒకరి నొకరు తీర్చి దిద్దబడి సాంప్రదాయమునకు మూలాధారముగా చెప్పబడుచున్నవి. ఇట్టి గురు శిష్యలక్షణములు గురుగీతా గ్రంథమందు నిర్దుష్టముగా చెప్పబడి యున్నవి. వీరి ఆదర్శము భుక్తి, ముక్తి క్రియల రెంటిలో, సాంప్రదాయము యొక్క ఔన్నత్యమునకు వారధిగా నిలచి యున్నది. ఇట్టి విధానము మంచి చెడులు రెంటికీ కూడా విలువలు కలిగించి పాటింపబూనుటకు వీలుకలుగుచున్నది. అట్టి విధానములు, అందలి గుణ దోషములు ఈ శీర్షిక ద్వారా ఈగ్రంథకర్త మనకు వివరించు చున్నారు.

**కం॥ ఈవి కాశించు గురుడును। నావద్దొక కాసులేదు నన్నడుగకుపో।**
**పోవయ్యా యనెడి శిష్యుడు। కేవల హీనాత్ములనుచు। గీర్తింప**
**దగున్॥ 166**

## ప్రతిపదార్థము

ఈవికాశించుగురుడును=అనగా డబ్బు ప్రలోభమునకు లోనవుచున్న గురుడు
నావద్ద = తన ఒద్ద
ఒక కాసులేదు = ఒక దమ్మిడీ లేదు
నన్ను అడుగకు పోపోవయ్యా అనెడి శిష్యుడు = నావద్ద ఏమాత్రము లేదని సమాధానమిచ్చెడి శిష్యుడు
కేవలము = స్పష్టముగా
హీనాత్ములనుచు = ఆదర్శ హీనులనుచు
కీర్తింప దగున్ = స్పష్టముగా చెప్పవచ్చును

## తాత్పర్యము

"ధనమూల మిదం జగత్" అను సూత్రాను సారముగా సమాజమునందు ధనము ఇరువురు వ్యక్తులమధ్య, ప్రధాన అవసరముగా మనుగడకు ముఖ్యమైనదిగా చెప్పబడుచున్నది. ఈషణ త్రయములో ఇది

చాలా శక్తి వంతమైఉన్నది. ధర్మ మూలమిదం జగత్ అను సూత్రము స్థానే ఈ సూత్రము ప్రచారము లోనికి వచ్చినది. సమాజ వికాసముతో వ్యక్తి వికాసము కూడా పెరిగి తాను విడచి ఉండలేని వస్తువుగా జీవితము నాక్రమించి దీని అభివృద్ధికై ఎంతటి దుష్ట కార్యమునకైనా ప్రేరేపించు శక్తివంతమైన ఈషణగా చెప్పబడుచున్నది. ఒకరి మధ్యనొకరికి ప్రేమాను రాగములు, ఈర్ష్యాద్వేషములు చివరకు ప్రాణ హానికి కూడా వెరవ కుండా చోటు చేసుకున్నది. "మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః" అను సూత్రము కూడా ప్రవర్తిల్లినది. ధర్మ పద్ధతిగా స్వకష్టార్జితంగా, తనజీవన విధానం కొరకు తనను, తనపై ఆధార పడిన వారిని పోషించుటకు అర్థము అను పేర, చతుర్విధ ఫల పురుషార్థములలో దీనికి చోటు కల్పించ బడినది. అందున రాజయోగ ధర్మమైన గృహస్థాశ్రమమందు, కుటుంబ వ్యవస్థకు బాధ్యత వహించి జీవించు గృహస్థునకు దీని అవసరము, ప్రయోజనము ఎంతైనా కలదు. గురుశిష్య న్యాయమునందు దీని అవసరము చాలా ప్రముఖముగా చెప్ప వచ్చును. బల ధన విద్యలు దైవ దత్తములై పూర్వ పుణ్యవిశేషముచే ప్రాప్తించును. అవి తనకు ఉపయోగ పడేలా మలచుకొని ఇతరులకు కూడా ఉపయోగ పడేలాగున స్వంత లాభము కొంత మానుకొని వినియోగించు విధానము గురూపదిష్ట మార్గములో గురుశిష్యులు పాటించుట అవసరమై యున్నది. తన సర్వస్వమూ తన గురుమూర్తి అను అర్పణ భావముతో శిష్యుడు తన సర్వస్వము శిష్యుడు అను వాత్సల్యభావముతో గురువు ఎట్టి వ్యామోహములకు లోనుగాక ఆదర్శములకు కట్టుబడి జీవించ వలసి యున్నది. ఈ పద్యమునందు ఇట్టి గురుశిష్యులకు వారి ఆదర్శమునకు భంగము కలుగ కుండా ధనమునందు వారికుండ వలసిన లక్షణము చెప్పుచూ ఆశపడు తనము గురునకు, లోభి తనము శిష్యునకు ఉండ కూడదని ఒకవేళ వాటి ప్రభావమునకు లోనైనపుడు వారు ప్రబోధించు భావము ఎంత గొప్పదైనా వీరిని సామాన్యులుగానే లోకులు గుర్తించెదరని వివరిస్తూ పై లక్షణములకు లోను కాకుండా జీవించు విధానము నిర్దుష్టముగా చెప్పబడుచున్నది.

కం॥ దేవుడు తేతెమ్మనునా। జీవుడు లేదనుచు మదిని। శిడిముడి
పడునా। భావమున దెలిసి యిద్దరు। నావిధమున నడువ
వలయు। నందరు మెచ్చన్॥ **167**

## ప్రతిపదార్ధము

దేవుడు తే తెమ్మనునా=భగవంతుడు భక్తుల నుంచి ఏవిధమైన కోరికలు కోరడు
మదిని = మనస్సులో
లేదనుచు జీవుడు = భక్తుడు తన వద్ద ఏమాత్రము ధనము లేదని
శిడి ముడి పడునా = కోపము ప్రదర్శించునా
భావమున దెలిసి ఇద్దరు = సాంప్రదాయము నందలి విలువల నుంచుకొని గుర్తునందుంచు కొని గురు శిష్యు లిద్దరు
ఆ విధమున నడువ వలెను = పై ఆదర్శమునకు భంగము కలుగ కుండా వ్యవహరించ వలెను
అందరు మెచ్చన్ = సమాజమునందు అందరూ ఆమోదించి పాటించేలా

## తాత్పర్యము

భగవంతుడికి ఎట్టి కోరికలు వుండవు. భక్తునికి ఎట్టి పిసినారి తనము వుండదు. ఆ విధంగానే గురుశిష్యులుభక్తునికి, భగవంతుని తోగల సంబంధమును, విలువలను గుర్తులో వుంచుకొని, ధనేషణ యందు అత్యంత మెళుకువ గా జీవించవలసి యున్నది.ఎట్టి వాంఛలకు లోను కాకుండా తృప్తితో యాదృఛ్ఛా లాభ సంతుష్టి కలిగి శిష్యుడు సమర్పించిన, ధన, కనక, వస్తు వాహనములయందు ఎట్టి వ్యామోహమునకు, మీమాంసకు లోను కాకుండా స్వీకరించు లక్షణము గురునకుండ వలెనని ఇట్టి లక్షణము దైవ లక్షణమని చెప్పబడుచున్నది. గురుని అవసరం, పోషణగమనించి తనవిగా భావించుచున్న తనుమన ధనములు గురునకు సమర్పణ గావించు కొనుటచే వాటి యందు ఎట్టి స్వార్ధ పరత్వము తనకు లేక ధర్మపరిరక్షణకు తననొక ప్రతినిధిగా భావించుకొని, లోక కళ్యాణాస్పదమగు, కార్యక్రమము లందు వితరణ బుద్ధి కలిగి జీవించు విధానము భక్తుడు అనగా శిష్యునకు

ఉం డవలసిన లక్షణముగా ఇందు చెప్పబడుచున్నది. ఇట్టి జీవనము నందు ఒకరి కొకరు ఆదర్శప్రాయులై సమాజమునందు, వీరి వునికి అందరూ పాటించు లాగున జీవించవలసి యున్నది.

**కం॥ గురుశిష్యుల లక్షణములు। గురుశిష్యుల బోధరీతి గురు**
**గీతార్థం। బెరిగిన నరునకు మెప్పుగు। నెరుగనియా మూఢ**
**నరుల కిష్టితియౌనే॥ 168**

## ప్రతిపదార్థము

గురు శిష్యుల లక్షణములు=గురువు శిష్యుడు అను శబ్దముల యొక్క విలువలు
బోధరీతి = వారియందు జరుగు బోధనా విధానము
గురుగీతార్థంబెరిగిన నరులకె = స్కాందపురాణమందలి ఉమా మహేశ్వర సంవాదముగా చెప్పబడుచున్న గురుశిష్య సంవాదమైన గురుగీత, అందు చెప్పబడుచున్న విలువలు, ప్రయోజనములు
ఎరిగిన నరులకు = స్పష్టముగా దృఢపరచుకున్న మనుజులకు
మెప్పగు =ఇష్ట పడతారు, ఆమోదిస్తారు
ఎరుగని = అట్టి విలువలు గ్రహించలేని
ఆమూఢనరులకు = సామాన్యులకు
యిష్ఠతియౌనే = యిష్ట పడి పాటించుతారా

## తాత్పర్యము

సనస్సుజాతీయమై వేదవ్యాసప్రోక్తమై, స్కాందపురాణము అష్టాదశ పురాణములలో ప్రముఖమైనదిగా చెప్పబడుచున్నది. పురాణములన్నియు ఆదర్శ వంతములైన మహనీయులచే చెప్పడినట్లుగా తెలియు చున్నది. "జగత్పితరం వందే పార్వతీ పరమేశ్వరం" అన్నట్లుగా పార్వతీ పరమేశ్వర సంవాద రూపమై గురుగీతా ధర్మము ఉత్తర ఖండమునందు చెప్పబడుచున్నది. ఇందు గురుశిష్యుల తత్వములు, శబ్దార్థములు, విలువలు, ప్రయోజనములు మున్నగు అంశములు స్పష్ట పరచబడుచున్నవి. పరిపూర్ణ సిద్ధాంతమునందు గురూపాసన అత్యంత

ప్రాధాన్యత కలిగి యున్నది. శిష్యోద్ధరణకు గురుకృప అత్యంత అవసరమై యున్నది. శాస్త్రమునందు ఈశ్వర కృపగా చెప్పబడుచున్నదానినే ఇచ్చట గురు కృపగా చెప్పవచ్చును. గురుభక్తి, గురుసేవ, గురునిష్ట ఈబోధయందు చరమాంకమై యున్నవి. ఆది అంత్యములయందు వీటి అవసరము ప్రయోజనము గమనించి గురుశిష్యుల విలువలు, ఆదర్శములు లోకములో వెల్లడించుటకు సుజ్ఞాన దీపము అను పేర ఈ గురుగీతను ఒక పీఠగ్రంథముగా ప్రకటించి ఇందలి విధి విధానము పరిపూర్ణ బోధకు ప్రాథమిక దశగా పాఠక లోకమునకు పీఠ్ఙాన శంకర ప్రభువులచే అందించడమైనది. ఇందలి అనుష్టాన పద్ధతి, పారాయణ విధానమును పాఠింపజేస్తూ ఏతత్‌ఫలితాన్ని పొందినగాని,(స్వయంబ్రహ్మ మయోభూత్వా) పరిపూర్ణ భావమును ఉపదేశించ రాదని పీఠాధ్యక్షులైన దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారు ప్రకటించి యున్నారు. కావున గురుశిష్యులు వారి విలువలు, తెలియ బడాలంటే విధిగా గురుగీతా ధర్మమునుపాటించి తీరవలసినదే. ఇట్టి విలువలు తెలియని వారు పరిపూర్ణ బోధయొక్క మౌలికాంశములు(పరిపూర్ణమును ఎరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మాను) అందలి వాస్తవికతను గ్రహించి దృఢపరచుకొనుట దుస్సాధ్యము.

## గురుశిష్యోభయ లక్షణం

**కం॥ తన సంతతిపై గల దయ। తన శిష్యుని మీదనుంచదగు**
**గురుడెవుడున్। తనధనము మనను తనువును।**
**తనగురునివటంచు దల్చ। దగు శిష్యునకున్॥ 169**

## ప్రతిపదార్థము

తనసంతతిపై గలదయ=తన సంతానముమీద చూపించు ప్రేమ వాత్సల్యములు
తన శిష్యుని మీద=తన మంత్ర దీక్ష ద్వారా ఉపదేశమిచ్చిన శిష్యుల ఎడల
వుంచదగు గురుడెపుడున్ = గురువట్టి భావము కలిగుండ వలెను
తనధనము, మనసు, తనువును = తనశరీరము, మనస్సు, వాక్కు
తన గురునివటంచు = తనకు మంత్రోపదేశము చేసిన గురునివని

తలచదగు = భావించదగు
శిష్యునకున్ = శిష్యుడైన వాడు

## తాత్పర్యము

ఈషణ త్రయములందు పుత్రేషణ ఒకటిగా చెప్పబడుచున్నది. ఇది చాలా బలీయమైనది. "అపుత్రస్య గతిర్నాస్తి" అనగా పుత్రులు లేనివారికి ఉత్తమ గతులు సిద్ధించవు, అను శ్రుతి న్యాయముగా ఈ పుత్రేషణ కలుగుచున్నది. "ఆత్మా వై పుత్రనామాని" అనగా తన ఆత్మయే పుత్రరూపముగా తనకు సంక్రమించు చున్నది. కావున, ఈ ఈషణ రక్తసంబంధమై చివరకు ఒకపాశముగా మారుచున్నది. ఇట్టి విధానము కేవలము వంశాభివృద్ధి కొరకు మాత్రమే చెప్పబడుచున్నది. ఋణత్రయమునందు, పితృఋణము ఒకటిగా చెప్పబడుచున్నది. ఇట్టి ఋణము తీర్చుకొనుటకై వివాహసంస్కారము ఏర్పాటు చేసుకొని, భార్య ద్వారా సంతానవంతుడై, వంశాభివృద్ధికి దోహద పడినగాని పితృఋణము నుండి విడుదల కాలేడు. ఈ కారణముచే తల్లి దండ్రులకు పుత్రుల ఎడల తీవ్రమైన వాత్సల్యపూరితమైన, వ్యామోహము ఏర్పడి చివరకు అది పాశముగా మారుతుంది. దీనినుండి విముక్తులగుట సామాన్యాంశము కాదు. అందున అట్టి పుత్రుడు ఆధ్యాత్మిక మార్గమునందు కృషిసల్పి ఉన్నతుడైనపుడు అట్టి వాని ఎడల ఈ మమకారము ఇంకనూ హెచ్చుగానుండును. కర్మపుత్రులు, ఋణపుత్రులు, జ్ఞానపుత్రులు అని మూడు తరగతులుగా పుత్రులను విభజించినారు. తండ్రికి తనపుత్రుని ఎడ ప్రేమాభిమానములు సహజముగా కలిగి యుండును. ఇక శిష్యుని విషయములో విచారించినచో గురువునకు శిష్యులు ఆత్మ పుత్రులుగా చెప్పబడుచున్నారు. ఈ సాంప్రదాయమునందు గురువుగా అధికారము పొందినవానికి ఒక ప్రత్యేకమైన ఆవరణము తన గురువు ద్వారా ఏర్పడును. సాంప్రదాయ పద్ధతిగా తను ఆరూఢపరచుకొన్న గురుధర్మము తన జీవిత కాలములో ఏ ఒక్క శిష్యుని కైన"దీపో దీపాంతరం యధా" అన్నట్లుగా

ఆరూఢపరచినగానీ గురుఋణము తీర్చుకొన జాలడు. ఇది కూడా చాలా బలమైన ఋణము ఇందు కొరకై ఈ ధర్మమును సమాజంలో ప్రచారంచేస్తూ శిష్య సేకరణ కావించును. యోగ్యులైన వారికి, మంత్రదీక్షనిచ్చి వారిని తన సంతానముగా భావించి కావలసిన ప్రేమ వాత్సల్యముతో కూడిన శిక్షణ అందించి తన భావమునకు తన ఆశయ సిద్ధికి వారసునిగా భావించి తీర్చి దిద్దును. ఇట్టి సందర్భములో అట్టి శిష్యుడు తనకున్నసర్వస్వమును తనతో సహా సర్వార్పణబుద్ధితో శరణాగతి తో కూడిన జీవన విధానము కలిగి యుండవలెను. ఈ సాంప్రదాయమందు గురుశిష్యులు ఒకరిపై ఒకరు ప్రేమతో కూడిన విశ్వాస పాత్రత కలిగుండ వలెను. ఇట్టి సందర్భములో ఈపద్యమునందు వారి ఆదర్శములు, అన్యోన్యతను వివరిస్తూ గురునకు తన శిష్యుని ఎడల పైన చెప్పిన విధముగా పుత్రవాత్సల్యము కలిగి ఉండవలెను. శిష్యుడు తన మనస్సు, శరీరం, వాక్కులను తనతో సహా అర్పణ గావించుకొని గురుర్వాక్యం యధా తధాగా జీవించుచూ తన ప్రవర్తనచే గురువు సంతోషపడునట్లుగా జీవిస్తూ, ఎట్టి అహంకారమమకారములకు లోనుగాక ఇతరులకు ఆదర్శప్రాయుడై మెలగ వలెను. ఇట్టి లక్షణములవలన గురుశిష్య శబ్ధములు ఆదర్శ వంతములై ఇతరులకు ఆచరణీయములై సాంప్రదాయమునకు వన్నె కలిగించు విధముగా ఉండ వలెను.

## నీతి ప్రబోధము

ఈ సిద్ధాంతము అచల పరిపూర్ణ రాజయోగము అను పేరుతో ప్రచారములో నున్నది. ఇందు ఆరూఢత చెందిన మహాత్ముని "రాజయోగి" అను పేరుతో వ్యవహరించుటయు కలదు. రాజయోగమనగా భుక్తి, ముక్తి క్రియల రెంటికీ సమాన ప్రతిపత్తిని కలిగించి సమ తూకములో సంగా సంగములు విడిచి అస్పర్శయోగముతో, అశరీరుడై(వుండీ లేనిస్థితి) ఆదర్శప్రాయమైన జీవితము నడవగలుగు బోధనా పద్ధతి ఆచరణాత్మకమైన జీవన విధానము ఈ సిద్ధాంతమునందు స్పష్ట పరచబడుచున్నది. తాను ఆరూఢపరచుకొన్న బోధను నిజ జీవితంలో ప్రవేశపెట్టి లౌకిక జనులకు సమాజమందు గల విలువలతో కూడిన మార్గ దర్శకత్వమును పెంపొందిం

చుకొని ముక్తి క్రియల యందు తన ఆరూఢతకు భంగము కలుగ కుండా నిరంతరము జాగరూకుడై పరిపూర్ణ భావసిద్ధి కలిగించు కొనును. తన నడవడికచే ఉండి లేక పోవు విధానము ఎట్లో సమాజమునకు నేర్పును. పరిపూర్ణ క్రియ కాక పరిపూర్ణ భావమునందు మాత్రమే వ్యవహరించు చుండును.ఇట్టివిధానములో సమాజమునందు ఇంతకు పూర్వమే, సమాజ శ్రేయస్సు కోసము ఏర్పాటు చేసిన కట్టుబాట్లు, నీతి నియమములు మొదలైన వాటికి తన జీవన విధానములో వాటికి భంగము కలుగ కుండా వ్యక్తి శ్రేయస్సే సమాజ శ్రేయస్సుగా భావించి కర్తృత్వ రహిత కర్మాచరణతో ఇతరులకు ఆదర్శప్రాయుడై జీవించును. ఇట్టి విధానములో ఉండు మెళకువలు ఈశీర్షికద్వారా చెప్పబడుచున్నవి.

**కం॥ కోటి విధంబుల జెప్పిన। చేటొదవెటి తనదు పూర్వ చేష్టలు**
**విడకన్। చాటున నేటున ద్వివిధము। గాటన మొనరించు**
**నతని। కతుకునె బోధా॥ 170**

## ప్రతిపదార్థము

కోటి విధంబుల జెప్పిన = అనేక పర్యాయములు సందర్భాను సారంగా భుక్తి యుక్తి క్రియలకు సంబంధించిన అంశముల గూర్చి ఉపదేశిస్తున్న

చేటొదవెటి = నష్టము, కష్టము కలిగించేవి

తనదు పూర్వపు చేష్టలు = గతజన్మలో తనచే చేయబడిన వాసనా పరమైన ఆలోచనలు, క్రియలు

విడకన్ = విడిచి పెట్టలేక

చాటున = దొంగ తనముగా(గురువుకు తెలియ కుండా)

నేటున = గురుని ఎదురుగా

ద్వివిధముగా = రెండు విధములుగా

నటన మొనరించు అతనికి = జీవించు లక్షణము కలవానికి

అతుకునె బోధ=అచల పరిపూర్ణ భావము నందు ఆరూఢత సిద్ధించునా (సిద్ధించదు)

## తాత్పర్యము

పరిపూర్ణ బోధను వస్తునిశ్చయ పూర్వకముగా ప్రబోధించు సందర్భములో అట్టి భావమునందు ఆరూఢత పొందుటకు ఉండవలసిన యోగ్యమైన లక్షణములు, వుండకూడని అయోగ్యమైన లక్షణములు, అనేక పర్యాయములు వివరించుచున్నప్పటికి మార్పు చెందలేక, పరిపూర్ణ భావము ఆరూఢమగుటకు అవరోధముగా వున్న తన పూర్వజన్మార్జితమైన దోషములు విడిచిపెట్టలేక గురుని సమక్షమున ఒక విధముగా, పరోక్షంలో, మరొక విధంగా త్రికరణ శుద్ధి ప్రవర్తనకు భంగము కలుగునట్లు జీవించు లక్షణము కలవానికి పరిపూర్ణ బోధయందు ఆరూఢత సిద్ధించదు.

**కం॥ బంగారువంటియీ। బోధాంగీ కరణులను జేరి యదివినివారిన్। భంగపరచ దలచెడియా। వెంగళులకు జెప్పకుమని వేడెద నిన్నున్॥ 171**

## ప్రతిపదార్థము

బంగారు వంటి = శ్రేష్టమైనటువంటి
ఈ బోధాంగీ కరణులను = ఈ పరిపూర్ణ బోధయందు కృషిచేయువారు
చేరి = సమీపించి
అది విని = వారు కృషిచేయు విధానమును గుర్తించి
వారిన్ = అట్టి పరిపూర్ణ భావజ్ఞులను
భంగ పరచ దలచెడి = అవమాన పరచగలిగెడి , హేళన చేయగలిగే లక్షణంకల
ఆ వెంగళులకు = అటువంటి అజ్ఞానులకు లేక మూర్ఖులకు
చెప్పకుమని = పరిపూర్ణ భావమును, దీని విశిష్టతను చెప్ప వలదని
వేడెద నిన్నున్ = నిన్ను గట్టిగాహెచ్చరించు చున్నాను

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ భావము

శ్రేష్టమైనదిగా చెప్పబడుచున్నది. ఇట్టి మార్గమును పూర్వపుణ్య విశేషముచే ఆశ్రయించి కృషి చేయుచున్న మహనీయులను కొందరు అల్పులు వారి నాశ్రయించి వారు వివరించు బోధను విధానమును, హేళన లేక అపహాస్యము చేయు లక్షణము కలిగిన మూర్ఖులయందు ఈ మార్గమును ఏ పరిస్థితుల్లోనూ తెలియ పరచవలదని నిన్ను హెచ్చరించు చున్నాను.

**కం॥ ప్రాకటముగ నిద్దురయిక। యేకథలను వినినరాదు యీ బోధందున్ రాకుండదేమిచిత్ర మొ॥ ప్రాకృత నరమూకకెల్ల పావన చరితా॥ 172**

## ప్రతిపదార్థము

పావన చరితా = పవిత్రమైన పుణ్యసంస్కారములు కలవాడా!
ప్రాకటముగ = స్పష్టముగా
నిద్దుర = నిద్రావస్థ
ఇక ఏకథలను వినినరాదు=విషయ వాసనతో కూడిన, సంభాషణలందు వినినరాదు
ఈబోధందున్ = పరిపూర్ణ బోధను గురుముఖత: వినే సందర్భంలో
రాకుండదేమి = ఏవిధముగా వస్తుంది
చిత్రమొ = ఆశ్చర్య కరమైన అంశము రాకుండ ఉండదు
ప్రాకృత నరమూకకెల్ల = పూర్వజన్మ యందలి అజ్ఞాన దోషముచే ప్రేరేపింప బడుతున్నవారు

## తాత్పర్యము

పరమ పవిత్రమైన పుణ్యసంస్కారముగల ఓ శిష్యుడా! విషయ వాసనా సంబంధమైన సంభాషణలు విన్నపుడు అజ్ఞాన విశిష్ఠమైన నిద్ర వచ్చు చున్నను విషయ స్పర్శ ప్రభావముచే అట్టి లక్షణములు పోయి, జాగ్రత్త కలిగి విషయములందు ఆసక్తి కనబరచును. పరిపూర్ణ భావమును గురుముఖత:విచారణ చేయు సందర్భములో అజ్ఞానాశ్రితమైన నిద్ర అప్రయత్నముగా కలిగి బోధ శ్రవణ విధానమునకు భంగము కలిగించును. దీనికి కారణ మేమనగా వారి పూర్వ జన్మ సంస్కార ప్రేరణచే పరిపూర్ణ

బోధను శ్రద్ధగా వినుటకు వీలు కలిగించక నిద్రరూపములో ఆటంక పరచు చుండును అని తెలియ వలెను.

**కం॥ క్రొత్త దంపతుల కూటమి। నెత్తెరగునలేమలంత। నిదురలు బోకన్। మొత్తములై కనునటువలె। బత్తలదిరిగేటి చిన్ని బాలల కగునే॥ 173**

## ప్రతిపదార్థము

కొత్త దంపతుల కూటమి = నూతనముగా వివాహ సంస్కారముచే స్త్రీ పురుషు లిరువురు భార్యా భర్తలుగా మారి జీవించునపుడు
ఎత్తెరగున = ఏ విధముగా
లేమ లంత = ఒకరి నొకరు విడిచి వుండక
నిదురలు బోకన్ = అజ్ఞానాశ్రితమైన నిద్రావస్థలు చెందక
మొత్తములై = ఒకరితో ఒకరు కలిసి మెలసి
కను = జీవించెదరు, కనిపించెదరు
అటువలె = ఆ విధముగా
బత్తల తిరిగేటి = అపరిపక్వమైన బాల్యావస్థలో నున్న స్త్రీ, పురుషులు
చిన్నిబాలలు = బాల్యములో నున్నవారు
అగునే = పైన పేర్కొన్నవిధంగా జీవించ గలుగుతారా

## తాత్పర్యము

చంద్రుడు షోడశ కళా ప్రపూర్ణుడై దిన దిన ప్రవర్ధమానమై ప్రకాశించు చుండును. ఆ విధంగానే జీవుడు 16 సంస్కారములచే పరిపక్వమైన జ్ఞాన ప్రాప్తిని పొందును. ఆగమ, నిగమ, శాస్త్రాను గుణ్యముగా కర్మానుష్టానమును చేయించి, శరీరమును మనస్సును శుద్ధి యొనర్చి, పరిపక్వత చెందుటకు ఇవి సహకరించును. ఇవి గర్భా దానము, పుంసవనము, సీమంతము, జాతకర్మ, నామ కరణము, అన్నప్రాసన, చేలము, ఉపనయనము, నాలుగు వేద వ్రతములు, సమావర్తనము(స్నానము) సహధర్మచారిణీ సంయోగము,(వివాహము) దేవ,

పితృ, మనుష్య, భూత,బ్రహ్మ యజ్ఞములను పంచమహా యజ్ఞములు మున్నగునవి22గా చెప్పబడుచున్నవి. ఇందు వివాహమనునది ఉన్నతమైన సంస్కారము. మిగిలిన సంస్కారము లన్నిటికీ ఇది కేంద్రమై ఉన్నది. ఏకాకి గానున్నపురుషుడు అపూర్ణుడు. భార్యా సమేతుడై ఉన్నపుడే కర్మానుష్టానమునకు యోగ్యుడగును. మానవుడు ముఖ్యమైన మూడు ఋణములతో పుట్టు చున్నాడు అందు పితృ ఋణము చాలా బలమైనది. సంతాన వంతుడై వంశాభివృద్ధిని కలిగించిన గాని ఈ ఋణము తీరదు. ఇందుకు వివాహము అవసరమై ఉన్నది. మానవ జీవితమునకు చతురాశ్రమములు ముఖ్యమైనవిగా చెప్పబడుచున్నవి. జీవితము నందు మొదటి భాగము గురు కులము నందు, రెండవ భాగము గృహస్థజీవితమునందు, మూడవ భాగము వాన ప్రస్థమందు, నాల్గవ భాగము సన్యాసమునందు వినియోగించ వలెనని మనుశ్రుతి చెప్పుచున్నది. ఇందు గృహస్థాశ్రమము ప్రముఖమైనది. ఇహ పర సుఖములకు కేంద్రమై ఉన్నది. శరీర నిర్మాణమందు సృష్టి కామన కొరకు "కామము" అను ఒక బలీయమైన శక్తి ఈశ్వర సృష్టి చే ఏర్పరచ బడినది. శరీరము నిలబడుటకు ఆహారము ఎంత ముఖ్యమైనదో అట్లే కామము కూడా ముఖ్యమై ఉన్నది. ఈ అవసరము తీర్చునది వివాహము. మానవుని ధర్మ బద్ధమైన కోరికగా అనుభవనీయుమగుటకు వివాహ సంస్కారము ప్రముఖముగా చెప్పబడుచున్నది. కోరిక లన్నిటిలో సంతానము కావలెననే కోరిక బలీయమైనది. ఇట్టి వివాహములు 8 రకములుగా చెప్పబడుచున్నవి. బ్రహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, అసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములు. ఆ విధముగా వివాహ వ్యవస్థను ఏర్పాటు చేసి ఒక సమగ్రమైన జీవన విధానము శాస్త్రమునందు రూప కల్పన కావింప బడినది. స్త్రీ పురుషు లిరువురు శరీర మనో వికాసములు కలిగి వివాహ బంధముచే ధర్మ పద్ధతిగా భార్యా భర్తలుగా పరిణతి చెంది సత్ సంతానాపేక్షచే ఒకరిచే నొకరు ఆకర్షితులై సహజీవనము గావించిన గాని సంతానాపేక్ష తీరదు. ఈ శరీరము, వయస్సు, మనస్సు పెరుగు తున్నకొలది తీవ్రత చెంది యుండును. ఇది

ఒకరి నొకరు ఎడబాటు చెందలేనంత స్థాయికి చెందినగాని సంతానాపేక్ష ఫలప్రదముకాదు. ఇట్టి తీవ్రత శరీరము, మనస్సు, వయస్సు వికసించని వారియందు ఉండజాలదు. ఈ ఉదాహరణను ఈ పద్యమునందు ఈ రచయిత మనకు వివరించుటలో ఒక రహస్య భావము ఇమిడి ఉన్నది. మానవో పాధి పరిపక్వతలో ఉత్తమ పురుషార్ధము మోక్షప్రాప్తియే (జనన మరణ భ్రాంతి రహిత విధానము) ఇట్టి విధానము పరిపూర్ణ బోధచేతనే సిద్ధించగలదు. ఇట్టి బోధస్థితి గురుకృపచేతగాని ఆరూఢపడ జాలదు. ఇట్టి గురు కృప పొందుటకు తద్వారా ఆశయ సిద్ధి కలిగించు కొనుటకు శిష్యుడు విధిగా గురుని ఆశ్రయించ వలసి యున్నది. వివాహ వ్యవస్థ ద్వారా భార్యా భర్తలు సహజీవనములో సంతానాపేక్ష ఎట్లు ఫలప్రదమగుచున్నదో ఆ విధంగానే జనన మరణ భ్రాంతి రహిత విధానము సాంప్రదాయ బద్ధమైన గురుధర్మమును, గురువును ఆశ్రయించుట, ఏతత్కృపకు చతుర్విధ శుశ్రూషలు పాటించి గురుకృప ద్వారా పరిపూర్ణ భావమునందు ఆరూఢత చెందుట అను అంశమును యిందు పోలికలుగా చెప్పబడుచున్నవి. విషయ నిరూపణ ధృఢపరచుకొన్న కొలది గురుశిష్యుల అవసరము, ప్రయోజనము పెంపొంది చివరిస్థితి ద్వారా ఫలప్రదము కాగలుగు చున్నది. దాంపత్య జీవితమందు గల యోగ్యత, పాత్రత(సంతానాపేక్ష కొరకు) ఎట్లు ప్రముఖమైనవో అట్లే గురుశిష్యుల యోగ్యత, పాత్రతప్రముఖమై ఉన్నవి. ఇట్టి వారినే వరగురు శిష్య శబ్ధముచే చెప్పబడుచున్నది. ఇట్టి పరిపక్వతలేని గురుశిష్యులను అపరిపక్వత కల్గిన దంపతులతో పోల్చబడుచున్నది. కావున ఈ పద్యమందు పరిపూర్ణబోధ ఆరూఢత చెందుటకు గురుశిష్యన్యాయములో సహజీవనము, పరిపక్వ భావము, ఆరూఢ చెందుటకు కావలసిన తీవ్రత, దాంపత్య జీవితముతో పోల్చి చెప్పబడుచున్నవని గ్రహించ వలెను.

**కం॥ మనసరయక ప్రజలను విను మని చదువకుబోధ। బాధయని**
**యిండ్లలో పనులన్ని యాదిజేసుక। చనియెదరా సమయ**
**మంద। సహ్యామునసుతా॥ 174**

## ప్రతిపదార్థము

సుతా = నాయనా
మన సరయక = అంత:కరణ వృత్తిని గమనించక
ప్రజలను = విన చూడవచ్చిన వారిని
వినుమని=ఈ గ్రంథము నందు నిర్ధేశింప బడిన పరిపూర్ణ బోధను వినవలసినదిగా
చదువకు బోధ = ఈ భావమును, గ్రంథమును చెప్పవలదు
బాధయని = చాలా కష్టముగా భావించి
యిండ్లలో పనులన్నీ = విషయ సంబంధమైన పనులన్నీ
యాది చేసుక = గుర్తు చేసుకొని
చనియెదరు = వాళ్ళ వాళ్ళ గృహములకు పనుల నిమిత్తం వెళ్ళిపోతారు
ఆ సమయము నందు = ఇట్టి మహోన్నతమైన అవకాశమును విడిచిపెట్టి
సహ్యాముున = ఇష్టములేక

## తాత్పర్యము

పరమ పురుషార్థమైన జనన మరణ భ్రాంతి రహిత విధానము నందు కృషి చేయ వలెననెడి సంకల్పము, శ్రద్ధ పూర్వ జన్మ పుణ్య విశేషము మాత్రము చేతనే కలుగును. ఇట్టి విలువైన భావమును కృషి చేయు విధానమును తన వద్దకు వచ్చిన వారిని అంత: కరణ వృత్తిని, శ్రద్ధను గమనించి ప్రబోధించ వలసి యున్నది. ఏలననగా పూర్వ పుణ్య పరిపక్వత లేనివారికి ఇట్టి భావమును చెప్పబూని నపుడు చికాకు పడి, తమ అయిష్టతను తమ గృహములలో గల విషయ సంబంధమైన పనులను గుర్తుకు తెచ్చుకొని ఈ స్థానమును విడచి వెళ్ళెదరు. కావున పాత్రా పాత్రతలను గమనించి ఉన్నతమైన ఈ పరిపూర్ణ భావమును ప్రబోధించుము.

**కం॥ వీనుల వినడీ బోధను। నేనే బ్రహ్మనని నిక్కి నీల్గెడి వాడున్।**
**మానికముగానవచ్చిన దానిని రాయనుచు దలచు। తార్కికునిగతిన్॥** **175**

## ప్రతిపదార్థము

వీనుల = చెవుల కింపుగా
వినడీ బోధను = పరిపూర్ణ భావమును వినుటకు యిష్టపడడు
నేనే్బ్రహ్మనని నిక్కినీల్గెడి వాడు = పరిపక్వమైన అహంకారవిశిష్టముచే అతిశయము గలిగి, అదియే చరమ లక్ష్యముగా భావించేవాడు
మానికము కానవచ్చిన = నవరత్నములలో విశిష్టమైన మాణిక్యము తనచేతికి సంక్రమించినపుడు
దానిని = అట్టి విలువైన వస్తువును
రాయనుచు తలచు = రాయిగా భావించు
తార్కికునిగతిన్ = తర్క శాస్త్రమునందు ప్రావీణ్యత గలిగిన వారు

## తాత్పర్యము

చెవులకు వినసొంపు గలిగి జన్మ కర్మల భ్రాంతి నుండి విముక్తి కలిగించు(అహంపదార్ధ రహిత:)ఉన్నతమైన భావము కలిగిన ఈగ్రంథమును మహదహంకార స్వరూపులై అహంకార విశిష్టత కలిగిన బ్రహ్మవేత్తలు, వినుటకు యిష్టపడరు. ఏలననగా ఇది వారి ఉనికిని వాస్తవమును, ప్రశ్నించి, తర్కించి విడిపించును. ఈ విధానమెట్లున్న దనగా పృధివీ భూత సంబంధమైన కఠినాంశముతోకూడి రాయిగా వునికి కలిగిన దానిని, సానబెట్టి, రత్నముగా మార్చినను తర్క శాస్త్రమునందు ప్రావీణ్యము కలిగినవారు దానిని రాయిగానే భావించెదరు గాని విలువలు గమనించలేరు.

**కం॥ ఒకరు విని మెచ్చవలెనని। సకల పురాణములు వేదశాస్త్రశ్రౌత।**
**ప్రకరమును నేర్చు విద్య। న్నికరంబీ బోధమెచ్చ నేర్చునె**
**సుమతీ॥ 176**

## ప్రతిపదార్థము

సుమతీ = మంచిబుద్ధిగలవాడా
ఒకరు విని మెచ్చవలెనని = తాను చెప్పువిషయములకు యితరులు సంతోషించి తన్నుగొప్పవానిగా గుర్తించ వలెనని

సకల పురాణములు = సమస్తమైన పురాణములు
వేదశాస్త్రశ్రౌతప్రకరమును = నాలుగు వేదములు, 6 శాస్త్రములు, 1180 ఉపనిషత్తులు, యజ్ఞములు, శ్రౌతకర్మలు
నేర్పు = నేర్చుకొని
విద్వన్ని కరంబు = విద్వాంసులు, లేక పండితులు
ఈ బోధ మెచ్చనేర్చునె = ఉన్నతమైన పరిపూర్ణ భావము వినుటకు ఇష్టపడరు

## తాత్పర్యము

అష్టమదములలో పాండిత్యమనునది ఒకటి. నాలుగు వేదములు, 6 శాస్త్రములు, 18పురాణములు, వాటికి ఉప పురాణములు, 1180 ఉపనిషత్తులు, యజ్ఞములు, యాగములు, మున్నగు శ్రౌత కర్మల యందు ఆసక్తి కలిగి వాటియందు పాండిత్యమును సంపాదించి, అట్టి గొప్పతనముతో పేరు ప్రఖ్యాతులు, ధనము సంపాదించులక్షణము కలిగినపండితులు జన్మ కర్మల భ్రాంతి నుండి విముక్తి కలిగించు అచల పరిపూర్ణ బోధను వినుటకు యిష్టపడరు. దీని విశిష్టతను అంగీకరించరు.

**కం॥ సాధారణముగ దెల్పకు। మీధర మానవుల బిల్చి యీ బోధను।**
**బల్ మేధానిధి యాచించిన బోధించుమువద్దు లోభబుద్ధి సుబుద్ధీ॥ 177**

## ప్రతిపదార్థము

సుబుద్ధి = మంచిబుద్ధి కలవాడా!
సాధారణముగా = సర్వసామాన్యమైన విషయముగా
తెల్పకు ఈ బోధను = ఉన్నతమైన ఈ పరిపూర్ణ భావమును ఉపదేశించకు
ఈధరమానవులను పిల్చి = ఈ ప్రపంచమందు విషయలోలత్వము కలిగిన మానవులను చేరదీసి
బల్ మేధానిధి యాచించిన = పూర్వజన్మ సంస్కారముచే ప్రేరేపింపబడి ధర్మపద్ధతిగా గురువును ఆశ్రయించిన వానికి

బోధించుము=అచల పరిపూర్ణ భావము యొక్క విలువను వివరించి వుపదేశించుము
వద్దు లోభ బుద్ధి = అట్టి వాని ఎడల ఎట్టి సందేహమును పడవలదు

## తాత్పర్యము

పూర్వపుణ్య విశేషముచే బుద్ధి ప్రచోదింపబడి జనన మరణ భ్రాంతి రహిత విధానము నందు తీవ్రమైన ముముక్షత్వము కలిగి గురునాశ్రయించిన వానికి వాని ఎడల ఎట్టి సందేహము, అనుమానము పడక, ఉన్నది ఉన్నట్లుగా ఈ భావమును వారి కుపదేశించవలెను. సర్వసాధారణమైన మానవులను విని, చదువ మనుట కూడనిదిగా భావించుము.

**కం॥ ఏబోధ శిష్యులకు గల। యా బాధల నణచివేయు నదెసద్భోధౌ।
ఆబోధయేది యనినను। యీబోధే సుమ్మి దీన్ని యిక
విడువకుమీ॥ 178**

## ప్రతిపదార్థము

ఏ బోధ = ఉన్నతమైన పరిపూర్ణ భావము
శిష్యులకు గల బాధల నణచివేయు = తన్నాశ్రయించిన వారికి జన్మ కర్మల భ్రాంతి నుండి విముక్తి కలిగించు
అదె = అట్టిదె
సద్భోదౌ = శ్రేష్ఠమైన మార్గముగా చెప్పబడుచున్నది
ఆ బోధ ఏది అనినను = అట్టి శ్రేష్టమైన మార్గము ఏది యనగా
ఈ బోధేసుమ్మీ = ఇట్టి పరిపూర్ణ భావమే సుమీ
దీన్నింక విడువకుమీ = దీనియందు ఎట్టి నిర్లక్ష్యము కలిగి వుండకుము

## తాత్పర్యము

మానవజన్మ తరుణోపాయమునకు, మతకర్తలచే అనేక మార్గములు సమాజమునందు ప్రతిపాదింపబడుచున్నవి. వాటియందు శ్రేష్టమైనది, అందరికీ అందుబాటులో వున్నది ఈ పరిపూర్ణ భావమని

తెలిసి కొనుము. కావున దీనియందు ఎట్టి నిర్లక్ష్యము లేక శ్రద్ధ కలిగి యుండుము.

**కం॥ హెచ్చైనబోధదెల్పే। సచ్చరితుల కియ్యలేరు జనులు ధనంబుల్।**
**గచ్చుల గొట్టేదిచ్చుల। కిచ్చిన క్రియనిట్టి నృతతి। నేమననోయీ॥179**

## ప్రతిపదార్థము

హెచ్చైన బోధనుదెల్పే సచ్చరితులకు = అత్యంత విలువైన భావము కలిగిన పరిపూర్ణ బోధను ఉపదేశించు మహాత్ములకు
ఇయ్యలేరు జనులు ధనంబుల్ = జీవనాధారమైన ధనమును దక్షిణ రూపముగా యిచ్చుటకు అంగీకరించరు
గచ్చులు కొట్టేదిచ్చులకు = అనేక భావ దోషంబులు కలిగి గొప్ప తిప్పలు పడే మాయాగురువులకు
ఇచ్చిన = ఇచ్చినట్టి
క్రియ = పనిని విధానము, పద్ధతిని
ఇట్టి నృతతిని = ఇటువంటి ప్రజాసమూహమును
ఏమననోయి = వారిని గూర్చి ఏమని వివరించ గలను

## తాత్పర్యము

శ్రేష్టమైన జన్మకర్మలు తొలగించుటకు సులువైన మార్గముగా చెప్పబడుచున్న పరిపూర్ణ భావమును, లోక కల్యాణము కొరకు వుపదేశించు గురువులకు దక్షిణ రూపముగా, జీవాధారమైన ధనమును, సంపదను తమకు సంక్రమించిన దానిలో కొంతైనా యిచ్చుటకు జనులు యిష్ట పడరు. ఆడంబరములతో మోసపుచ్చే లక్షణము కలిగి భ్రాంతి విస్తారకములగు మార్గములను ప్రబోధించే మాయాగురువులకు వారు కోరిన ధనము నిచ్చుటకు అంగీకరించెదరు ఇట్టి వారిని గూర్చి ఏమని చెప్పదగును.

**కం॥ కాకులవలె కూకలిడే। లోకులకీకలకు బెదిరి లోగుందకటన్।**
**మూకత్వమూనుచాలు। వివేకుడవయ్యుం టివేని వినినామాటా॥180**

## ప్రతిపదార్థము

కాకులవలె కూకలిడె=కాకులవలె అప్రస్తుతముగా మాటలాడే లక్షణము కలిగిన
లోకుల కీకలకు = సామాన్యుల మాటలకు
బెదిరి = భయపడి
లోగుందకటన్ =ఏవిధమైన మనస్తాపము చెందకు
మూకత్వమూను = మౌనంవహించుము
చాలు = పరిపూర్ణస్థితివిధానం సరిపోవును
వివేకుడవయ్యింటివేని = పరిపూర్ణబోధ ద్వారా జీవించు విధానము ధృఢపరచుకొన్న ఎడల
వినినామాటా = నే చెప్పిన విధానం నీకు సరిపోయిన ఎడల

## తాత్పర్యము

ప్రపంచమునందు కాకి అనేజీవి ప్రయోజనం ఉన్నా లేక పోయినా ప్రయత్నపూర్వకంగా పదే పదే తన మానసిక భావమును, నోటి అరుపు ద్వారా వ్యక్తపరచు చుండును. ఇది సమాజమునకు భరింపరాని వైనను సహించుట కలవాటు పడెదరు. ఈ విధంగానే వాసనత్రయమునందు ముఖ్యముగా చెప్పబడుచున్నది, లోక వాసన; లౌకికమైన విషయ వాసనలందు ప్రయోజనం ఉన్నాలేకపోయినా, ఇతరుల యందలి లోటు పాట్లను, పదే పదే సామూహికముగా చర్చించుచుండును. దీనివలన వ్యక్తి మనస్తాపము చెంది దు:ఖపడును. ఈ విధముగా దు:ఖమునకు కారణమగుట చేత లోకులకు భయపడి జీవించుట జరుగుచున్నది. తద్వారా, లోకవాసనగా ప్రసిద్ధి గాంచినది. పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెందినవాని లౌకిక జీవనము, యితరులకు ఆదర్శప్రాయముగాను, అనుసరణీయముగాను ఉండజాలదు. వారిజీవన విధానమునకు భిన్నము గాతోచబడును. అట్టి ఎడల వారు వీరిని పరిహసించుట జరుగును. ఇట్టి సందర్భమునందు మనస్తాపము చెందకవారిని సమాధాన పరచుటకు ప్రయత్నించక మౌనము పాటించుట వివేకవంతుల లక్షణముగాను పరిపూర్ణ

బోధ యందు స్థితికలిగి వున్న మహాత్ముల జీవన విధానము గాను చెప్పబడుచున్నది. ఇట్టి ఆరూఢ విధానము గురు ప్రబోధ చేతనే దృఢ పడగలదని, గురువాక్యాను సారముగా జీవించు లక్ష్యమునందు ఈ విధానము చాలా అవసరమని చెప్పబడుచున్నది.

**కం॥పెద్దలనెవరిని జూచిన ముద్దుగ మాట్లాడి వారు।మదమున జెప్పే। సుద్దుల కడ్డము జెప్పక। వొద్దికతో మ్రొక్కివినుము। వోపుణ్య తమా ॥ 181**

## ప్రతిపదార్థము

ఓ పుణ్యాతమా = ఓ పుణ్యాసంస్కారముల ప్రభావము కలవాడా!
పెద్దలనెవరిని చూచిన = పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెందిన మహాత్ములు ఎవరు ఎదుట పడినా
ముద్దుగా మాట్లాడి = ప్రేమపూర్వకంగా వారితో మాట్లాడి
వారు = అట్టి మహనీయులు
ముదమున = ప్రేమతో
చెప్పేసుద్దులకు = ప్రబోధించే ఉపదేశ వాక్యములకు
అడ్డము చెప్పక = ఎట్టి అభ్యంతరమును, అశ్రద్ధను చూపించక
ఒద్దికతో = ఓపికతో, శ్రద్ధతో
మ్రొక్కి = సాష్టాంగ నమస్కారముచేసి
వినుము = పాటించుము, గ్రహించుము

## తాత్పర్యము

పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెంది, అందుకనుగుణ్యాంగా అశరీర పద్ధతిలో, జీవన యాత్ర గడుపుచున్న మహాత్ములు నీ నిజ జీవితములో ఎదురుపడినపుడు, భక్తి శ్రద్ధలతో సాష్టాంగ నమస్కారముచేసి ప్రేమపూర్వకమైన భక్తి తో వారిని పలకరించుము. అట్టి యెడల వారు నీయందు ప్రసన్నులై అనుగ్రహ పూర్వకముగా, అనుభవ పూరితమైన భావములను అత్యంత శ్రద్ధా భక్తులతో వినమ్రుడవై, వినవలసినదిగా,

రాశీభూతమైన పుణ్య సంస్కారములు గల నిన్నుకోరుచున్నాను.

**కం॥ తనహితమెరుగని మనుజుడు। వినడాప్తజనోక్తి దుష్ట వృత్తి గలసుయోధనుడు। దశాననుడు విహితజన వాక్యము వినక కాదె సమసిరిరువురున్॥ 182**

## ప్రతిపదార్థము

తనహితమెరుగని మనుజుడు=తన వున్నతిని, మంచిని కోరుకొనని మానవుడు
వినడు = పాటించడు
ఆప్తజనోక్తిని = అత్యంత సన్నిహితులై తనశ్రేయస్సు కోరే తల్లి, తండ్రి, గురువు, స్నేహితులు, భార్య మున్నగువారు చెప్పే మంచిని
దుష్ట వృత్తి గల సుయోధనుడు = స్వార్థ పూరితుడైన దుర్యోధనుడు
దశాననుడు = 10 తల కాయలు గలిగిన రావణుడు
విహిత జన వాక్యము వినక కాదె = తమ హితము కోరి పెద్దలు చెప్పే విధానము పాటించక పోవుట మాత్రము చేతనే
సమసిరిరువురున్=అనేక కష్ట నష్టములకు గురియై నశించి పోయినారు గదా!

## తాత్పర్యము

తన్ను తాను సంరక్షించుకొని ఆత్మోపలబ్ధి పొందుట మానవునకి సహజమైన స్వధర్మమై వున్నది.ఇట్టి సహజత్వమునందు ఉన్నతిని కోరి తల్లి దండ్రులు, గురువులు, స్నేహితులు, భార్య మొదలైన వారు ఆయా సందర్భాను సారముగా కావల్సిన సలహా సంపత్తులు అందించి తన ఉన్నతికి తోడ్పడెదరు. అట్టి విధానము పాటించి ప్రయోజనము పొందినవారు, పాటించక నష్టము పొందినవారు చరిత్రయందు కలరు. పాటించక తమే కాక వంశవినాశనమునకే కారకులైన వారిగా చరిత్రయందు, రామాయణమునందు రావణాసురుడు భారతమునందు దుర్యోధనుడు ప్రసిద్ధులై వున్నారు.కనుక దీనిని పోలికగా గైకొని, నీమేలు కోరి, నీయందు ప్రేమచేత పెద్దలు నీకుపదేశించిన విధానము, ఎట్టి నిర్లక్ష్యము చేయక పాటించ వలసినదిగా తెలియుము.

**కం॥ హద్దుసుమీ గురువాజ్ఞన। ముద్దుసుమీ గురుని సేవ। ముదమున।
జేయన్। పద్దుసుమీ యిట్లుండుట వద్దుసుమీ గురుని తోటి।
వాదించుటయున్॥ 183**

## ప్రతిపదార్థము

హద్దు సుమీ గురువాజ్ఞను = గురువు నియోగించిన జీవనవిధానమే నీకు సరిహద్దు కాగలదు
ముద్దు సుమీ గురుని సేవ = 4 శుశ్రూషలు నిరంతరం పాటించుటయే
ముదమున చేయన్ = ప్రేమతో, భక్తితో చేయదగినది
పద్దు సుమీ యిట్లుండుట=ఈ విధముగా జీవించుటయే సంతోషముగా నుండును
వద్దుసుమీ గురునితోటి వాదించుటయున్ = బోధనాపద్ధతియందు తన ఉపదేశగురువుతో వాద ప్రతివాదములు చేయకూడదు

## తాత్పర్యము

ఈ పద్యమునందు శిష్యుని జీవన విధానము లక్ష్మణ రేఖవలె నిర్దేశింపబడు చున్నది.

1) గురుర్వాక్యంయధా తధాగా జీవించుట.

2) గురుమూర్తికి స్థాన, అంగ, ఆత్మ, భావ శుశ్రూషలు అత్యంత భక్తి శ్రద్ధలతో చేయుట.

3) నిత్యసంతుష్టుడై అపూర్వమైన పరిపూర్ణ భావమందు స్థితి కలిగియుండుట.

4) బోధనాపద్ధతి యందు తన గురుమూర్తితో ఎట్టి వాదోప వాదములకు లోనుకాకుండుట.

పై లక్షణములన్ని శిష్యుడు నిజ జీవితమునందు విధిగా పాటించవలసినదిగా తెలియ వలెను.

**కం॥ జంభాల పోతుగోరునె। సంభవ నాశములబాపు। చక్కనిబోధన్
కుంభిని షండునకుండెనె। రంభాసంభోగవాంఛ రంభను
గనినన్॥ 184**

## ప్రతిపదార్థము

జంభాలపోతు = డాంబికమైన మాటలుచెప్పేవాడు
కోరునే = కోరుకుంటాడా, పాటిస్తాడా
సంభవ నాశనములు బాపు చక్కనిబోధను = జనన మరణ భ్రాంతిని రహితపరచు విధానము కలిగిన పరిపూర్ణ బోధను
కుంభిని = ఈ భూమియందు
షండునకు = న పుంసకునకు
వుండునె = వుంటుందా
రంభా సంభోగ వాంఛ రంభను గనినన్ = స్వర్గలోకమందు నివసించు రంభ తనకెదురుపడినపుడు కలిసి ఆనందించాలనే కోరిక వుంటుందా

## తాత్పర్యము

జనన మరణములు రద్దు పరచ గలుగు నిర్దుష్టమైన బోధనా విధానము కలిగిన పరిపూర్ణ భావము పూర్వ పుణ్య విశేషముచేత మాత్రమే పొంద దగినదిగా నుండును. డాంబికమైన జీవన విధానముచే ఆచరణాత్మకమైన, ఆదర్శవంతమగు పవిత్రజీవనము లేని వారికి ఇది దుస్సాధ్యము. ఎట్లనగా పెక్కు సత్కర్మలు చేసి స్వర్గప్రాప్తి పొందిన వారికి మాత్రమే అతిలోక సౌందర్యవతియైన రంభతో కలిసి జీవించు అదృష్టము కలుగును. నపుంసకునికి అట్టి అదృష్టము సంభవించినా ఎట్లు నిష్ప్రయోజనము అగునో ఆవిధముగానే పరిశుద్ధ జీవనము లేనివారికి ఈ ప్రబోధ ఫలప్రదము కాదు.

**కం॥ ఎందరు దూషించితె యేమందరు మనవారెకాని। యన్యులెనీవా। యందరితో వాదించక। నందంబౌ నిట్టి బోధనరయర తండ్రీ॥ 185**

## ప్రతిపదార్థము

తండ్రీ = నాయనా
ఎందరు దూషించితే ఏమి = లౌకిక దృష్టితో అవగాహనా రాహిత్యముతో

ఒకరి నొకరు దూషించుకొనుట చేత ఏమీ ప్రయోజనము లేదు
అందరూ మనవారే = "మమాత్మా సర్వభూతాంతరాత్మ" అను దృష్టితో చూచిన అందరూ ఏకాత్మ స్వరూపులే కదా?
కాని అన్యులె = జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పాటించు క్రమములో మార్గములు వేరై వున్నవి
నీవు = వున్నతమైన పరిపూర్ణ భావమును దృఢపరచుకొన్న నీవు
అందరితో వాదించకు = తత్వత: ఒకటైవుండి భావనచే వేరైవున్న వారితో ఎట్టి వాద ప్రతి వాదములకు లోను కాక
అందంబౌ ఇట్టి బోధ = శ్రేష్టమైన పరిపూర్ణ భావము
అరయర = పాటించుము

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ బోధయే శ్రేష్టమైనదిగా అచల ఋషులచే సిద్ధాంతీకరింప బడుతున్నది. ఇది గాక యిదే అంశముపై ప్రపంచంలో భిన్నా భిన్న సిద్ధాంతములు ప్రచారములో నుండి ఒకరి భావముతో ఒకరు విభేదించి, పరస్పరము నిందించుకొనుచున్నారు. అంతటితో ఆగక శ్రేష్టమైన పరిపూర్ణ భావమును కూడా తప్పు పట్టుచున్నారు. యిన్ని రకములుగా ఎంతమంది చులకనగా ఆక్షేపించేలా చూడగలిగినా వారందరితో, నీవు మాత్రము విభేదించవలదు. ఏల ననగా వస్తుత: తత్వదృష్టితో చూచిన ఎడల, "మమాత్మా సర్వభూతాంతరాత్మ" అను సూత్రాను సారముగా అందరూ ఏక స్వరూపులై వున్నారు. లక్ష్య నిర్ధేశములో భావనలు మార్గములు మాత్రమే వేరై వున్నవి. కావున అట్టి వారి స్థితిగమనించి, వారితో వాద ప్రతివాదములకు దిగక శ్రేష్టమైన పరిపూర్ణ భావము నందు ఉనికి కలిగి ఉండుము.

**కం॥ కోపమెపాపం బనబడు కోపమెహంకారమనుచు కొనియాడ**
**బడున్ కోపమె తాపంబనబడు। కోపమె మృత్యువనబడును।**
**కుటిల విరహితా॥ 186**

## ప్రతిపదార్థము

కుటిల విరహితా=బ్రహ్మవిద్యకు అవరోధముగానున్న అవగుణములు రహితపరచుకొన్న వాడా
కోపమె పాపంబనబడు = కోపగించుట పాపకర్మతో పోల్చబడుచున్నది
కోపమె అహంకారమనుచు కొనియాడబడున్ = ఈ కోపమె అహంకార రూపమైన గర్వమునకు కారణముగా చెప్పబడుచున్నది
తాపంబనబడు = ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆది దైవిక తాపములుగా చెప్పబడుచున్నది
మృత్యువనబడును = మరణమునకు కారణముగా చెప్పబడుచున్నది

## తాత్పర్యము

ఆకాశాంశ గుణములలో, కోపమనునది ఒక భాగముగా చెప్పబడుచున్నది. ఇది క్షణికము, శాశ్వతము అను రెండు విధములుగా చెప్పవచ్చును. పురుషులందు, మునులందు, మహనీయులయందు, దేవతలయందు క్షణికమైనదిగా చెప్పబడుచూ సృష్టివికాసమునకు కారణముగా చెప్పబడుచున్నది. అహంకార రూపమైన కోపము దీర్ఘకాలమై, కక్షకు, కార్పణ్యమునకు వీలుకలిగించి, ఎదుటివ్యక్తి పతనానికి కారణముగా నున్నది. ఇట్టి లక్షణము కలిగిన కోపమునే ఇందు ప్రముఖముగా పేర్కొనబడుచున్నది. ఇది పాపహేతువని, గర్వమునకు అహంకారమునకు మూలమైయున్నదని, ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక దు:ఖములకు కేంద్రమై వున్నదని, చివరకు మృత్యువునకు కూడా సన్నిహితమై వున్నదని తెలియవలసి వున్నది.

**కం॥ చెప్పదొడంగెను మునుతా। జెప్పని ముచ్చట్లు కొన్ని। సేమము కొరకై। యొప్పులకుప్పా। వేమా। యప్పాయనిదువ్వ కొనుచు। నతిదయతోడన్॥ 187**

## ప్రతిపదార్థము

అతిదయతోడన్ = అత్యంత ప్రేమ వాత్సల్యములతో
చెప్పదొడగెను = పెక్కు అంశములు, జీవనోపనార్థమై
మును = అంతకు పూర్వము
తా చెప్పని = తాను యిదివరలో చెప్పలేనివి
ముచ్చట్లు = మంచి సందేశములు
కొన్ని = యింకనూ మిగిలి యున్నవి
క్షేమము కొరకై = శిష్యుని యొక్క అభివృద్ధిని కాంక్షించుచూ
ఒప్పులకుప్ప = సుగుణాల రాశి
ఓమా అప్పా = ఓనా ప్రియమైన తండ్రీ
అని దువ్వ కొనుచూ=తనకు దగ్గరగా శిష్యుని చేరదీసుకొని వీపు నిమురుతూ

## తాత్పర్యము

శిష్యుని ఎడల అత్యంత ప్రేమాస్పదమైన అనుగ్రహముతో తనకు దగ్గరగా చేర తీసుకొని తన హస్తములతో వీపునిమురుతూ,సద్గుణరాశీ, సుగుణ సంపన్నా అని స్తుతిస్తూ, పరిపూర్ణబోధను దృఢ పరచుకొన్నమీదట జీవన విధానమునందు, ముఖ్యమైన అంశము శిష్యుని క్షేమముకోరి గురువు ఉపదేశించుటకు ప్రారంభించుచున్నాడు.

**కం॥ ఒప్పకుమీ పరబోధల। తప్పకుమీ బోధనెపుడు। దలచుట మదిలో। రొప్పకుమీ సచ్చిష్యుల। చెప్పకుమీ దీన్ని దుష్ట। చెనటుల కెపుడున్॥ 188**

## ప్రతిపదార్థము

ఒప్పకుమీ పరబోధల = భ్రాంతి కారకమైన ఇతర మార్గముల జోలికి వెళ్ళకు
తప్పకుమీ = శ్రద్ధ కలిగి యుండుము
బోధనెపుడు తలచుట మదిలో = గురు ప్రబోధను మనస్సులో ప్రతిక్షణము మననము చేయుటయందు

రొప్పకుమీ సచ్ఛిష్యుల=నిజమైన శిష్యులయందు ఎట్టి నిర్లక్ష్యమును కనబరచకు
చెప్పకుమీ దీన్ని దుష్టులచె నట్టుల = కపట ప్రవర్తన కలవారికి, అనగా త్రికరణ శుద్ధి పాటించని వానికి యిది తెలియజేయతగదు
ఎపుడున్ = ఏపరిస్థితులయందు కూడా

## తాత్పర్యము

ఈ పద్యము లందలి అంశములు శిష్యునికి లక్ష్మణ రేఖ వంటివి.

1) భ్రాంతి సహితమైన ఇతర మార్గముల జోలికి వెళ్ళకు
2) గురుర్వాక్యమును సర్వకాల సర్వావస్థలయందు మననముచేయుటలో ఎట్టి నిర్లక్ష్యము చేయవద్దు.
3) గురుధర్మ నిర్వహణలో శ్రేష్టులై వున్న మహనీయులతో సంతోషముగా మాట్లాడగలిగి యుండుట.
4) త్రికరణ శుద్ధి ప్రవర్తన లేక కపట మార్గమందు నటించువారికి ఈ భావమును చెప్పతగదు.

**కం॥ కూడకుమీ దుర్జనులను। వీడకుమీ సాధుమనుజ వితతి స్నేహం బోడకుమీ గురుసేవకు। పాడకుమీ పరులనింద। పాటలరీతిన్॥ 189**

## ప్రతిపదార్థము

కూడకుమీ దుర్జనులను = చెడు ప్రవర్తన గలవారితో స్నేహించుట తగదు
వీడకుమీ = విడిచిపెట్టకు
సాధుమనుజ వితతి స్నేహము = పరిపూర్ణ భోధయందు ఆరూఢత జెందిన మహనీయులతో పరిచయమును విడువవలదు
ఓడకుమీ గురుసేవకు=గురుసేవ చేయుటకు ఎట్టి సందేహము నకు లోను కాకు
పాడకుమీ పరుల నింద పాటలరీతిన్ = ఇతరులయందు దోషములను పాటలవలె మననము చేయకుము

## తాత్పర్యము

1) దుష్ట జనులతో స్నేహము కలిగి యుండకుము.

2) మహాత్ములతో స్నేహము విడిచి యుండకు.

3) గురు సేవ చేయుటకు ఎట్టి సంశయమును పొందకు.

4) యితరులయందు గల లోపములను పదే పదే స్మరించకు.

**కం॥ మీరకుమీ గురువాజ్ఞను। చేరకుమీ దుష్టులంత। చేరిన చోటన్।
దూరకుమీబోధనువిని। ఏరకుమీ సాధుజనుల యందున తప్పుల్॥190**

## ప్రతిపదార్థము

మీరకుమీ గురువాజ్ఞను=ఏ పరిస్థితులందు గురువు చెప్పిన విధానమును దాటవద్దు
చేరకుమీ దుష్టులంత చేరిన చోటన్ = దుష్ట జనులు చేరివున్న చోటువద్దకు వెళ్ళవలదు
దూరకుమీ బోధను విని = ఇతరులు ఎవరైనా ధార్మిక విషయమును చెప్పిన ఎడల విని వూరుకొని యుండుము
ఏరకుమీ సాధు జనులయందున తప్పుల్=మహాత్ముల నడవడికలో లోపములను ఎంచి చూడకు

## తాత్పర్యము

1)గురుమూర్తి ఆజ్ఞానుసారముగా జీవించి యుండుము

2) దుష్ట జనులు చేరివున్న చోటుకు దూరముగా వుండుము.

3) ధార్మికమైన విషయములు ఎవరైన వుపదేశించిన ఎడల విని ఊరకుండుము.

4) మహాత్ముల నడక యందు ఏ మైనా లోపములున్నను, వాటిని ఎంచి చూపకుము.

**కం॥ జనులవలె జరుపు పనులను। నినునిను జనవితతి దిట్ట
నడువకుమెవ్వుడున్ నిను నీవు బొగడుకోకుము।
నినుబోలరటంచు జనుల। నిందించకుమీ॥ 191**

## ప్రతిపదార్థము

జనులవలె జరుపు పనులు = ప్రపంచవ్యవహారములయందు అందరూ ప్రవర్తించినట్లుగానే, నీవును వ్యవహరించుము
నను, నిను = గురుశిష్యులుగా నున్న మనమిరువురిని
జన వితతి = లోకులందరు
తిట్ట = నిందించేలా
నడువకు మెపుడున్ = ఎట్టి పరిస్థితులందు ప్రవర్తించకు
నిను నీవు పొగడుకోకు = నీగొప్పతనమును నీఅంతట నీవే ప్రదర్శించుకోకు
నిను పోలరటంచు జనుల నిందించకుమీ = నీతో సమానస్థాయిలో యితరులు ప్రవర్తించుట లేదని ఆక్షేపించకు

## తాత్పర్యము

1) లౌకిక వ్యవహారములందు సమాజంలో అందరూ నడచినట్లుగా ప్రవర్తించు 2) గురు శిష్యులమైన మనమిద్దరినీ, జీవనవిధానమందు లౌకిక జనులచే ఆక్షేపణ కలిగేలా జీవించవద్దు. 3) నీ ప్రవర్తనను గొప్పతనాన్ని ప్రదర్శించుకోకు 4) నీతో సరిసమానముగా ఇతరులు జీవించుట లేదని ఆక్షేపించకు.

**కం॥ శ్రద్ధబోధందునిలిపి। అశ్రద్ధను నీనేర్పుచేత ఝాడించితివా।
బద్ధత్వమంతబాయును। బుద్ధికి సరిపడితెదీన్ని। బూనగదోయీ॥192**

## ప్రతిపదార్థము

శ్రద్ధ బోధందు నిలిపి = భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ బోధయే సరియైన మార్గముగా గుర్తించి అందు మనసు నిలిపి యుంచుము
అశ్రద్ధ = నిర్లక్ష్యము లేక అలసత్వము
నీ నేర్పు చేత = నీ ప్రవర్తనా విధానముచేత
ఝాడించితివా = లేకుండా చేసుకున్న మీదట
బద్ధత్వమంతాబాయును = జన్మకర్మల భ్రాంతి తొలగి పోవును

బుద్ధికి సరిపడితే = నీ ఆలోచనకుసరిపోతే, లేక నీకు నచ్చితే
దీన్ని పూనగదోయి = ఈ భావమునకు సరిపడా జీవితమును సరిదిద్దుకొని అందుకు సరిపడా ప్రవర్తించుము

## తాత్పర్యము

జ్ఞానము అనునది శ్రద్ధచేతనే లభించగలదని చెప్పబడుచున్నది. దీనినే తీవ్రముముక్షత్వముగా పేర్కొనవచ్చును. పరిపూర్ణ భావము సాధనాంతర నిరపేక్షమై గురుప్రబోధచేత మాత్రమేదృఢపరచుకొన వలసి యున్నది. స్వప్రయత్నము ఏమాత్రము పనికి రాదు. కావున గురువాక్యం యధాతధాగా మనస్సును ఆలోచనను, జీవితాన్ని సంస్కరించుకొని, నిర్లక్ష్యమును అలసత్వమును విడిచిపెట్టి, భ్రాంతి రహిత విధానమును స్థిరపరచుకొనుము. దీని వలన సర్వ భ్రాంతి రాహిత్యస్థితి చేకూరును. ఈ సూచన, సలహా నీకు సరిపడితే (అవసరమనిపిస్తే) పాటించవలసినదిగా కోరుచున్నాను.

**కం॥ సంశయమె జన్మ హేతువు। సంశయమే గురుని మాట చెవి గొనని యదీ। సంశయమె కీడు నొదవును। సంశయ మెడబాస్తి వేని। చాలును వత్సా॥ 193**

## ప్రతిపదార్థము

సంశయమే జన్మహేతువు = సందేహమే జన్మ కర్మలకు కారణమగుచున్నది
సంశయమే గురుని మాట చెవిగొననీయదు = సందేహమువలన గురుర్వాక్యము నందు దృఢత్వము కలుగ నీయదు
సంశయమే కీడు నొదవును = సందేహమే కష్ట నష్టములకు కారణమగును
సంశయమెడ బాస్తి వేని = సందేహములన్ని విడిచి పెట్టి తివేని
చాలును = ఆరూఢతకు సరిపోవును
వత్సా = నాయనా

## తాత్పర్యము

సంశయమనునది ఒక అపూర్వమైన సంస్కారము. శ్రవణ, మనన, నిధి, ధ్యాసల ద్వారా ఇది ఏర్పడును. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా పరిపూర్ణము వున్నది, ఎరుక లేనిది అను సూత్రము దృఢ పడుటకు లేని ఎరుక అవరోధముగా నుండి, భ్రాంతి కారకమగును. సంశయమనునది మనస్సునకు సంబంధించిన అంశము. గురువాక్యము నందు అచంచలమైన విశ్వాసమున్నగాని యిది తొలగదు. కావున ఇది జన్మహేతువుగా చెప్పబడుచున్నది. దీని వలన శక్తి వంతమైన గురుర్వాక్యంకూడా యధా తథంగా మనస్సులో ప్రవేశించదు. దీనివలన భ్రాంతి విస్తారమగును. కావున పరిపూర్ణము ఉన్నది ఎరుక లేనిది అను సూత్రము నందు యథా తథముగా గ్రహించి దృఢపరచుకొన్న ఎడల జనన మరణ భ్రాంతి రహిత స్థితి కలుగ గలదు.

**కం॥ నరులంత మెచ్చునడువను। హరిహర శతమఖామ రాదులకైనన్।**
**తరముగాదనగ మనకిక। తరమౌనన వశమెచూడు। ధాత్రిని పుత్రా॥ 194**

## ప్రతిపదార్థము

పుత్రా = కుమారా
ధాత్రిని = ఈ ప్రపంచమునందు
నరులు = లౌకిక జనులు
అంతా = అందరూ
మెచ్చి = సంతోష పడేలా
నడువను = నడచుట, ప్రవర్తించుట, జీవించుట
హరి హర విధ శతమఖామఖ రాదులైనా = బ్రహ్మ, విష్ణువు, దేవేంద్రుడు, మొదలైన దేవతలు
తరముగాదనక = సాధ్యము కాదని అనగా

మనకిక తరమౌనన=మానవో పాధికి చెందిన మనకి సాధ్యమౌతుంది, అనుట వశమె = చెప్ప వచ్చునా

## తాత్పర్యము

ప్రపంచము నందు అందరికీ నచ్చి, మెచ్చుకునేలా జీవించడం, లేక ప్రవర్తించడం అనునది సాధ్యముకాని అంశము. ఈవిషయంలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, దేవేంద్రుడు మున్నగు దేవతలకు కూడా సాధ్యము కాకున్నది. కావున సామాన్యమైన మానవో పాధికి చెందిన మనబోటి వారికి యిది దుస్సాధ్యమై యున్నది.

**కం॥ అందరిని చణుకుచుందురు। కొందరు దుర్మార్గవృత్తి కుటిల**
**జనంబుల్। అందరిని గిచ్చి కరుచుచు। మందలవలె**
**కోతులుండు। మాడ్కిని కుర్రా॥ 195**

## ప్రతిపదార్థము

కుర్రా = కుమారా
అందరినీ = సమాజంలో వారిని
చణుకు చుందురు = దూషించు చుందురు
కొందరు = కొంతమంది
దుర్మార్గ వృత్తిన్ = కుటిలవృత్తితో కూడిన దుర్మార్గులు
అందరినీ గిచ్చి కరుచుచు మందలవలె కోతులుండు = కోతులు సమూహముగా ఏర్పడి సామాన్య ప్రజానీకాన్ని బాధించు
మాడ్కి = విధముగా

## తాత్పర్యము

సమాజమందు కొందరు దుష్ట ప్రవృత్తి కలవారై సామాన్య ప్రజలను తమ మాట ప్రవర్తనలచే కష్టనష్టములకు గురిచేయు చుందురు. కోతులు గుంపులుగా ఏర్పడి, కరచి, గిచ్చుచు యితరులకు యిబ్బంది కలిగించునట్లుగా వీరి ప్రవర్తన కలిగి యుందురు.

# గురు నిర్ణయము

గురువు అనగా మార్గదర్శకుడని ఉపదేశకుడని తరింప చేయువాడని సామాన్యార్థము. బ్రహ్మవిద్య అంతయు గురుశిష్యన్యాయంలో పరంపరా ప్రోక్తమై ప్రకాశించు చున్నది. గురువు లేని విద్య గుడ్డి విద్య అని శాస్త్రము చెప్పలేనిది అటు వంటిది. బ్రహ్మ విద్యాశాస్త్రమునందు గురువులను ఎనిమిది తరగతులగా వివరించియున్నారు.

1) శాస్త్రమందలి శబ్దార్థములను బోధించువాడు బోధక గురువు
2) తత్వమును దర్శింపచేయువాడు వేదక గురువు
3) కామ్య కర్మలచేత ఇహపరములందు సుఖ దు:ఖములను కలిగింప చేయువాడు నిషిద్ధ గురువు
4) ఇహ పరములందు పుణ్య కర్మాచరణచే సుఖములను కలిగించువాడు కామ్యక గురువు
5) శమాది గుణములు కలుగ చేయువాడు సూచకగురువు
6) ప్రపంచ విషయములందు విరక్తిని కలిగించి బ్రహ్మ జిజ్ఞాస కలిగించువాడు వాచక గురువు
7) తత్వమసి వాక్యార్థ జ్ఞానము ద్వారా బ్రహ్మజ్ఞానమును కలిగించువాడు కారణ గురువు
8) నిత్యముక్తిని ఉపదేశించువాడు విహిత గురువు

ఈ ఎనిమిది లక్షణములకు వేరైయున్నవాడు పరిపూర్ణ బోధగురువు. ఇతడు పరంపరానుగతంగా గురువును ఆశ్రయించి ఉపదేశ క్రమంలో (పరిపూర్ణము ఎరిగి ఎరుకను ఎరిగి ఎరుకను) మాను సర్వభ్రాంతి రహిత స్థితియందుండి గురువు ఆజ్ఞాను సారముగా జీవించు విధానములో బోధాధికారియై యున్నవాడు మాత్రమే పరిపూర్ణ బోధను ఇతరులకు ఉ పదేశించుటకు అర్హునిగా చెప్పబడుచున్నాడు.

**కం॥ సదమలగురువెవరనిను। యిదిగో బయలిదు గోలేని యీ గురు**
**తెరిగే। టిదగు శరీరము దీనిని వదులు మనుచు నీకు జెప్ప**
**వచ్చినవారే॥ 196**

## ప్రతిపదార్థము

సదమల గురువు = ఉన్నది పరిపూర్ణమని లేనిది ఎరుక యని వాస్తవికముగా ఉపదేశించు లక్షణము కలిగినవాడు
ఎవరనిన = ఎవరనగా
యిదిగో బయలు = వస్తునిశ్చయపూర్వకముగా పరిపూర్ణ దర్శనమును
యిదిగో లేని యీ గురుతెరిగేటిదగు శరీరము =మూలములేని గుర్తెరిగే శరీరం యొక్క వస్తునిశ్చయ జ్ఞానమును
వదులు మనుచు = షోడశి వాక్యము ద్వారా విడిచి యుండుమని
నీకు చెప్పవచ్చిన వారె = నీకు ఉపదేశించి ఆరూఢత కలిగించిన వారె

## తాత్పర్యము

ప్రపంచమునందుగల అష్ట విధ గురువులలో అచల పరిపూర్ణ ప్రబోధను ఉపదేశించు గురువు శ్రేష్టుడై వున్నాడు. ఆ శ్రేష్టత్వము ఉపదేశించు విధానములో స్వత:సిద్ధమై వున్నది అచల పరిపూర్ణమని, దాని యందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్నది ఎరుక యని, వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచి లేని గుర్తెరిగే శరీరమును విడిచి యుండుమని, స్పష్టముగా ఉపదేశించువాడే అని తెలియ వలెను.

**కం॥ దిచ్చుతనపు శిష్యుని మది నొచ్చిన ధనమియ్యడనుచు**
**నూహించి మదిన్। యిచ్చకములాడబోకను।చచ్చెరఘూడించు**
**వాన్ని। సద్గురుడైతే॥ 197**

## ప్రతిపదార్థము

సద్గురుడైతే = శ్రేష్టమైన, ఆదర్శవంతమైన జీవన విధానము కలవాడైతే
దిచ్చుతనపు శిష్యుని = కపట చిత్తవృత్తి కలిగిన శిష్యుని
మది = మనస్సు
నొచ్చిన = బాధపడినచో
ధనమీయడు = దక్షిణ రూపముగా వస్తు వాహనములు తనకు సమర్పించడు

అనుచు = అనుకొని
వూహించి మదిన్ = పైవిధముగా శిష్యుని మనస్సు లెక్కలోనికి తీసుకొని
యిచ్చకములు = ముఖస్తుతి మాటలు
ఆడబోకను = మాట్లాడక
చచ్చెర ఝాడించువాన్ని=నిష్కపటముగా, అట్టి వానిని మందలించి సరిదిద్దును

## తాత్పర్యము

శిష్యుడనగా శిక్షణకు సిద్ధమైవున్నవాడు. భుక్తి ముక్తి క్రియలరెంటి యందు పరిపూర్ణత్వము సాధించుటలో ప్రవర్తన చాలాముఖ్యమై ఉన్నది. ధర్మ వర్తనయందు ప్రవర్తన యందు లోపముగా ఉన్నయెడల సాంప్రదాయ ధర్మమునకు హాని కలుగును. ధర్మాచరణ పరుడైన గురువు శిష్యుని ఎడల ఈ అంశములు గమనించి వానియందు గల లోపములు ఎత్తి చూపి, సరిదిద్ది పూర్ణాధికారిగా మలచును. ఇది సద్గురువు యొక్కలక్షణము. అట్లుకాక శిష్యుని నడక యందు లోపము ఎంచిన ఎడల అతని మనసులో కష్టము కలిగించుకొని, కానుకల రూపంలో ధన, కనక, వస్తు, వాహనములు సమర్పించడేమో నని భావించి సంస్కరించుటయందు ఎట్టి ఉపేక్షను వహించడు.

## నిజశిష్య నిర్ణయ పద్ధతి

వరిపూర్ణ భావమును వస్తునిశ్చయంపూర్వకముగా దృఢపరచుకొన్నమీదట (పరిపూర్ణమును ఎరిగి, ఎరుకను ఎరిగి ఎరుకను మాను) గురువాజ్ఞానుసారము మీదట స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తెరిగే ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదని దృఢపరచుకొని ఈభావము కలిగించుకొన్నగుర్తుని గురుదక్షిణగా సర్వార్పణ భావముతో గురువునకు సమర్పించి ఎట్టి నిర్ణయము చేయుటకు వీలుకాక వ్యవహార సత్తా కొరకు గుర్తును తిరిగి గురువుచేత పొందబడి తాను పొందిన మానసిక స్థితి(ఆరూఢత) దిగజారకుండా ఉండుటకు గురునిష్టయందే తదనంతర జీవితమును హెచ్చించుటకు గురునిష్టయందే నిలిచి యుండును. అనగా

ఉన్నది పరిపూర్ణము లేనిది ఎరుక యనిగాని తాను ఏమీలేననిగాని అను ఎట్టి భావమునకు లోనుగాక గురునిర్దేశించిన జీవన విధానమునే ప్రమాణముగా గైకొని ఆదర్శ వంతముగా స్వేచ్ఛగా ఎట్టి భ్రమ ప్రమలకు లోనుకాకుండా సర్వస్వతంత్రమై శేషజీవితము ఆనందమయమై శాంతి మయమై యుండులా జీవించును. అట్టి విధానము ఎట్లుండునో ఈశీర్షిక యందు గల క్రింది పద్యములలో చెప్పబడును.

**కం॥ గురుడు తన నెంతమెచ్చిన। వరశిష్యుడు లొంగితిరుగ**
**వలయును మదిలో। మురశి భయభక్తి లేకను। తిరిగిన**
**చేటొదవు నిజము। తెలియగదోయీ॥ 198**

## ప్రతిపదార్థము

గురుడు తన నెంత మెచ్చిన = పరిపూర్ణ భావమునుపదేశించిన గురువును చతుర్విధ శుశ్రూషలచే శిష్యుడు తననెంత మెప్పించి ప్రసన్నుడైవున్న అట్టి శిష్యుని ఎడల గురువుకు ఎంత అనుగ్రహము కలిగి గొప్పవానిగా, శ్రేష్టునిగా గుర్తించిన
వరశిష్యుడు = ఆచరణాత్మకమైన, నిరభిమాన పూర్వకమైన ఆదర్శవంతమైన జీవనము కలిగిన శిష్యుడు
లొంగి = నిరభిమానపూర్వకమైన వినయ విధేయతలు కలిగి
మదిలో = మనస్సులో
తిరగవలయును = జీవించవలెను, ప్రవర్తించ వలెను
మురసి = గురువు తనను గొప్పవానిగా శ్రేష్టునిగా గుర్తించినాడని సంతోషించి
భయ భక్తి లేకను = త్రికరణ శుద్ధి ప్రవర్తన, వినమ్రత లేక
తిరిగిన = నడచిన
చేటొదవు = చాలా కష్టనష్టములు కలుగును
నిజము = ఇది సత్యమైన విషయము
తెలియగదోయి = ఈ అంశము శ్రద్ధగా గమనించి పాటించుము

## తాత్పర్యము

పరిపూర్ణ సిద్ధాంతమునందు గురుశిష్యు లిరువురు ఆదర్శప్రాయులై తండ్రీ కొడుకుల అనుబంధముతో జీవించెదరు. త్రికరణ శుద్ధి రూపమైన తన ప్రవర్తనతో గురువును, శిష్యుడు మెప్పించిబోధయందలి రహస్యములను అనుగ్రహము ద్వారా పొందును. శిష్యుని ప్రవర్తన గురునకు సంతోషదాయకమై వుండును. ఇది వాస్తవమైనా, శిష్యుడు తన ప్రవర్తన యందు ఇంకనూ అత్యంత భక్తి శ్రద్ధలు కలిగి గురువాక్యము నందు జీవన విధానమందు అత్యంత జాగరూకుడై జీవించ వలసి వున్నది. విన మ్రతతో మనస్సులో ఎట్టి అహంకారం, అభిమానములకు తావివ్వక ఆదర్శప్రాయుడుగా జీవించవలసి వున్నది. అహంకారరాహిత్య జీవన విధానము, సర్వార్పణ భావముతో, శరణాగతి లక్షణము ఇందు ప్రముఖమైంది. అట్లుగాక ప్రవర్తించినచో తీవ్రమైన దోషము సంక్రమించి కష్టనష్టములకు లోనై తాను సాధించిన ఆరూఢతకు భంగము కలుగును.

**కం॥ శూరత్వమాత్మపనికై। వైరాగ్యము గురుని గొల్చు। వర్తన కెపుడున్।**
**యారీతి వృత్తి గలిగిన నారీ నరులేగి చనరె। నరకము లోనన్॥199**

## ప్రతిపదార్థము

శూరత్వము ఆత్మపనికై = తన సొంతపని కార్యభారము లందు, అత్యంత శ్రద్ధ విశ్వాసము పట్టుదల కలిగి
వైరాగ్యము = విరక్తి, నిర్లిప్తత
గురుని కొల్చు=గురువును, గురుధర్మమును పాటించి, పోషించు అంశములలో
వర్తన కెపుడున్ = ప్రవర్తన కలిగి వున్నవానికి
ఈ రీతి = ఈ విధముగా
వృత్తి కలిగిన = ఆలోచన భావము కలిగియున్న
నారీ నరులు = స్త్రీ పురుషులు
ఏగిచనరె నరకములోనన్ = జనన మరణ ప్రవాహ చక్రములో తగులుకొని కష్ట నష్టములు అనుభవించుదురు

## తాత్పర్యము

తనవ్యక్తిగత కుటుంబ, శ్రేయోభివృద్ధికి కావల్సిన కార్య సాధనయందు అత్యంత శ్రద్ధ, పట్టుదల, శక్తి సామర్థ్యములు ప్రదర్శిస్తూ, గురువు, గురుధర్మము, ప్రచారాదికములయందు నిర్లిప్తత, అనాసక్తి, ప్రదర్శించే లక్షణము కలిగిన, స్త్రీ, పురుషులైన శిష్యులు జనన మరణ చక్రమునందు తిరిగి ప్రవేశించి అనేక కష్ట నష్టములకు లోనగుదురు. ఏలననగా ఉపదేశ కాలమునందు శరణాగతి లక్షణముచే తన సర్వస్వమును గురువునకు అర్పణ అయిన మీదట గురువాక్యం యధాతధంగా జీవించ గలుగుట వ్యక్తి ప్రయోజనము విడిచి ధర్మము సాంప్రదాయములకు ప్రయోజనము కలిగేలా జీవించుట చాలా అవసరమై వున్నది. భుక్తి ముక్తి క్రియలు రెంటియందు సమాన ప్రాధాన్యత కలిగి ఉపదేశ గురువు యొక్క వ్యక్తిగత కష్టసుఖములను తాను పాలు పంచుకొని వసుదైక కుటుంబీకుడై గురువు, గురుధర్మములతో మమేకమై జీవించగలుగుట నిజశిష్యుని లక్షణమై యున్నది.

**కం॥ మేలైన బోధవినుటకు। చాలా విఘ్నములు వచ్చిసమ కూడిన యే। లీలన్ విడడుసచ్ఛిష్యుడు। వాలాయము బోధ యందె। వర్తించుజుమీ॥ 200**

## ప్రతిపదార్థము

మేలైనబోధ = పరమపురుషార్థమైన మోక్షప్రాప్తి, అనగా జనన మరణ భ్రాంతి రహిత విధానము, బోధనా పద్ధతిచేత దృఢ పరచగలిగే సిద్ధాంత పద్ధతి గల సాంప్రదాయము

వినుటకు=ధర్మ పద్ధతిగా గురుశిష్య న్యాయంలో బోధనాక్రమముగా దృఢపరచుకొనుటలో చాలా విఘ్నములు ఆధ్యాత్మిక, ఆదిభౌతిక తాపము, ఆది దైవిక తాపములు, ఈషణ త్రయములు, వాసనా త్రయము మొదలైన ఆటంకములు

వచ్చి = తన జీవితంలో ఎదురుపడి

సమకూడిన = ఎంత తీవ్రముగా బాధించినా, ఆటంకపరచినా
ఏలీలన్ = ఎట్టి పరిస్థితులందు
వీడడు = గురుధర్మమును ప్రబోధను విడిచి పెట్టడు
సచ్ఛిష్యుడు=త్రికరణ శుద్ధి ప్రవర్తన కలిగి గురువాక్యం యధాతధంగా నడిచేవాడు
వాలాయము = సర్వకాల సర్వావస్థలయందు
బోధయందే = గురుడు నిర్ధేశించిన, ధార్మిక జీవన విధానమునందే
వర్తించు సుమీ = ప్రవర్తించగలుగును

## తాత్పర్యము

పరమపురుషార్థమైన మోక్షప్రాప్తికి పరిపూర్ణ భావము, జనన మరణ భ్రాంతి రహిత విధానవే లక్ష్యముగా కలిగి ఏసాధనా పద్ధతితో ప్రయత్నములేక పూర్వపుణ్యావిశేషము గలవారికి బోధనాపద్ధతిచేతనే, సర్వభ్రాంతి రహిత స్థితి దృఢపరచగలుగు విధానము కలిగి యున్నది. ఇట్టి ధర్మము నందు ప్రవేశించి, సాంప్రదాయ పద్ధతి యందలి ధర్మపద్ధతిగా ఉపదేశ దీక్షగైకొని సర్వార్పణ భావముతో, త్రికరణ శుద్ధిప్రవర్తన కలిగి గురువాక్యం యధాతధాగా, జీవించుచు సమగ్రముగా బోధను క్రమపద్ధతిలో విచారణ చేయు సచ్ఛిష్యునికి కాలగర్భములోని, ప్రారబ్ధరూపమైన కర్మానుభవము వాసనాత్రయము, ఈషణత్రయము, త్రివిధతాపములు మున్నగునవి ఆటంకములుగా ఎదురు నిలుచును. ఎట్టి పరిస్థితులందు వీటికి లొంగక గురు అనుగ్రహం ద్వారా ఆత్మస్థైర్యమును పూని, ఆటంకములకు లొంగక బోధయందు అత్యంత వుత్సాహముతో కృషిచేయగలుగును. ఇట్టి శిష్యుని ఎడల గురుని అనుగ్రహము సంపూర్ణముగా ప్రసరించి వీటినుండి బైటపడగలుగు మనోబలమును బోధచే కలిగించును.

**కం॥ గురుకనుసౌంజ్ఞను గనుగొని। పరిచర్య యొనర్చు చుండు**
**భక్తుడు భక్తిన్। పరిపూర్ణ బోధజెందును। పరమౌదారప్రచండ।**
**బంగరుకొండా॥ 201**

## ప్రతిపదార్థము

బంగారుకొండా = అత్యంత శ్రద్ధాభక్తులు కలిగి పూర్వపుణ్య విశేషము అధికముగా కలవాడా!
గురు కను సౌంజ్ఞను కనుగొని = గురువు ప్రబోధించిన వస్తునిశ్చయ పూర్వకమైన పరిపూర్ణ భావము నందలి రహస్యము గుర్తించి
పరిచర్య = అందుకు తగిన జీవితము
ఒనర్చు చుండు భక్తుడు = త్రికరణ శుద్ధి కలిగి బోధకు అణుగుణ్యముగా నడవడిక కలిగిన శిష్యుడు
భక్తిన్ = తన త్రికరణ శుద్ధి కలిగిన ప్రవర్తన చేత
పరిపూర్ణ బోధ చెందును = పరిపూర్ణ బోధ దృఢపరచుకొని అందు ఆరూఢత కలిగి వుండును
పరమౌదారప్రచండ = అత్యంత శ్రేష్టమైన పుణ్యసంస్కారము గలవాడా!

## తాత్పర్యము

పరిపూర్ణ బోధ గురువాక్యముద్వారా మాత్రమే దృఢ పరచు కొనవలసి యున్నది. పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమము అత్యంత రహస్యమై వస్తునిశ్చయ పూర్వకంగా మాత్రమే గుర్తెరగ వలసి యున్నది. గురువాక్యము యధాతధంగా స్వీకరించు మనసు కలవాడై తన ప్రవర్తనచే గురుని మెప్పించి వారనుగ్రహము ద్వారా పరిపూర్ణ బోధ యందు ఆరూఢత చెందవలసి యున్నది. ఇట్టి సుకృతము పూర్వ జన్మ పుణ్య విశేషముచే అత్యంత నిశితమైన ప్రజ్ఞా పాటవములు కలిగి భక్తి, శ్రద్ధలతో కూడుకున్న వానికి మాత్రమె ఇది సాధ్యము కాగలదు.

**కం॥ కమలంబులున్న కొలనుకు। భ్రమరములేతెంచినట్లు బాగుగ బోధన్। తమ మదిగోరి గురునిపద। కమలములను గొల్వ సుజన గణమేతెంచున్॥ 202**

## ప్రతిపదార్థము

కమలంబులున్న కొలనుకు=తామర పువ్వులు సమృద్ధిగా వికసించిన చెఱువు వద్దకు

భ్రమరము లేతెంచినట్టు = తేనెటీగలు తేనె కొరకు చేరినట్లు
బాగుగా బోధన్ = శ్రేష్టమైన పరిపూర్ణభావమును
తమమది కోరి = పూర్వపుణ్య విశేషముచే కావాలను తపనచే
గురుని పదకమలములను కొల్వ = పరిపూర్ణ గురుసార్వభౌముని దివ్య శ్రీచరణములను ఆశ్రయించి బోధయందు కృషి చేయుటకు
సుజన గణమేతెంచున్ = పూర్వపుణ్య విశేషము గల సచ్ఛిష్యులు చేరు కొందురు

## తాత్పర్యము

అత్యంత మధురమైన మకరందమునకు ఆశ్రయములైన పద్మములకు స్థానముగానున్న చెఱువుల ఒద్దకు తేనెటీగలు బహుదూరమునుండి వచ్చి చేరును. ఆ విధంగానే పూర్వపుణ్యవిశేషముచే, జనన మరణ భ్రాంతి రహిత విధానమే లక్ష్యముగా గలిగి అందుకు స్థానముగానున్న పరిపూర్ణ భావజ్ఞుడైన గురుమూర్తి దివ్యశ్రీ చరణములనుఆశ్రయించి వారి అనుగ్రహము ద్వారా పరిపూర్ణ బోధను ఆరూఢపరచుకొని జన్మ సాఫల్యము పొందగోరుటకు సచ్ఛిష్యులు చేరుకొందురు.

**కం॥ త్ర్యక్షుని నిందించినయా। దక్షునిగని ప్రాణమిడిన। త్రక్ష్య సతివలెన్ యీ క్షితి తన దేశికుని నుపేక్షించిన జనులతాను। పేక్షించదగున్॥ 203**

## ప్రతిపదార్థము

త్రక్షుని = మూడుకన్నులు కలిగిన ఈశ్వరుని
నిందించిన = అవమానపరచిన
ఆదక్షుని గని = తన తండ్రియైన దక్షప్రజాపతినిచూచి
ప్రాణమిడిన = ప్రాయోపవేశము ద్వారా ప్రాణత్యాగము చేసిన
త్ర్యక్ష సతివలెన్ = పరమేశ్వరుని భార్యయైన సతీదేవి వలె
ఈక్షితి = ఈప్రపంచమునందు

తన దేశికునుపేక్షించిన జనులను = తనగురువును గురుధర్మమును అవమాన పరచిన ప్రజలను
తానుపేక్షింప దగున్ = తాను విడచిపెట్టవలెను

## తాత్పర్యము

ప్రజాపతి యైన దక్షుడు యజ్ఞమును తలపెట్టి , అందు తన అల్లుడు, సర్వేశ్వరుడైన, పరమేశ్వరుని ఆహ్వానించక అవమానపరచెను. తన తండ్రి అయివుండియు, తనభర్తను అవమానపరచిన తండ్రిని చూచి తన ముఖమును తన భర్తకు చూపలేక అవమాన భారముచే ప్రాయోపవేశము ద్వారా పార్వతీ దేవి తన ప్రాణత్యాగము చేసెను. ఆవిధముగానే, ఈ సమాజమునందు గురువును గురుధర్మమును అవమాన పరచిన చులకన చేసిన, నిందించిన, వారు ఎంతటి వారలైన సచ్ఛిష్యుడైనవాడు వారిని శీఘ్రంగా విడిచి యుండవలెను.

**కం॥ గురుని కపరాధియగునా౹ నరనాథుని దృపదునొంచు౹ నరుని విధమునన్ ధరసచ్ఛిష్యవరుడు తన గురుశత్రుని చేతనైతే౹ క్రొవ్వణచదగున్॥ 204**

## ప్రతిపదార్థము

గురునికి = తనకు ధనుర్విద్యనేర్పిన ద్రోణాచార్యునికి
అపరాధియగు = అవమానపరచిన
ఆనరనాధుని ద్రుపదు = రాజైన దృపదమహారాజును
వొంచు నరుని విధమునన్ = శిక్షించిన శిష్యుడైన అర్జునివలె
ధర = ఈ ప్రపంచమందు
సచ్ఛిష్యవరుడు=గురుర్వాక్యమునందు యథా తథంగా జీవితము కలుగు శిష్యుడు
తనగురు శత్రుని = తనకుపదేశ గురువును అవమానించిన వానిని
చేతనైతే = సామర్థ్యము కలిగుంటే అవకాశముంటే
క్రొవ్వణచదగున్ = వాని గర్వమును రద్దుపరచ వలసి యున్నది

## తాత్పర్యము

కురు పాండవులకు ధనుర్విద్యయందు శ్రేష్టుడైన ద్రోణాచార్యులు గురువుగా నియమింపబడినాడు. అందు పాండవ మద్యముడైన అర్జునుని, తనవారసునిగా ఎంచుకొని, ద్రోణాచార్యుడు తన వద్దగల ధనుర్విద్య అంతయు ఉపదేశించి తన్నుమించిన వానిగా తీర్చి దిద్దెను. శిష్యుడైన అర్జునుడు గురువును సంతోష పెట్టుటకు కోరికను వ్యక్త పరచగా, విద్యాభ్యాసకాలమందు తనకు సహాధ్యాయుడై ధర్మనిర్వహణలో తన్ను అవమాన పరచిన దృపద మహారాజును, అతని గర్వమును, శిక్షింపదలచి, తన శిష్యుని ద్వారాఈ కార్య క్రమమును పూర్తి చేయగలిగెను. ఆ విధముగానే యోగ్యుడైన శిష్యుడు తన ఉపదేశ గురునకు విరోధియైనవారు ఎవరైనా వున్న ఎడల వారిని తమ శక్తి సామర్ధ్యములననుసరించి వారియందలి అహంకారమును రద్దుపరచవలెను.

కం॥ పతిభక్తి గలయువతి వలె। సతతము గురుభక్తిగలిగి।
సచ్ఛిష్యుడిలన్। స్థితిగుదుర సేవజేయును। ప్రతిరహితాద్భుత
చరిత్ర పరమ పవిత్రా॥ 205

## ప్రతిపదార్ధము

ప్రతి = సాటిలేని
రహితాద్భుత చరిత్ర = అత్యంత పవిత్రమైన జీవనము కలవాడా
పరమ పవిత్రా = అత్యంత పుణ్య ప్రదమైన సంస్కారములు కలవాడా
పతిభక్తి కల యువతి వలె = పతివ్రతా ధర్మమును పాటించు పుణ్యస్త్రీ వలె
సతతము = ఎల్ల వేళల
గురుభక్తి కలిగి = తన గురువు ఎడల అత్యంత భక్తి విశ్వాసము కలవాడై
సచ్ఛిష్యుడు = యోగ్యుడైన శిష్యుడు
యిలన్ = ఈ ప్రపంచములో
స్థితి కుదుర = పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెందుటకు
సేవచేయును = గురుకృప కొరకు గురుఅజ్ఞాను సారముగా జీవించును

## తాత్పర్యము

అత్యంత పవిత్రమైన పుణ్య సంస్కారములతో కూడిన దివ్యజీవితము కలవాడా, పుణ్యవతి అయిన స్త్రీ సంతానాపేక్ష కోరి వివాహ జీవితమునందు ప్రవేశించిసర్వార్పణ బుద్ధితో, ఆదర్శవంతమైన జీవితము తన భర్తతో కలసి జీవించి, గడుపుచూ అతని ఎడల అనన్య చింతన, అర్పణ భావముతో సంతానవంతురాలగుటకు ఎట్లు ప్రయత్నించునో అందుకు వలయు జీవితము ఎట్లు అలవాటు చేసుకొనునో, ఆ విధముగానే జన్మకర్మలనుండి విముక్తి పొందుటకు మార్గముగా చెప్పబడుచున్న పరిపూర్ణ భావము నందు ఆరూఢత చెందుట గురునిద్వారానే సాధ్యముగనుక అతని అనుగ్రహము పొందుటకు చతుర్విధ శుశ్రూషలతో కూడిన ప్రవర్తనతో తన్ను తాను గురునకు గురుధర్మమునకు అర్పించు కొనును. తద్వారా గురుకృప సిద్ధించి బోధయందు ఆరూఢత గాంచును.

## బోధకు అనధికారులు

సృష్టి అంతయు గుణదోషములతో కూడియున్నది. అందుండి ఏర్పడిన మానవోపాధియందు కూడా ఈ గుణదోషములు కలిగియుండును. గురుశిష్య న్యాయములో కూడా విధ్యాభ్యాసము కొరకు గురువులను గురుకులములను ఆశ్రయించిన శిష్యులు ఆదర్శప్రాయులై జీవించిన విధానము చరిత్రయందు స్పష్టముగా చెప్పబడియున్నది. ఆదర్శములను నిర్వీర్యము చేసి గురుశిష్య ధర్మములను అవహేళన చేసి నిందాపూర్వకమైన జీవితమును గడిపి గురుధర్మమును భ్రష్టుపట్టించిన సంధర్భములు కూడా చరిత్రయందు చోటు చేసుకొన్నవి. అట్లే పరిపూర్ణ బోధయందు గురువు నాశ్రయించిన శిష్యునికి కూడా యిట్టి దుర్లక్షణములు కలిగి యుండునని అట్టి వారి మానసిక ప్రవృత్తి ఏవిధముగా నుండునో ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ మనసున నొకటిదలచు। వాక్కున నొక్కటి బలుకు చుండు।**
**కుటిలుడు మరితా। తనువున నొక్కటి జేయును। వినువానికి**

బోధదెల్ప। విహితమటోయీ॥ 206

## ప్రతిపదార్థము

మనసున ఒకటి తలచు=సంకల్పరూపమైన మనస్సుతో వివిధ ఆలోచనలు చేయును
వాక్కున ఒకటి పలుకు చుండు=నోటి ద్వారా అందుకు భిన్నముగా వేరైనవి మాట్లాడుచు
తనువున ఒకటి చేయు = క్రియా రూపమైన శరీరముతో మరొకవిధముగా ప్రవర్తించును
కుటిలుడు = కపటమైన జీవన విధానము కలవాడు
విను = శ్రద్ధగా గమనించుము
వానికి=పైన చెప్పిన విధముగా భిన్న భిన్న దృక్పధములతో జీవించు వానికి
బోధ = పరిపూర్ణ భావము
దెల్ప = ఉపదేశించుట
విహితమటోయి = సరియైన విధానమేనా, యోగ్యమైన పద్ధతేనా

## తాత్పర్యము

పూర్వ జన్మ సంస్కారముచే కపట వృత్తి కలిగిన శిష్యుడు ఆత్మకు ప్రతిరూపములైన మనో, వాక్కు, శరీరములలో మనసు నందొకటి, వాక్కుచేమరొకటి, శరీరముచే వేరొక విధముగా సమన్వయము లేక జీవనము గడుపుచుండును. ఇట్టి లక్షణము గలవానికి పరమ పవిత్రమైన, శ్రేష్టమైన పరిపూర్ణ భావమును ఉపదేశించి దృఢపడునట్లుగా బోధించుట యోగ్యమైన పనేనా? కాదు అని భావము.

**కం॥ గురుడు తనయాజ్ఞలోపల। చరియింపగ గోరునట్టి శిష్యున కెపుడున్। దురితంబు వృద్ధియైతా। నరకమునన్ గూలకున్నె నరనుతచరితా॥ 207**

## ప్రతిపదార్థము

నరనుత చరితా = మానవో పాదియందు అత్యంత శ్రేష్టమైన జీవన విధానముచే స్తుతింపబడు లక్షణము కలవాడా!

గురుడు = తనకు మంత్రోపదేశము చేసిన పరిపూర్ణ గురువు
తనాజ్ఞ లోపల = తాను చెప్పిన విధముగా
చరియింపగోరు = ప్రవర్తించగలిగేలాగ
అట్టి శిష్యునకు = పైలక్షణము గలిగిన శిష్యునకు
ఎపుడున్ = తప్పకుండా
దురితంబు వృద్ధియై = కష్ట నష్టములు అభివృద్ధిచెంది
తా = అట్టి జీవనము కలవాడు
నరకమునన్ గూలకున్నె = జనన మరణ ప్రవాహరూపమగు గర్భ నరకమున జీవించగలుగును

## తాత్పర్యము

మానవ సమాజమునందు పుణ్య ప్రదమైన జీవితముచే స్తుతింప దగిన శిష్యుడు తనకు మంత్రోప దేశము చేసిన పరిపూర్ణ గురువు తాను చెప్పిన విధముగా(కోరుకున్న విధంగా) తనకు శిక్షణ నొసగి ప్రబోధింపవలసినదిగా కోరిక కలిగివున్న శిష్యునికి పలు కష్ట నష్టములు ఎదురై పాప రూపముగా పరిణమించి జనన మరణ ప్రవాహరూపమైన గర్భ నరకమునందు ప్రవేశించి జన్మ పరంపరలకు లోనగును.

**కం॥ సురవరుడహల్యకోసము। మరులొందిన రీతి నెపుడు।**
**మరుగుదురజ్ఞుల్। పొరుగూరు సాధులకుతమ। పురమునకల**
**సాధు లందు। బుద్ధి నిలుపకన్॥ 208**

## ప్రతిపదార్థము

సురవరుడు = దేవతలందరిలో శ్రేష్ఠుడైన దేవేంద్రుడు
అహల్య కోసము=గౌతమముని భార్య మహా పతివ్రత అయిన అహల్య కోసము
మరులొందిన రీతి = మోహమును చెందినట్లుగా
మరుగుదురు అజ్ఞుల్ = అజ్ఞాన దృష్టితో కూడిన మానవులు
పొరుగూరు సాధులకు = దూరమునుండి తన ఒద్దకు వచ్చిన సాధువులకు
తమపురమున గల = తనకు సమీపముగా నున్న

సాధులందు = పరిపూర్ణ భావజ్ఞులయందు
బుద్ధి నిలపకున్ = లక్ష్యములేక

## తాత్పర్యము

దేవతలయందు శ్రేష్టుడైన దేవేంద్రుడు మహా సౌందర్యవతి పతివ్రతా శిరోమణి, గౌతమఋషి ధర్మపత్ని అయిన స్త్రీని, అందమైన భార్య శచీదేవిని కలిగుండి కూడా మోహదృష్టిచే కామించి శాపగ్రస్తుడయ్యెను. ఆవిధముగానే జ్ఞానహీనులు జనన మరణ ప్రవాహమునుండి రక్షించే శక్తి సామర్థ్యములు కలిగిన పరిపూర్ణ భావజ్ఞులు తనకందుబాటులో వుండగా వారి సామర్థ్యమును, విలువను గుర్తించక ఉదర పోషణార్థమై సత్కారాలు, కీర్తి ప్రతిష్ఠలు ఆశించి సాధు వేషములో నుండి దూర ప్రాంతములందు ఉనికి కలిగిన సన్యాసులను ఆశ్రయించెదరు.

**కం॥ కనక సుమగంథవాసన। తనకొనగాదలచిషట్పదము
గొనదటులన్। వినదులేనహమె బ్రహ్మం। చనిపల్కె నృతతినిల్వ।
ననియీ బోధన్॥ 209**

## ప్రతిపదార్థము

కనకసుమగంథ వాసన = సంపంగి పువ్వు యందలి సువాసన
తన కొనగా దలచి = తాను స్వీకరించినా, మరణించునని తలచి
షట్పదము = తుమ్మెద
గొనదు = స్వీకరించదు
అటులన్ = ఆవిధముగానే
లేని అహము = మూలముతేని గుర్తెరిగే శరీరము
బ్రహ్మంబని బల్కె = సత్యమైనది, శాశ్వతమైనదని భావించే
నృతతి = జ్ఞానమార్గీయులను
ఈ బోధన్ = ఈ పరిపూర్ణ భావమునందు
నిల్వనని = ప్రవేశించి కృషి చేయుడనిన
వినడు = పాటించడు

## తాత్పర్యము

ఆరుకాళ్ళ తోకూడిన తుమ్మెద అత్యంత మధురమైన సంపంగి పువ్వు వాసనకు మరణ భయముతో దరి చేరదు. ఆ విదముగానే నేనే బ్రహ్మమును అను భావము కలిగిన జ్ఞాని పరిపూర్ణ భావము నందు ప్రవేశించడు. ఏల ననగా తన వునికి భంగము కలుగు నని తెలియ వలెను.

**కం॥ జఠరజనితులైనను బహు। కఠిన మనస్కులకు ఘోర। కలు
షాత్ములకున్। శఠులకు జడమతులకివకు। పఠనాసక్తులకు
బోధ పట్టుమటంచున్॥ 210**

## ప్రతిపదార్థము

జఠర జనితులైనను = అన్న రసము నుండి ఏర్పడిన శుక్ల, శోణిత సంయోగము చేతనకు సంక్రమించిన సంతానము
బహు కఠిన మనస్కులకు = అత్యంత కఠినమైన మానసిక ప్రవృత్తి కలవారికి
ఘోర కలుషాత్ములకున్ = అత్యంత హేయమైన పాప జీవన వృత్తి కలవారికి
శఠులకు = పై పనులందు ఆసక్తి కనబర్చు వారికి
జడమతులకు = మందబుద్ధి గలవారికి
పఠనాసక్తులకు = పుస్తక పఠనము నందు శ్రద్ధగలవారికి
యివ్వకు బోధ = పరిపూర్న భావమును ఉపదేశించకు
పట్టు మటంచు = గొప్పది విలువైనది అని చెప్పి

## తాత్పర్యము

సప్త ధాతువులో కూడిన అన్నరసమునుండి శుక్ల, శ్రోణిత సంయోగముచే తనకు కలిగిన సంతానమైనా, కఠినమైన మానసిక ప్రవృత్తి కలవారైనా, అత్యంత హేయమైన పాపచింతన వృత్తి కలవారైనా, అట్టి జీవన విధానమును ప్రేరేపించిన వారైనా, మందబుద్ధి కలవారిగా నున్న, పుస్తక పఠనముచేతనే తరించగలవారము అను భావన కలవారైనా, అటువంటి దారిని శ్రేష్టమైన పరిపూర్ణ భావమందు ప్రవేశించి కృషి చేయుమనుట తగదు.

## అధికారి నిర్ణయము

పరిపూర్ణ భావము శ్రద్ధ, భక్తి, పరిశుద్ధ జీవనము కలవారికి మాత్రమే ఉపదేశించ వలెనని ఈశీర్షిక ద్వారా చెప్పబడుచున్నది. ఛాందోగ్యోపనిషత్ ప్రతిపాదితమగు త్రివృత్కరణి విధానమందు మన: ప్రాణ వాక్కులు ఆత్మరూపమై తనయందు ప్రవర్తించుచున్నవని, విచారణ ద్వారా గుర్తించి, అవి మలినత్వము చెంది నీచ యోని ప్రాప్తి చెందనీయకుండా, గురూపదిష్ట మార్గములో త్రివిధ తపస్సుల ద్వారా ఆత్మ శౌచము కలిగి యున్నవానిని అధికారిగా నిర్ధేశిస్తూ, ఇట్టి ఉత్తమ లక్షణము కలవానినే భక్తునిగా పేర్కొనుచూ అధికార నిర్ణయము చేయబడుచున్నది.

**కం॥ మనసున వాక్కున తనువున। పనియొక్కటి జరుపునట్టి।
భక్తునికి దయన్। వినుపించుము వినుమని। యీ ఘనబోధను
వాని కతుక। గలదుడుగకుమీ॥ 211**

## ప్రతిపదార్థము

మనసున, వాక్కున, తనువున = త్రికరణముల ద్వారా
పని ఒక్కటే జరుపునట్టి భక్తునికి = ఒకే లక్ష్యముతో ప్రవర్తించు శిష్యునికి
దయన్ విని పించుము = అత్యంత ప్రేమ వాత్సల్యములతో పరిపూర్ణ బోధను వివరించుము
వినుమాని = శ్రద్ధగా ధృఢ పరచుకోమని
ఈ ఘన బోధను = శ్రేష్టమైన ఈ పరిపూర్ణ భావమును
వాని కతుగ గలదు = త్రికరణ శుద్ధి, భక్తి వుండుటచే స్పష్టముగా అట్టి వాడు ధృఢపరచుకో గలడు
వుడుగకుమీ = ఎట్టి సందేహమునకు లోను కావద్దు

## తాత్పర్యము

మానవోపాధి యందు వ్యవహార సత్తా కలిగి తన నిజరూపమైన ఆత్మకు మారు రూపముగా తన యందు పనిచేయుచున్న మనస్సు, వాక్కు,

శరీరము అను త్రికరణాలను ఒకే లక్ష్యసిద్ధి యందు ప్రవర్తింపచేసి భక్తి తత్పరుడైన శిష్యుడు పరిపూర్ణ గురు సార్వభౌముని ఆశ్రయించిన ఎడల వానికి ఆశ్రయమిచ్చి ఎట్టి సంకోచము లేక అత్యంత అనుగ్రహముతో ఈ పరిపూర్ణ భావమును ప్రబోధించి దృఢపరచవలసి ఉన్నది. నిశ్శంశయముగా అట్టి వానికి దృఢపడ గలదు.

## శిష్య విజ్ఞానము

పూర్వజన్మ సుకృతముచే గాని పరిపూర్ణ బోధ లభ్యము కాదు.ఇందు గురుశిష్యులు సాంప్రదాయమునకు వారసులై ఒకరితో నొకరు మమైకమై ధర్మము యొక్క స్వరూప స్వభావములకు ప్రఖ్యాతిని, విలువను పెంపొందించెదరు. శిష్యుడు ఎంత గొప్పవాడైనా గురుని అనుగ్రహము లేనిదే ఈభావమునందు ఆరూఢత చెందుట అందుకు తగిన విధముగా జీవించుట సాధ్యము కాదు. దుర్లభమైన మానవోపాధికి వచ్చి అత్యంత దుర్లభమైన పరిపూర్ణ భావమును పొందగల్గుట అత్యంత ఆశ్చర్యకరమైన అపూర్వమైన విషయం కావున ఇట్టి అవగాహన పొందిన పిదప శిష్యుడు తన అదృష్టము, గురుని అనుగ్రహము తోడై తాను పొందిన ఆరూఢతను అత్యంత సంతోషప్రదముగా గురునికి నివేదించుట ఈ శీర్షిక ద్వారా ప్రకటమగుచున్నది.

**కం॥ అని గురుడు బోధ చేసిన। విని శిష్యుడు హర్షమంది। వేడుక తోడన్।**
**తనగురుని తోటి విజ్ఞాపన మీరీతిగా నొనర్చె। పటువా క్ర్యోఢిన్॥212**

## ప్రతిపదార్థము

అనిగురుడు బోధ చేసిన = పై పద్యము నందు చెప్పబడినట్లుగా త్రికరణ శుద్ధితో కూడిన భక్తుడు, వాని యోగ్యతను నిర్ణయించిన మీదట
విని = బాగా ధృఢపరచుకొని
శిష్యుడు హర్ష మొంది = శిష్యుడు చాలా సంతోషము చెంది
వేడుక తోడన్ = అత్యంత వుత్సాహముతో
తనగురుని తోటి = తనకు పరిపూర్ణ భావమును ఉపదేశించిన గురుమూర్తితో

విజ్ఞాపన = తాను పొందిన సంతోషాను భూతిని
ఈ రీతిగా నొనర్చె = ఈ విధముగా వ్యక్త పరచుచుండెను
పటువాక్ప్రౌఢిన్ = మధురాతి మధురమైన శబ్ధ జాలముతో

## తాత్పర్యము

సాంప్రదాయ బద్ధముగా అత్యంత రహస్యముగా ఉన్న పరిపూర్ణ భావమును వస్తునిశ్చయ పూర్వకముగా ఉన్నదున్నట్లుగా ప్రబోధిస్తూ అందుకు కావలసిన త్రికరణ శుద్ధి ప్రవర్తన, అవసరాన్ని, ప్రయోజనాన్ని గురువు ప్రబోధించగా, శిష్యుడు శ్రద్ధగా విని అత్యంత ఆనంద భరితుడై తన సంతోషమును అత్యంత మధురమైన మాటల ద్వారా గురుని యందు వ్యక్తపరచుటకు సంసిద్ధుడాయెను.

**కం॥ నాకొరకు కష్టపడితిరి। మీకై మీరిటకు వచ్చి। మిము బొగడు టకా। కాకోదరేశుడోపం। డాకార్యము నాతరంబె యచల మనస్కా॥ 213**

## ప్రతిపదార్ధము

అచల మనస్కా=అచల పరిపూర్ణ భావమును ఆరూఢపరచుకొన్న మనస్సుకలవాడా
నాకొరకు కష్టపడితిరి = జన్మ కర్మలనుండి నన్నుద్ధరించుటకు మీరెంతయో శ్రమ పడియున్నారు
మీకై మీరిటకు వచ్చి=అవతార పురుషులవలె మీకై మీరు వునికి గలిగి ఉన్నారు
మిము పొగుడుటకు = ఉత్తములైన మిమ్ములను కీర్తించుటకు
ఆ కాకోదరేశ్వరుండు ఓపండు = వెయ్యి తలకాయలు కలిగి, కాలకూట విషమునకు కేంద్రమైయున్న ఆది శేషునకు సాధ్యము కాదు
ఆ కార్యము = అట్టి పని
నాతరంబె = నాకు సాధ్యమౌతుందా

## తాత్పర్యము

ధర్మ సంస్థాపనకు శిష్యసముద్ధరణకు లోక కల్యాణమునకు

మీరంతట మీరుగా అవతరించి జనన మరణ చక్రప్రవాహములో చిక్కుకు పోయిన నాబోటి వారిని ఉద్ధరించుటకు అవతారపురుషులుగా నిలచి యున్నారు. ఇట్టి మహోదయులైన మిమ్ములను, మీ ఆశయములను, ఉన్నతిని కీర్తించుటకు, వెయ్యి తలకాయలు(వెయ్యి నోళ్ళు) కలిగి కాలకూట విషమునకు నాథుడై ఉన్న ఆది శేషుని వశము కాకపోయినచో ఒక్క నోటితో అల్పుడనైన నావలన అట్టి అంశము సాధ్యముకాదు. మీరు అచల పరిపూర్ణ స్థితిని మనస్సు నందు నిలుపుకొని జీవించియున్నవారు కావున సామాన్యులకు ఈ అంశము వీలు పడదు.

**కం॥ తల్లివి దండ్రివిదాతవు। వల్లభుడవు బాంధుడవు। వసుధీశుడవున్ తెల్లమిగ దేవుడవు నీ వల్లగదా యిట్టిబోధ। వర్తన వినుటల్॥ 214**

## ప్రతిపదార్థము

తల్లివి, తండ్రివి = నాజన్మకు కారకులైన తల్లీ తండ్రీ మీరే
దాతవు = నను పెంచి పోషించే వాడవు
వల్లభుడవు = అత్యంత ప్రియమైన స్నేహితుడవు
భాంధవుడవు = కష్ట కాలమందు నాకు తోడుగా నున్నవాడవు
వసుధీశుడవు = ఈ విశ్వమున కంతటికి విభుడవు
తెల్లముగ దేవుడవు = సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడవు
నీవల్ల కదా = నీఅనుగ్రహము వలన
నిట్టి బోధ = వున్నతమైన ఈ పరిపూర్ణ భావము
వర్తన = జీవన విధానము
వినుటల్ = వినుట తటస్థపడిన

## తాత్పర్యము

జన్మనిచ్చిన తల్లి దండ్రులుగా, పెంచి పోషించే దాతగా, కష్టకాలమందు అండగా నిలుచు బంధువుగా, ఈ బ్రహ్మాండమునకే ప్రభువుగా, కట్టెదుట ప్రత్యక్షమైన దేవుడిగా, ప్రకాశించు చున్న

మహానీయులైన మీ అనుగ్రహ విశేషము చేత అత్యంత అపురూపమైన పరిపూర్ణ భావమును వినగలుగు అదృష్టము నాకు సిద్ధించినది.

## గురుని కోరిక

పరిపూర్ణ బోధయందలి విధానములో పరిపూర్ణము ఎరిగి ఎరుక నెరిగి ఎరుకను మాను అను క్రమములో కందార్థ కంద పద్యముల ద్వారా ప్రబోధను శిష్యునకు ధృఢపరిచి శిష్యుని ఆరూఢతను, గ్రహింపునందుగల గుణదోషములను పరీక్షింపదలచి విననేర్చుటయే కాక, చెప్ప నేర్చుటయందు కూడా శిష్యుని ప్రజ్ఞా పాటవములు ఎరుగ దలచి ఈశీర్షిక ద్వారా పాఠకులముందుంచు చున్నారు. కందార్థముల కన్న కందపద్యముల యందలి నిగూఢాంశములందు యిది ముఖ్యమైనదిగా చెప్ప వచ్చును.

**కం॥ అనిశిష్యుడన్న మాటకు మనమున హర్షించి గురుడు**
**మరియిట్లని యెన్। వినవోయి శిష్యరాయా। వినినాకోరికను**
**దీర్పవేడుక యైనన్॥ 215**

## ప్రతిపదార్థము

అని శిష్యుడన్న మాటకు=పైన పేర్కొన్నవిధముగా శిష్యుని భక్తి ప్రపత్తులకు
మనమున హర్షించి గురుడు=గురుమూర్తి తనమనస్సులో ఆనందము చెంది
మరియిట్లనియెన్ = ఈ విధముగా శిష్యునికి చెప్పదొడగెను
వినవోయి శిష్యరాయా = శిష్యులలో శ్రేష్టమైనవాడా నాకోరికను వ్యక్త పరుస్తున్నాను, గ్రహించుము
విని = బాగా ధృఢపరచుకొని
నాకోరిక తీర్ప వేడుక యైనన్=నే కోరిన కోర్కెను సంతోషముతో తీర్ప వలయును

## తాత్పర్యము

శిష్యుడు తన మధురమైన భాషణతో, గురుమూర్తిని స్తుతించగా అవి విని గురుమూర్తి, మనసులో సంతసించి తన శిష్యునిపై గల ప్రేమాభిమానములు వ్యక్త పరచుచూ, తన కోరికను, శిష్యునిముందుంచి

సంతోషముతో అట్టి కోరికను తీర్చ వలసినదిగా కోరు చున్నాను.

**కం॥ నేజెప్పినట్లు జెప్పుర। నేజెప్పిన బోధలెస్సనీకతికుంటే।
నేజూతునీచమత్కృతి। రాజితసుగుణైకసార। రమ్యవిచారా॥ 216**

## ప్రతిపదార్థము

నే చెప్పినట్లు చెప్పురా = పరిపూర్ణ భావమును వస్తునిశ్చయపూర్వకముగా నేను నీకు ధృఢపరచిన విధానమును ఉన్నదున్నట్లుగా నాముందుంచుము
నేచెప్పిన బోధ = నే ప్రబోధించిన పరిపూర్ణ భావము
లెస్స = స్పష్టముగా, వున్నదున్నట్లుగా
నీకతికుంటె = నీవు ధృఢపరచుకొని వుంటె
నే చూతు నీచమత్కృతి=నీసామర్ధ్యమును, ఆరూఢతనునేను గమనించెదను
రాజిత సుగుణైకసారా = అనేక సద్గుణములతో ప్రకాశించువాడా
రమ్య విచారా = చక్కటి విచారణానుభవము కలవాడా

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు అచల పరిపూర్ణ ప్రబోధ ఒక ముఖ్యమైన మార్గముగా చెప్పబడుచున్నది. అట్టి భావమును వస్తు నిశ్చయ పూర్వకముగా నీకు ధృఢపరచి వున్నాను. ఇట్టి భావము ఆరూఢ పరచుకొన్న విధానము నీ అనుభవముద్వారా నేను తెలుసుకొనగోరుచున్నాను. విన్నది విన్నట్లుగా ఆరూఢ పరచుకున్న సంధర్భము నందు మాత్రమె యిట్టి ప్రజ్ఞనీకు సిద్ధించగలదు. అనేక పుణ్య సంస్కారములతో కూడి యుండి పూర్వ పుణ్య విశేషముచే పరిపూర్ణ బోధయందు విషయ ప్రవేశము కలిగి చక్కటి విచారణా జ్ఞానము, ప్రజ్ఞా పాటవము కలవాడవు కనుక నా కోరికను తీర్చ గల వాడవని విశ్వసిస్తున్నాను.

## శిష్య ప్రబోధము

గురుశిష్య న్యాయము నందు గురుని వాక్యము యధాతధముగా స్వీకరించి పాటించుట శిష్య ధర్మమై ఉన్నది. బోధయందు ఆరూఢత

కలిగిన పిదప అందలి ఆరూఢత ఎట్లున్నదో పరీక్షింప బూనుట గురుధర్మమై ఉన్నది. గురువు ఎట్టి కోరిక వ్యక్త పరచినా అది తుచ తప్పకుండా నెరవేర్చ గలుగుట చాలా ప్రముఖమై యున్నది. కంద పద్య రచన యందు ఈ ప్రత్యేకత స్పష్టముగా కన్పించు చున్నది. కావున ఈ శీర్షిక ద్వారా శిష్యుని ఎడల గురునకు కలిగిన కోరిక అందుకు శిష్యుడిచ్చిన సమాధానము ప్రముఖముగా ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ అనిగురుడు తనను। బల్కిన। వినిశిష్యుడు లేచి మ్రొక్కి**
**వినుతించి ముదంబున జెప్పదొణగె మునుతా। వినినట్లుగ।**
**గురుని మదికి వేడుక దోపన్॥ 217**

## ప్రతిపదార్థము

అనిగురుడు తనని పల్కిన = పైన పేర్కొన్న విధముగా గురుమూర్తి తనఎడల కలిగిన వాత్సల్యమును వ్యక్తపరచగా
శిష్యుడు విని = శిష్యుడు దానిని గుర్తించి
లేచి = తాను కూర్చున్న స్థానము నుండి లేచి
మ్రొక్కి = సాష్టాంగ నమస్కార మొనర్చి
విను తించి = గురుమూర్తిని స్తోత్రము చేయుచూ
ముదంబున = సంతోషముతో
చెప్పదొడగెను = బోధక్రమమును వివరించి చెప్పుటకు ప్రయత్నించెను
తా వినినట్లుగా = గురుమూర్తి తనకు ప్రబోధించిన విధానము యధాతధంగా
వేడుక దోపన్ = గురుమూర్తి ఆనంద పడునట్లుగా

## తాత్పర్యము

పైన పేర్కొన్న విధముగా గురుమూర్తి తన మనమందు గల కోర్కెను, శిష్యుని ముందుంచగా అత్యంత భక్తి శ్రద్ధలతో తనస్థానము నుండి లేచి సాష్టాంగ దండ మాచరించి గురుస్తోత్రము చేయుచు అత్యంత వుత్సాహముతో తాను విన్నది విన్నట్లుగా పరిపూర్ణ భావమును చెప్పుట ప్రారంభించెను.

కం॥ నే మొదలులేని మేనును। నా ముచ్చట స్వప్నమనుచు నమ్మదగుసుమీ్మ। నేమేలుకొన్న లేనని నా ముచ్చట నేను నిల్వ। నరఘుడియైనన్॥ 218

## ప్రతిపదార్థము

నే మొదలు లేని మేనును = స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరమును నేను
నా ముచ్చట = నా ఉనికిని
స్వప్నమనుచు నమ్మదగు సుమీ = కలవలె నిజము కాని దని నమ్మదగును
నేను మేలుకొన్న=గురువాక్యము అనే బోధ చేత మెళుకువ చెందిన పిదప
లేనని = మూలము గాని స్థానము గానిలేని వాడినని, నిజము కానివాడనని
నాముచ్చట = నాఉనికి, నా అనుభవము
నేను నిల్వ అరఘుడియైనన్ = ఒక్క క్షణమైనా వుండుటకు ఆస్కారము లేక పోవును

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమందు మూలము గాని స్థానముగానిలేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరమును నేను, సుర స్వప్నమే నా అవస్థగా తెలుసు కొన్నాను. గురుప్రబోధచే మెళకువ చెందిన పిదప నాఉనికి లేక పోవుచున్నది. వున్నదని గాని లేదని గాని చెప్పుటకు ఒక్క క్షణమైనా నేను నిల్వ జాలను.

కం॥ లేనినే లేకవచ్చిన, నేనేగిన నుండుబయలు। నేనెరుగను యీ నేనుండి దాన్ని గనుగొని। నేనేగితె మరలబుట్టు। నిక నెన్నటికిన్॥219

## ప్రతిపదార్థము

లేని నేను = మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న నేను
లేక వచ్చిన = ఎట్టి ఆధారము మూలము లేక వచ్చిన గుర్తెరిగే శరీరముగా
నేనేగిన = వచ్చినపుడు, నేపోయినప్పుడు

వుండు బయలు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము ఉండును
నే నెరుగను = ఉన్నదానిని గూర్చి నాగుర్తుచే ఏమాత్రము తెలుసుకొనలేను
ఈ నే నుండి దానిని కనుగొని = ఈ విధముగానున్న నాగుర్తుచేత గురుసూచన ద్వారా ధృఢపరచుకొని
నేనేగితే = నాగుర్తును విడిచి పెడితే
మరల పుట్టనిక ఎన్నటికిన్=ఇక మరల ఎట్టి భ్రమ ప్రమలకు లోను కాకుందును

## తాత్పర్యము

అచల పరిపూర్ణమునందు లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరము వచ్చి పోతున్నా పరిపూర్ణము స్వత:సిద్ధమై యుండును. దాని ఉనికి నాకు తెలియదు. ఇట్టి నేను గురుసూచన ద్వారా పరిపూర్ణమును వుండజూచుకొని గుర్తును విడిచి యుండిన ఎట్టి భ్రమ, ప్రమలకు లోను కాక జనన మరణ చక్ర పరిభ్రమణమునకు లోను కాను.

**కం॥ లేనినారాకపోకలు। దేనందున దోచబడె। నదెబయలు సుమీ।
దానిని గురుకృపచేగని। నేనేగిన రాను పోను నిజమెన్నటి కిన్॥**
**220**

## ప్రతిపదార్థము

లేని = లేక తోచబడుచున్న
నారాక పోకలు = నా ఆవిర్భావ తిరో భావములు
దేనందున తోచబడెనో = ఏవస్తువు నందు వున్నట్లుగా తెలియబడుచున్నదో
అదె బయలు సుమీ = అదే స్వత:సిద్ధమైన పరిపూర్ణము
దానిని = అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును
గురుకృపచే గని = గురుమూర్తి అనుగ్రహము ద్వారా వస్తునిశ్చయ పూర్వకముగా ధృఢ పరచుకొని
నేనేగిన = గురుర్వాక్యముచేత నేను లేక పోయిన పిదప
రాను పోను = జనన మరణ ప్రవాహమునందు చిక్కు పడను

నిజమెన్నటికిన్ = ఇది అత్యంత సత్యమైన విషయము

## తాత్పర్యము

మూలము గాని స్థానముగాని లేకనే దేనియందు తోచబడు చున్నానో అది స్వత:సిద్ధమైన పరిపూర్ణము గురుకృపచే వస్తునిశ్చయ పూర్వకంగా అట్టి వస్తువును ధృఢ పరచుకొన్నమీదట నేను లేక పోవుచున్నాను. ఇట్టి ఆరూఢత చే జనన మరణ భ్రాంతి రహిత విధానము ధృఢము కాగలదు.

**కం॥ తనువుకు నాకును వేరని యనగూడద దెట్టులనిన। ననవరతంబున్। పనులన్ని తనువునే లేకను। జేయగ వశముకాదు కావున సామీ॥ 221**

## ప్రతిపదార్థము

స్వామీ = గురుమూర్తీ

తనువుకు నాకును వేరని అనకూడదు = గుర్తెరగబడే నేను, దానికి శరీర భూతముగా నున్న మేను అనునవి రెండు వస్తువులుగా నిర్ణయించ గూడదు

ఎట్టులనిన = ఏ విధంగాననగా

అనవరతంబున్ = సర్వకాల సర్వావస్థలయందు లేక ఎల్లపుడు

పనులన్నీ = క్రియలన్నీ

తనువు నేను లేకను = శరీరము నేను ఒకదాని నొకటి కలుపుకొనక

చేయగా = చేయుటకు

సాధ్యము కాదు = వీలుకాదు

కావున = అందుచేత

## తాత్పర్యము

ఓ సద్గురు ప్రభూ! గుర్తెరిగే నేను దానికి స్థూలభాగమగు శరీరము అనునవి రెండు వస్తువులుగా చెప్పరాదు. ఏలననగా సర్వకాల సర్వావస్థలయందు, శరీరము నేను కలసియే పని చేయుట వీలగుచున్నది.

కావున ఈ రెండు ఒకదాని నొకటి విడిచి వుండవు.

**కం॥ ననురమ్మని పొమ్మనితా। ననదుసుమీ బట్టబయలు। నాకైనేనే।
తనువును జగమును గైకొని। చనుదెంచుట చనుటనాకు।
సహజము తండ్రీ ॥ 222**

## ప్రతిపదార్థము

తండ్రీ = నా ఉనికికి మూలమైన వాడా!
ననురమ్మని, పొమ్మని=నేననే గుర్తెరిగే శరీరము ఆవిర్భావ తిరోభావములు చెందుట
అనదు సుమీ బట్టబయలు=పరిపూర్ణముతో ఎట్టి సంబంధము లేక వుండును
నాకై నేనే = నాకు నేనుగానే
తనువును జగమును గైకొని = జీవేశ్వర జగత్తుగా తోచబడి
చనుదెంచుట, చనుట = రాకపోకలు సాగించుట
సహజము = నా వునికికి వాస్తవము, సత్యము స్వభావసిద్ధము

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణము తనయందు మూలము గాని స్థానము గాని లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరమును, రమ్మనిగాని పొమ్మనుటగాని సాధ్యపడదు. నా అంతట నేనే ఈ జీవేశ్వర జగత్తుగా మార్పు చెంది విచారించి రాకపోకలు సాగిస్తూ వచ్చుచూ పోవుచూ వుండుట నాకు స్వభావ సిద్ధమైనవిగా తెలుసుకొన్నాను.

**కం॥ ప్రకటమగు బట్టబయలున। సకలముతో లేకవచ్చి
చనుదరఘుడియన్। నొకకోటి। మాట్ల నేరానొకవేళ్లను లేనటంచు।
నూహపొడమినన్॥ 223**

## ప్రతిపదార్థము

ప్రకటమగు బట్టబయలున = స్వత:సిద్ధమై వున్న అచల పరిపూర్ణమునందు
సకలముతో = పిపీలికాది బ్రహ్మ పర్యంతము
లేక = మూలముగాని, ఆధారముగాని లేక

వచ్చి చను అరఘుడియైనన్ = అరఘుడియలో ఆవిర్భావ తిరో భావములుగా పరిణామము చెందు చుండును
ఒక కోటి మాట్లకు = అనేక పర్యాయములు
ఒక వేళను నేనురాను = ఒకానొక ప్రత్యేకమైన సంఘటనతో ఈ పరిణామ క్రమము లేకుండా రద్దగును
లేనటంచు వూహపొడమినన్ = మూలముగాని స్థానముగాని లేదని గురుర్వాక్యము చేత ధృఢపరచుకున్నమీదట

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు, మూలముగాని, స్థానముగాని లేకనే తోచబడుచున్న ఎరుక జీవేశ్వర జగత్తుగా లేకనే పరిణమించి ఒక్క సంకల్ప కారణముగా అరఘుడియలో పరిణమించి, అనేక పర్యాయములు, ఎడతెరిపిలేక మార్పులకు లోనగుచుండి గురుర్వాక్యము చేత (మూలము లేని గుర్తెరిగే శరీరము) నిజము కానిదని ధృఢ పరచుకున్న మీదట, ఈ మార్పులు లేక, నిజము కాక రద్దుఅయి లేకుండా పోగలుగుతాము.

**కం॥ లేనినే నెరుగకుండిన। మేనుండదు నేను నిల్వ। మేనుండక యీ। మేనగు నాజోలొల్లని। దానిని గుర్తెరిగి, నేను। తలగితె చాలున్॥ 224**

## ప్రతిపదార్థము

లేని నేను = మూలముగాని స్థానముగాని లేక గుర్తెరగబడుచున్న ఎరుక
ఎరుగ కుండిన మేనుండదు=నేననే గుర్తు లేకుండా మేనను ఆవరణ ముండదు
నేనిల్వ మేనుండక = మేననే శరీరమును విడిచి నేనను గుర్తు ఉండదు
ఈ మేనగు = ఇట్టి ద్వంద్వ లక్షణము కలిగిన నాశరీరముతో
నాజోలొల్లని దానిని గుర్తెరిగి = నాతో సంబంధ పడని అచల పరిపూర్ణము వున్న దని ధృఢపరచుకొని
నేను తలగితెచాలు = నేనను గుర్తును విడిచివుంటే చాలు

## తాత్పర్యము

నేనును విడిచి మేనును, మేనును విడిచి నేను ఒక దానినొకటి విడిచి ఉండుట సాధ్యము కాదు. ఇట్టి ద్వంద్వ లక్షణము కలిగిన నాతో సంబంధపడక వేరైవున్న అచల పరిపూర్ణము యొక్క వునికిని గురుసూచన ద్వారా ధృఢపరచుకొని, గుర్తును విడిచి వుంటే జనన మరణ భ్రాంతి తొలుగును.

**కం॥ మనము మన పెద్దలందరు। చనుదేరక మునుపువారు। చనినన్ గలయీ। ఘనమును గని మనమేగిన। చనదుగదా మనల బోలి। సారవిచారా॥ 225**

## ప్రతిపదార్థము

సార విచారా = శ్రేష్టమైన విచారణా లక్షణము కలవాడా
మనము, మనపెద్దలందరు = గుర్తెరగబడే మనము మన పూర్వీకులు
చనుదేరక మునుపు వారు చనినన్ = వారు రాక పోకలు చెంది మార్పు చెందక పూర్వము
గలఈ ఘనమునుగని=వునికి కలిగి యున్న పరిపూర్ణమును వుండజూచుకొని
మన మేగిన = గుర్తెరిగే శరీరములేక పోయిన పిదప
చనదుగదా మనల బోలి=వున్న పరిపూర్ణము మన వలెనె లేక పోదు గదా

## తాత్పర్యము

మనము మన పూర్వీకులు వచ్చి పోయిన పిదప కూడా మనతో సంబంధ పడక ఉనికి కలిగి స్వత:సిద్ధమై ఉన్న అచల పరిపూర్ణమును దృఢపరచుకొని గుర్తును విడచిన పిదప మనతో సంబంధ పడని అచల పరిపూర్ణము మన వలెనే లేక పోక స్థిరమై వుండును.

**కం॥ మేను మజ్జనకునినేనే। మేనికి జనకుడను నేను। మేను లొకటియై దేనందు సంచరింతుమొ। దానిని పరిపూర్ణ మనుచు దలచెదనయ్యా॥ 226**

## ప్రతిపదార్థము

మేను మజ్జనని = జగ దధిష్టానమైన మూలప్రకృతియే నాకు తల్లి
నేనే మేనికి జనకుడను=అట్టి దానికి కారణ భూతుడనైన అధిష్టాన పురుషుడను నేను
నేను మేను ఒకటియై = ఈ ప్రకృతి పురుషులిరువురు ఏకమై
దేనియందు సంచరింతుమొ = ఏవస్తువునందు ఆవిర్భావ తిరో భావములు చెందు చుందుమో
దానిని = అట్టి స్వత:సిద్ధమైన వస్తువును
పరిపూర్ణమనుచు తలచెదనయ్యా = పరిపూర్ణ పరబ్రహ్మముగా భావించెదను

## తాత్పర్యము

సమస్త జీవ నిర్మాణమునకు మూలమై వున్న మూల ప్రకృతియే నేననే గుర్తెరిగే శరీరమునకు తల్లి వంటిది. అట్టి దానికి తెలివిని శక్తిని ప్రసాదించు అధిష్టాన పురుషుడగు నేను అను గుర్తు తండ్రి వంటి వాడు. ఈ రెండూ విడదీయ రానివై ఏ వస్తువునందు అవిర్భావ తిరోభావములు చెందుచూ, రాక పోకలు సాధించు చున్నవో అట్టి దానిని స్వత:సిద్ధమై వున్న పరిపూర్ణముగా భావించెదను.

**కం॥ మేనున్నదె నేలేకను। నేనెరుగను మేనులేక। నేనిల్వనుయీ।**
**మేనుకు నేనుకు మూలము। గానను మముమేమె సృజన।**
**గావింతుమయీ॥ 227**

## ప్రతిపదార్థము

మేనున్న దేనేలేకను=నేనను గుర్తులేకుండా దానికి ఆవరణాత్మకమైన మేను నిల్వజాలదు
నేనెరుగను = ఈ అంశము నాకు తెలియబడదు
మేనులేక నే నిల్వను=మూల ప్రకృతి లేక నేననే గుర్తెరిగే శరీరము నిలువజాలదు
ఈ మేనుకు, నేనుకు మూలము కానను = ఈ విధముగా ఒకదాని కొకటి మూలము ఆధారము గావున్న నేను మేనులకు వేరొక మూలము, ఆధారము కన్పించదు

మము మేమే సృజనగావింతుమయా = మా యిరువురకు ఒక దాని కొకటి ఆధారము ఆధేయమై, కలిసి మెలసి వుండి వ్యవహరించెదము

## తాత్పర్యము

మేను అను మూల ప్రకృతి నేను అను గుర్తెరిగే తెలివికి లోబడియే ఉనికి కలిగి యున్నది. ఇదిగాక వేరొక మూలము ఆధారము ఉన్నదని నేను చెప్పలేను. ఇట్టి మేనను శరీరము లేక నేనను గుర్తుకు ఉనికి లేదు. ఈ రెండూ ఒకదాని కొకటి మూలము ఆధారము అయి ఉన్నవి. సంధర్భమును బట్టి ఒకరికొకరము వ్యక్తమై రెండుగా ప్రకాశిస్తూ వ్యవహరించెదము.

**కం॥ నేనిల్వ జగములేకను నేనేగిన జగములేదు। నిజమీ జగమున్।**
**నేనును లేనప్పుడుంగల। దానిని పరిపూర్ణమనుచు।**
**దలపోయదగున్॥ 228**

## ప్రతిపదార్థము

నే నిల్వ జగము లేకను = నేననే గుర్తెరిగే శరీరము లేకుండా, పంచభూతాత్మకమైన జగత్తుకు ఉనికి లేదు

నేనేగిన జగము లేదు = నేన నేగుర్తు లేకుండా ప్రంపంచము నిల్వజాదు

నిజము = ఇది చాలా సత్యము

ఈ జగమును నేనును లేనప్పుడుగల = పైన చెప్పబడిన రెండు వస్తువులతో సంబంధ పడక అంతకు పూర్వమే స్వత:సిద్ధమై ఉనికి కలిగి వున్నది

దానిని = అట్టి వస్తువును

పరిపూర్ణ మనుచు = అచల పరిపూర్ణమనుచు

తలపోయదగున్ = నిర్ధుష్టముగా చెప్పదగును

## తాత్పర్యము

నేను జగములనునవి ఒకదాని నొకటి విడిచి ఉండవు. ఈ రెండునూ అన్యోన్యాశ్రితమై ఉనికి కలిగి ఉండును. ఈ రెండూ ఉత్పత్తి

చెందక పూర్వము వీటితో సంబంధపడక వేరై ఉన్నదానిని అచల పరిపూర్ణముగా దృఢపరచుకొందును.

**కం॥ లేనినే మాయమైనను। మానవులది మరుపు మూర్ఛ। మరణంబునుగా। ఢానిద్రయు నిర్నిద్రన నేనవివిని మృషనినమ్మ। నేర్తునె వాటిన్॥ 229**

## ప్రతిపదార్థము

లేని నేను =వున్న వస్తువు నందు లేక తోచబడుచున్న నేననే గుర్తు
మాయమైనను = లేకుండా పోయినపుడు (కనిపించ కుండాపోయినపుడు)
మానవులు = నావునికిని గూర్చి తీవ్రమైన ఆలోచించువారు
మరుపు, మూర్ఛ, మరణంబు, గాఢనిద్ర, నిర్నిద్ర = మరుపు, మూర్ఛ, మరణము, గాఢసుషుప్తి, యోగనిద్ర లేక తురీయావస్థ
నేనవివిని = ఈవిధమైన వాఖ్యానములన్నియు నేను గమనించి
మృషని = లేనిదని, నిజము కానిదని తెలుసున్నమీదట
నమ్మనేర్తునే వాటిన్=పైన పేర్కొన్న స్థితులను గతులను విశ్వసించ జాలను

## తాత్పర్యము

ఉన్న వస్తువునందు లేక తోచబడుచున్న నేననే గుర్తు లేనిదని దృఢపరచుకొన్నమీదట, నాస్థితి ఎరుగని మానవులు తాత్కాలికముగా నేనులేకపోవుచున్న స్థితులైన మరుపు, మూర్ఛ, మరణము, సుషుప్తి, యోగనిద్ర లేక తురీయము అనుపేర్లు పెట్టి వ్యవహరించు చున్నారు. ఇట్టి వ్యాఖ్యానములన్ని వింటున్న నేను మృషనని తెలిసిన మీదట పైన పేర్కొన్న స్థితిగతులను విశ్వసించను.

**కం॥ వినుభాష్యములను త్రాళ్ళను। జనములునను గట్టి యుంచ జనక నిలుతునా। చనుదొత్తు నాకునేనై। కనుకనెననునమ్మ రెపుడు। ఘనులగు వారల్॥ 230**

## ప్రతిపదార్థము

విను = శ్రద్ధగా గమనించుము

భాష్యములను త్రాళ్ళను = మూలగ్రంథము నందలి నిగూడాంశములను వివరించు వ్యాఖ్యానగ్రంథములు భాష్యములని చెప్పబడుచున్నవి

జనములు = మత కారకులు

నను కట్టి యుంచ = నన్ను అక్షర రూపముగా బంధించి యుంచగా

జనక = వెళ్ళకుండా, లేకుండా

నిలుతునా = స్థిరముగా, శాశ్వతముగా వుండ గలనా?

చను, దొత్తు నాకునేనై = నాకు నేనుగా వస్తూ పోతూ వుంటాను

కనుకనే = అందు చేతనే

నను = నేననే గుర్తెరిగే శరీరమును

నమ్మ రెపుడు ఘనులగువారల్ = పరిపూర్ణ భావమునందు ఆరూఢత చెందిన వారు శాశ్వతమైనదిగా తలంచరు

## తాత్పర్యము

మూల గ్రంథమునందు నిఘూఢముగా నున్న రహస్యములను వివరించి చెప్పుటకు వ్రాయబడిన గ్రంథములను భాష్యములను పేరు చెప్పబడుచున్నది. వేదాంత శాస్త్రమునందు అధిష్టాన రూపమైన ఆత్మ యొక్క సత్యత్వమును స్థిర పరచుటకు ప్రస్థాన త్రయముగా చెప్పబడుచున్న బ్రహ్మ సూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత అను మూడింటినీ మతాచార్యులు వారి వారి మతానుగుణ్యముగా వ్యాఖ్యానములు వ్రాసి సిద్ధాంతపరచి యున్నారు. ఇది తాళ్ళతో పోల్చబడినది. పరిపూర్ణ సిద్ధాంత రీత్యా అధిష్టాన వస్తువు లేనిది కావున లేనిదిగా చెప్పబడుచున్నది. అసత్యమైన వస్తువును సత్యమైన వస్తువుగా నిరూపించుటకు మత కారులు పేర్కొన్న వాదనలనే తాళ్ళతో నిలబెట్టుటకు ప్రయత్నించిన నేనను ఈ వస్తువు శాశ్వతముగా నిలువ జాలదు.రాక పోకలు కలిగి యున్ననేను, నాఉ నికిని వస్తునిశ్చయ పూర్వకముగా విచారించు లక్షణము కలిగిన పరిపూర్ణ

భావజ్ఞులు శాశ్వతము, స్థిరము అను భావములను నాయెడల నమ్మరు. గురర్వాక్యముచే(ద్వాదశి, షోడశి ద్వారా) విడిచి యుందురు.

**కం॥ నానాభాషలచేతను। నానావిధశాస్త్రతతుల। నను నమ్ముటకై**
**నేనే రచించిపెట్టితి। నానాదేశములయందు। నరరూపమునన్॥**
**231**

## ప్రతిపదార్థము

నానా భాషల చేతను = అనేక విధములైన భాషలందు
నానా విధ శాస్త్రతతుల = అనేక విధములైన శాస్త్రవిధ కట్టు బాట్లతో
నను నమ్ముటకై = నా వునికి శాశ్వతమైనది, సత్యమైనది నమ్మించుటకై
నరరూపమునన్=మానవో పాధియందలి మేధస్సు అనే పరిజ్ఞానము చేత
నేనే రచియించి పెట్టితి = నేననే గుర్తుచేతనే వివరించి రచియించితిని
నానా దేశములయందు = అనేకములైన ప్రదేశములయందు

## తాత్పర్యము

దుర్లభమైన మానవో పాధియందు విశేషమైన ప్రజ్ఞా పాటవములతో నేననే గుర్తెరిగే శరీరముతో నావునికి సత్యమైనదని, శాశ్వతమైనదని, ఇత రులను నమ్మించుటకు ఆయా ప్రాంతములయందు, ఆయా పరిభాషలలో శాస్త్రవిధిగా ధృఢమైన భావన కొరకు పెక్కు రచనలు గావించి యుంటిని.

**కం॥ ఒకచోట నవ్వేదును। వేరొకచోటను మిడుకు చుందు నొక**
**చోటనునే ప్రకటమగుదు లేకుందును నొకచోటను యిట్టి చేష్ట**
**లుండును నాకున్॥**
**232**

## ప్రతిపదార్థము

ఒకచోట నవ్వేదును = ఒక సంధర్భములో సంతోషముగా నుందును
వేరొకచోట మిడుకు చుందును=వేరొక దశలో దు:ఖప్రదమై అశాంతిగా నుందును
ఒక చోటనే ప్రకటమగుదు = ఒక సందర్భములోనా వునికి చాలా విస్తరింపబడినదిగా భావించెదను

లేకుందును ఒకచోటను=పరిపూర్ణ బోధచే నేనను గుర్తు వునికి లేకుండా పోవుచున్నది యిట్టి చేష్టలుండును నాకున్ = పైన పేర్కొన్న పరిణామములన్నియు నాకు స్వభావసిద్ధములై వున్నవి

## తాత్పర్యము

పరిణామములన్నియు నాకు స్వభావ సిద్ధములై యున్నవి. ఒక సందర్భమునందు సంతోషముగాను, ఒక సందర్భమునందు విచారముగాను, ఒకచోట సర్వ వ్యాప్తముగాను ఒక చోటను మూలముగాని స్థానముగాని లేకుండా వునికి కలిగి వుంటాను. ఈ మార్పులన్నియు నాకు స్వభావసిద్ధమై వున్నవి.

**కం॥ కావేటి కాలువలవలె। నావల్లనె కల్పనౌను। నానా విద్యల్। యీా విశ్వమందు విశ్వము। నావెంటనే వచ్చుపోవు నావలెనెసుమీ॥ 233**

## ప్రతిపదార్థము

కావేటి కాల్వాలవలె = జీవనదులలో ఒకటిగా చెప్పబడుచున్న కావేరీ నదికి వున్న కాలువల వలె
నావల్లనే = నేననే గుర్తు రూపంగానే
నానా విద్యల్ = పెక్కు మత సిద్ధాంతములు బోధనా విధానములు
కల్పనౌను = కల్పింప బడతాయి
ఈ విశ్వమందు = ఈ ప్రపంచమునందు
ఈ విశ్వము = ఈ తోచబడు ప్రపంచమంతయు
నావెంటనే = నేననే గుర్తుతో పాటుగా
వచ్చు, పోవు = వచ్చి పోవు చుండును
నావలనె సుమీ = నేననే గుర్తు వల్లనే

## తాత్పర్యము

జీవనదుల్లో ఒకటిగా చెప్పబడుచున్న కావేరీ నదికి పిల్ల కాల్వాలు చాలా కలిగి యుండును. ఆ విధంగానే నేననే గుర్తెరిగే శరీరము నుండి ఈ

ప్రపంచమునందు అనేక విధములైన విద్యలు మత సిద్ధాంతములు, కల్పింప బడుచున్నవి. ఈ బ్రహ్మాండ మంతయు నేననే గుర్తెరిగే శరీరముతో సంబంధపడి నాతోపాటుగా రాక పోకలు సాగించు చుండును.

**కం॥ నేనాడదాన నౌదును। నేనేమగవాడనౌదు। నేనేనన్నున్।**
**నేనీవటంచుగూడుదు। నేనేనను జనుపమనుప నీగుదు సుమ్మీ॥ 234**

## ప్రతిపదార్థము

నేనాడదాననౌదును = స్త్రీ రూపముగా నేనే వ్యక్తమగుదును
నేనే మగవాడనగుదు = పురుషరూపముగా కూడా నేనే వ్యక్తమగుదును
నేనే నన్నున్ నేనీవటంచు గూడుదు = నేననే గుర్తెరిగే శరీరముతో నీవు నేను అను ద్వంద్వ పద్ధతిగా కూడా వ్యవహరించెదను
నేనే నను జనుప మనుప = నేననే గుర్తె నావుత్పత్తి స్థితి నాశనములకు
నీగుదుసుమ్మీ = కారణముగా పేర్కొందును

## తాత్పర్యము

సృష్టి పరిణామక్రమములో పురుష ప్రకృతులుగా నన్ను నేనే సృష్టి వికాసము కొరకు ఏర్పాటు చేసుకొని స్త్రీ, పురుషులుగా మార్పు చెంది, నేను నీవను ద్వంద్వ పద్ధతిగా వ్యవహరిస్తూ ఒకటిగా జీవించు చుందుము. నావునికి వుత్పత్తి, స్థితి, నాశనము లకు కారణము కూడా నేనుగానే భావించు చుందును.

**కం॥ నేనుల మేనుల కుప్పను। నేను బయల్ నన్నెరుగదు। నేచను దొత్తున్। మేనై నిమిషములోనిది। మానుగ నావృత్తి నేనే మాయనుసుమ్మీ॥ 235**

## ప్రతిపదార్థము

నేనుల మేనుల కుప్పను నేను = 84 లక్షల జీవరాసుల యందు స్థూల, సూక్ష్మములుగా, నేను మేనుల సమూహముగా నేనే ఉనికి కలిగి వుందును
బయలునన్నెరుగదు = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నేననే గుర్తుతో సంబంధ

పడియుండదు
నేచను దొత్తును మేనై = నేను, మేనులుగా నాకు నేనే పరిణామము చెందెదను
నిమిషములోనిది మానుగ నావృత్తి = గురుకృపచే పరిపూర్ణ భావ రీత్యా రెప్పపాటు కాలములో నిజముకాదని తెలుసుకుని లేకుండా పోతాను
నేనే మాయను సుమ్మీ = వున్నదానియందు మూలముగాని స్థానముగాని లేక తోచబడు మాయను కూడా నేనే

## తాత్పర్యము

నేను మేనులు అను ద్వంద్వ పద్ధతిగా సమూహముగా కుప్పలు తెప్పలుగా నేనే ప్రకాశించెదను. స్వత:సిద్ధమైన పరిపూర్ణమునకు నా వునికి గోచరము కాదు. శరీర రూపముగా నాకు నేనుగా వచ్చిపోవుచుందును. పరిపూర్ణ బోధయందు గురుర్వాక్యముచే మూలముగాని స్థానముగాని లేకుండా రద్దు కాగలుగుతాను. సకల భ్రాంతులకు మూలము, ఆధారముగా నేనే వ్యవహరిస్తాను.

**కం॥ నేనుగా కొకటి శుద్ధ। జ్ఞానము గలదనుచు బల్కు। జ్ఞానుల మాటల్**
**పూని వినదగదు। శుద్ధ జ్ఞానంబననేనె నేను। లేనిది యౌనే॥ 236**

## ప్రతిపదార్థము

నేనుగాక = నేననే గుర్తు పరిధిలోకి రాకుండా
ఒకటి = వేరొకటి
శుద్ధ జ్ఞానము = స్వచ్ఛమైన బ్రహ్మము యొక్క స్థితి
కలదనుచు పల్కు జ్ఞానుల మాటల్ = సచ్చిదానంద లక్షణములు కలగి త్రికాల బాధ్యమైప్రకాశించుచున్నది అను జ్ఞాన మార్గీయుల సిద్ధాంతము
పూని వినదగదు = సత్యములని లెక్కలోకి తీసుకోవద్దు
శుద్ధ జ్ఞానంబున నేనె=అట్టి జ్ఞానము కూడా నేననే గుర్తుకు లోబడియే వున్నది
నేను లేనిది ఔనే = నేననే గుర్తుతో సంబంధ పడని వంటూ ఏమీలేదు

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమునందు జ్ఞానమునకు విభిన్నమైన దశలు చెప్ప

బడినవి. వ్యష్టి యందు, వుపాధి గతము చెంది విషయరూపముగా నున్నది జ్ఞానము దీనికి వేరై స్వచ్ఛమైన స్పటికాకృతితో శుద్ధ జ్ఞానమను పేర వేరే వస్తువు కలదని సిద్ధాంతీకరించబడు చున్నది. ఇట్టి వారిని జ్ఞానమార్గేయులుగా చెప్ప వచ్చును. ఇట్టి వస్తు నిశ్చయముగా విచారించిన వానికి ఇదంతయు ఒకే వస్తువు యొక్క విభిన్నరూపములని ఇదంతయు కలసియే ఎరుకనే వస్తువని పరిపూర్ణ సిద్ధాంతరీత్యా ఇది లేనిది అని, నిజము కానిదని తెలియుచున్నది.

**కం॥ నేమాత్ర ముందు ననియను నామాయలకూతలన్ని యరసిన సుప్తిన్। యేమాయె మరణమప్పుడు। యేమాయెను గురుని మాటనే మాయె నయా?॥ 237**

## ప్రతిపదార్థము

నేమాత్రముందు ననియన = బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య అను నిర్ణయవిధానము

ఆ మాయలకూతలన్నీ = మోసపూరితమైన నిర్ణయ విధానములన్నీ

అరసిన = వస్తునిశ్చయ పూర్వకముగా విచారించినచో

సుప్తిన్ ఏమాయె = సుషుప్తి అవస్తయందు ఏమైంది

మరణమప్పుడేమాయె = మరణావస్తయందు గుర్తు ఎట్లున్నది

గురుని మాటనేమాయెనయా = పరిపూర్ణబోధరీత్యా గురుర్వాక్యముచే లేక పోవుచున్న గుర్తు ఏమైనది

## తాత్పర్యము

వేదాంతశాస్త్రమునందు ప్రముఖముగా చెప్పబడుచున్న అద్వైతమునందు అధిష్టానరూపమైన బ్రహ్మవస్తువు సత్యమైనదిగాను నిత్యమైనదిగాను చెప్పబడుచున్నది. కాని పరిపూర్ణబోధయందు ఈగుర్తు లేనిదిగా చెప్పబడుచున్నది.శాస్త్రమునందు చెప్పబడినట్లుగా నిత్యమే అయినచో సుషుప్తి అవస్తయందు, మరణావస్తయందు ఎక్కడికి

పోవుచున్నది, ఏమగుచున్నది? అవన్నియు భ్రాంతి జన్యములై మోసపూరితములై వున్నవి. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా ఎరుక లేనిది. గురుర్వాక్యము (షోడశి) దీనినే స్పష్ట పరచ బడుచున్నది.

**కం॥ నేనన్న నహమహంబన। నేనెసుమీ, యుహమటంచు నేనెపుడంటే నేనపుడు బుట్టుటది। జన నేను గతించుట మటంచు నీవెరుగయ్యా॥ 238**

## ప్రతిపదార్ధము

నేనన్న అహము = నేననే గుర్తే అహంకారముగా చెప్పబడుచున్నది
అహంబన నేనె సుమీ = అహంకారమనినా నేనే
అహమటంచు నేనెపుడంటే = నేననే గుర్తునాకు ఎపుడు కలిగితే
నేనపుడు పుట్టుట = అదియే నేననే వస్తువు యొక్క పుట్టుక
అదిజన నేను గతించుట మటంచు = నేననేగుర్తు పోయిన పిదప నేను మరణించినట్లుగా
నీవెరుగయ్యా = ఈ విధముగా నీ వుత్పత్తి స్థితి, నాశనములు జరుగు చున్నవని తెలిసి కొనుము

## తాత్పర్యము

అధిష్టానమునందు నిస్సంకల్పరూపంగా నున్న బ్రహ్మము నేననేకమగుదును గాక అను సంకల్పముతో, మహదహంకారముగా పరిణామము చెందుచున్నది. కావున అహమనగా నేను, నేననగా అహము, అని సూత్రీకరించవచ్చును. నేననే గుర్తు కలిగినపుడు, నేను పుట్టుటయు, అది రద్దయినపుడు నేను లేక పోవుటయు జరుగుచున్నది. వస్తునిశ్చయపూర్వకంగా విచారించిన వారికి ఇది స్పష్టము కాగలదు.

**కం॥ నేనేన నాల్గవ దేహము। మేనన నాలోని మూడు మేనులుసుమ్మీ। నేను మేనన నదొక్కటె కానిది తనమూల మరయ। గనరాదు సుమీ॥ 239**

## ప్రతిపదార్థము

నేనన నాల్గవ దేహము=నేననే గుర్తు మహా కారణ శరీరముగా చెప్ప బడుచున్నది
మేనన నాలోని మూడు మేనులు సుమ్మీ = ఇక మేననగా, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు మూడున్నూ కూడినదిగా చెప్ప వచ్చును
నేను మేనన నదొక్కటె = నేను మేనులుగా తోచబడుచున్న దియే
కానిది = వస్తునిశ్చయముగా విచారించిన
తన మూల మరయు = తన మూలము ఆధారము విచారించిన
కానరాదు సుమ్మీ = కనిపించ లేక పోవు చున్నది

## తాత్పర్యము

మహాకారణ శరీరమును నేననే వస్తువుగాను, స్థూల, సూక్ష్మ, కారణ శరీములు 3నూ కలసి మేనుగానూ, చెప్పబడుచున్నవి. ఈ రెండునూ ఒకదానిని ఒకటి విడచి యుండవు. కావున రెండూ ఒకటే. ఈ రెంటికీ మూలము ఆధారమూ విచారించగా లేనివిగా నిజము కానివిగా లేక పోవుచున్నవి.

**కం॥ అంగము లింగము గలసుటె। లింగశరీరం బటంచు లెక్కకు వచ్చెన్। లింగం బంగమునెడిసిన। లింగముళక్కొనునేనె లింగం బనినన్॥ 240**

## ప్రతిపదార్థము

అంగము లింగము = స్థూలము సూక్ష్మము
కలసుంటే లింగ శరీరంబనుచు లెక్కకు వచ్చున్ = ఒకటిగా కలసి పనిచేయునదే సూక్ష్మ శరీరముగా చెప్పబడును
లింగం భంగం బెడసిన=పైన పేర్కొన్నవి ఒకదాని నొకటి విడిచి యుండిన
లింగము వుళ్ళక్కొను = సూక్ష్మ శరీరము లేకుండా పోవును
నేనే లింగం బనినన్ = నేననే గుర్తే లింగ శరీరముగా చెప్పబడుచున్నది

## తాత్పర్యము

స్థూలము, సూక్ష్మముగా, నేను మేనుగా, ప్రణవము ప్రజ్ఞగా, చెప్పబడుచున్న రెండు వస్తువులు కలిసి లింగ శరీరమని, సూక్ష్మ శరీరమని, గుర్తెరిగే ఎరుక యని చెప్పబడుచున్నవి. ఈ రెండును ఒకదాని నొకటి విడిచి వుండవు. కలిసియే వచ్చి పోవుచుండును. పరిపూర్ణ బోధచే పై రెంటిని, విడవబడు విధానము గురుముఖత: ధృఢపరచుకొన్నమీదట, లింగ శరీరముగా చెప్పబడుచున్న నేననే గుర్తు లేకపోవును.

**కం॥ లింగము విక్షేపంబన। నంగం బావరణమనిన నగునీ రెండే।
లింగ శరీరము దీనికి। భంగము తనమూల మరయబడి
నప్పుడగున్॥ 241**

## ప్రతిపదార్థము

లింగము విక్షేపంబున = నేననే గుర్తు విక్షేపశక్తిగాను
నంగం బావరణ మనిన = దానికి స్థూలము గాను ఆవరణ శక్తిగాను
అగు = అనగా కనిపించు
ఈ రెండే లింగ శరీరము = ఈ రెండూ కలిసియున్నదానినే లింగ శరీరముగా చెప్పబడుచున్నది
దీనికి భంగము = ఈ గుర్తు రద్దు కావాలను కుంటె
తనమూల మరయ బడినపుడగున్ = ఈ రెంటికీ మూలము ఆధారము గుర్తించి లేనివని ధృఢ పరచుకొన్న మీదట సిద్ధించును

## తాత్పర్యము

సూక్ష్మమైన లింగమును విక్షేప శక్తిగాను, దానికి స్థూలమైన అంగమును ఆవరణ శక్తిగాను చెప్పవచ్చును. ఈ రెండూ కలసియే లింగ శరీరము లేక సూక్ష్మ శరీరముగా తెలియ వలెను. జన్మ కర్మలకు ఇదియే బీజముగా చెప్పబడుచున్నది. ఇది రద్దు పరచిన గాని జన్మరహితము కలుగదు. కావున ఈ రెంటికి మూలము, ఆధారమును పరిపూర్ణబోధచే అరూఢపరచుకున్న గాని రద్దుకాజాలదు.

**కం॥ ఎరుకన మరుపనరానిది। పరిపూర్ణం బీశ్వరుడనబడు నెరు**
**కెరుకన్। మరచిన జీవుండనబడు। నెరుకచలము। నెరుగ**
**నరుగు। నెరుక మరుపులున్॥ 242**

## ప్రతిపదార్థము

ఎరుకన మరుపు అనరానిది పరిపూర్ణము = ఎరుక మరుపుల కానిది పరిపూర్ణము

ఈశ్వరుండనబడు ఎరుక =గుర్తెరిగే ఎరుకను ఈశ్వరుడుగా చెప్పవచ్చును

ఎరుకను మరచిన జీవుండనబడు=తన ఉనికిని మరచిన జీవుడని చెప్పవచ్చును

ఎరుక అచలము నెరుగ = ఇట్టి గుర్తెరిగే శరీరముతో స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము వుండజూచుకున్న

అరుగు ఎరుక మరపులన్ = ఎరుక మరుపులు లేకుండా పోవును

## తాత్పర్యము

ఎరుక మరుపు అను రెండు వస్తువులు లేనటువంటిది అచల పరిపూర్ణము. ఎరుకనే ఈశ్వరుడుగా చెప్ప వచ్చును. తన ఉనికిని మరచినప్పుడు జీవుడుగా నిర్ణయించ వచ్చును. ఇట్టి ఎరుక తన కన్యమై ఉన్నది పరిపూర్ణ మని, దాని యందు తనకు మూలముగాని స్థానముగాని లేదని గురు వాక్యముచే దృఢపరచుకొన్న మీదట ఎరుక మరుపులు లేక పోవును.

**కం॥ ఎరుకన సత్వగుణంబని। మరుపన తామస మటంచు మరి**
**యీ రెండున్। సరియైన రాజసంబని నరులెన్నిరి మూటి**
**విడువ నర్థ ము సుమ్మీ॥ 243**

## ప్రతిపదార్థము

ఎరుకను సత్వగుణంబని = గుర్తెరిగే తెలివిని సత్వగుణంబని

మరుపన తామసంబటంచు=మరుపు రూపముగానున్న శరీరము తామసగుణమని

మరిఈ రెండున్ సరియైన రాజసంబని = ఈ శరీరము, గుర్తు రెండూ కలసి వున్నదానిని రజోగుణమని
నరులెన్నిరి = విజ్ఞాన వంతులు నిశ్చయించినారు
మూటి విడువ నరహము సుమ్మీ = పరిపూర్ణ బోధచే వస్తునిశ్చయ పూర్వకముగా విచారించి ఈ మూడింటిని విడువ వలసి యున్నది

## తాత్పర్యము

అధిష్టాన బ్రహ్మము నుండి నేననేకమగుదును గాక అని సంకల్పముతో త్రిగుణాత్మకమైన సత్వ గుణముతో దేవతా సృష్టి, రజో గుణముచే జీవ సృష్ఠి, తమోగుణముచే జగసృష్ఠిగా నేననేగుర్తును సత్వ గుణముగాను, మరుపనే శరీరమును తామసముగాను, నేననే గుర్తు శరీరము రెండు కలసి రజోగుణముగాను మహనీయులు భావించి ఉన్నారు. జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ఈ మూడు గుణములను వీటి ఏకైక స్వరూపము గుర్తెరిగే శరీరమును విడువ వలసి ఉన్నది.

**కం॥ తన్నెరుగ నట్టి బయటన్। యెన్నడు లేనట్టి నేను యీ**
**విశ్వమునై। వున్నట్టులుండి నేలేందున్నదిగని। నేనుబోతె**
**దుందణగు సుమీ॥ 244**

## ప్రతిపదార్ధము

తన్నెరుంగ నట్టి బయటన్ = తాను (నేను), ఇతరము అనుగుర్తులేక తానుతానుగా స్వతఃసిద్ధమైయున్న అచల పరిపూర్ణము నందు
ఎన్నడూ లేనట్టి=ఏ కాలమునందు, మూలముగాని స్థానముగాని లేక తోచబడు
నేను = ఈ గుర్తెరిగే శరీరము
ఈ విశ్వమునై = ఈ ప్రపంచముగా పరిణామము చెందు
వున్నట్టులుండి = వున్నట్టుగా తోచబడుచు
నేలేంది = నేననే గుర్తులేనిది
వున్నది = స్వతఃసిద్ధమై వున్నది
గని = వస్తునిశ్చయ పూర్వకముగా విచారించి

నేను పోతే = ఈ గుర్తును విడిచి పెడితే
దుందణగు సుమీ=ఎట్టి పరిణామ క్రమమునకు లోను కాకుండా చలన స్థితి రద్దగును

## తాత్పర్యము

తను, ఇతరము అను గుర్తులేకుండా స్వత:సిద్ధమైయున్న అచల పరిపూర్ణము నందు మూలముగాని, స్థానముగాని లేక తోచబడుచున్న ఈ నేననే గుర్తు, ఈ విశ్వ కారకమై తన ప్రయత్నముచే నేననే గుర్తులేని అచల పరిపూర్ణమును గురుర్వాక్యముచే వస్తునిశ్చయ పూర్వకముగా దృఢ పరచుకొని, గుర్తును విడిచి యుంటే ఈ పరిణామరూపమైన, జనన మరణములు రద్దు కాగలవు.

**కం॥ ఈ యచల మొక్కటే బ్రహ్మని। మాయామయమైన విశ్వమంతయు నేనంచాయ మెరుంగక ననునరు। లీయెడ బ్రహ్మం బటంచులెక్కిడనగుదున్॥ 245**

## ప్రతిపదార్థము

ఈ అచలమొక్కటే బ్రహ్మని = అచల పరిపూర్ణమొక్కటియే సత్యమైనదని, శాశ్వతమైనది అని
మాయా మయమైన = లేకనే తోచబడుచున్న
విశ్వమంతయు = ఈ ప్రపంచమంతయు
నేనంచాయ నెరుంగక = నేనుండే పరిణామము చెందినవి అను రహస్యమును తెలుసుకొనలేక
నను నరులు = నావిషయమై విజ్ఞాన వంతులు
ఈ ఎడ = ఈ విషయములో
బ్రహ్మం బటంచు = పరిపూర్ణ పరబ్రహ్మమని
లెక్కడగా = నిర్ణ యించగా
అగుదున్ = అవుతానా కాబోను అని భావము

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన అచల పరిపూర్ణమొక్కటియే సత్యమని అదియే పరబ్రహ్మము అనేశబ్ధముచే సూచింపబడుతున్నదని, దానియందు లేకనే తోచబడుచున్న మాయా మయమైన నేననే గుర్తు చేతనే ఈ ప్రపంచమాయెనను రహస్యము సామాన్యులు గుర్తించలేక, నాపూర్వ స్థితినే అచల పరిపూర్ణముగా భావించు చున్నారు. ఇది సత్యమైన విషయముకాదు.

**కం॥ భూమను భద్రాచలమని। రాములనుచు లేని। నన్న
రక్షణముననే మీమాట నెరిగుళ్ళుక్కని। నామాటను మరచు
యునికి నయమని తోచెన్॥ 246**

## ప్రతిపదార్ధము

భూమను భద్రాచలమని=కదలిక అచలమైవున్న పరిపూర్ణమును భద్రాచలమని
రాములనుచు లేని నన్ను = లేక తోచబడుచున్న నేననే గుర్తును రాముని గాను
లక్షణమున = బాగుగా, స్పష్టముగా
నే మీమాట నెరిగి = మీరుప్రబోధించిన పరిపూర్ణ భావమును దృఢపరచుకొని
వుళ్ళుక్కి = నిజము కానిది, లేనిది
నామాటని = అని దృఢ పరచుకొని
మరుచు యునికి = విడిచి పెట్టి యుండుటయే
నయమని తోచెన్ = శ్రేష్టమైనదిగా, సరియైనదిగా చెప్ప బడుచున్నది

## తాత్పర్యము

కదలిక లేక స్వత:సిద్ధమైయున్న అచల పరిపూర్ణమును భద్రాచలముగాను, నేననే గుర్తెరిగే శరీరమును, శ్రీరామునిగాను, నిశ్చయించు కొని, అందు నేనను గుర్తును లేని వానిగా దృఢ పరచుకొని మీరు బోధించిన విధానాను సారముగా, నేను లేనని నన్ను నేను విడిచి యుండుటయే సరియైన న్యాయమని, భ్రాంతి రహిత విధానమునకు ఇట్టి ఆరూఢత సరిపోతుందని తెలుసుకున్నాను.

**కం॥ నాగురుడు నాకు తెల్పిన। ఈ గురుబోధంత మీకు యిప్పుడు నేనున్। బాగుగ వినజెప్పితిసుమి। యో గురువర్య యని శిష్యుడూరకయున్నన్॥ 247**

## ప్రతిపదార్థము

నాగురుడు = నాకుపదేశ దీక్షను అనుగ్రహించిన గురుమూర్తి
నాకు తెల్పిన = నాకు దృఢ పరచిన
ఈ గురుబోధంతా = పరిపూర్ణ భావమంతా
మీకు యిపుడు = ఈవిధముగా చెప్పమని కోరిన మీకు
నేనున్ బాగుగా వినజెప్పితి సుమ్మీ = నేను గ్రహించిన దంతా స్పష్టముగా మీముందుంచినాను
ఓగురువర్యా = ఓ శ్రేష్టమైన గురుస్వామీ
అని = పై విధముగా పేర్కొని
శిష్యుడు వూరక వున్నన్ = శిష్యుడు నిశ్శబ్ధరూపుడై నిలచి వుండగా

## తాత్పర్యము

జన్మకర్మలనుండి విముక్తి కలిగించెదనని అభయప్రధాన మొసగిన ఉపదేశ గురువు వస్తునిశ్చయపూర్వకంగా ప్రబోధించిన పరిపూర్ణ భావము నంతటినీ స్పష్టముగానేను గుర్తించినంత వరకు దృఢపరచుకొన్నమేరకు మీరుకోరిన విధముగా మీముందుంచితిని. ఓశ్రేష్ఠమైన గురుస్వామీ అని శిష్యుడు పల్కి శిష్యుడు మౌనము వహించెను.

## గురుని హర్షము

కందార్ధ రచనయందు లేనిది, కంద పద్యములయందు ప్రత్యేకముగా చెప్పబడుచున్నది ఈ అంశములే. అనగా పరిపూర్ణ భావమును, గురువు ప్రబోధించుట శిష్యుడు దృఢపరచుకొనుట, శిష్యుని ఆరూఢతను గురువు పరీక్షింప గోరుట, శిష్యుడందుకు సంసిద్ధుడై తన గ్రహింపును గురువు ముందుంచుట అనునవి ఈ రచన యందు ప్రత్యేక

లక్షణములు. గురుర్వాక్యము యధాతధాగా స్వీకరించిన శిష్యుడు వినుట, చెప్పుట అను ప్రక్రియలందు ఎట్టి ఆదర్శము పాటించునది ఇందు స్పష్టముగా తెలియు చున్నది. కానీ ప్రబోధించిన అంశము వున్నదున్నట్లుగా గ్రహించుటయే గాక చెప్పగలుగుట కూడా ఒక ప్రత్యేకమైన యోగ్యత గనుక విన నేర్పు చెప్పనేర్పు కలిగి యున్నదే పరిపూర్ణ భావము కనుక ఈ అంశము గురునికి ఆనంద దాయకమై యున్నది.

**కం॥ విని శిష్యుని వచనోక్తులు। మనమున హర్షించి గురుడు।**
**మస్తకమున జెయ్యునిచి తొడమీద జేర్చుక తన శిష్యుని**
**మేనుని మిరితానిట్లనియెన్॥ 248**

## ప్రతిపదార్థము

శిష్యుని వచనోక్తులు = పై విధముగా శిష్యునిచే చెప్ప బడిన పరిపూర్ణ భావమునకు సంబంధించిన వున్నతమైన మాటలను, చెప్పు విధానము
విని = అత్యంత శ్రద్ధతో గమనించి
మనమున హర్షించి గురుడు = గురుమూర్తి తన మనస్సులో చాలా సంతోషముచెంది
మస్తకమున చేయినిచ్చి = తన హస్తమును శిష్యుని శిరస్సుపై నుంచి
తొడ మీద చేర్చుక = తన కుడి తొడ భాగమున కూర్చుండ బెట్టుకొని
తన శిష్యుని మేను నిమిరి = తన శిష్యుని వీపు భాగమున స్పర్శిస్తూ
తానిట్లనియెన్=తాను పొందిన సంతోషమును ఈ క్రింది విధముగా చెప్పుచున్నారు

## తాత్పర్యము

పైన పేర్కొన్న విధముగా తన గురుమూర్తి కోరిన విధముగా శిష్యుడు తాను గ్రహించిన పరిపూర్ణ భావమును వున్నదున్నట్లుగా, తన ముందు వ్యక్తీకరించగా అత్యంత శ్రద్ధతో అవి విని తన మనస్సు నందు మిక్కిలి సంతోషము చెంది అత్యంత ప్రేమగా శిష్యుని మస్తకమునందు తన శ్రీ హస్తము నుంచి ప్రేమ వాత్సల్యములు, అనుగ్రహము వుట్టి పడునట్లుగా, తన కుడి తొడ భాగమున శిష్యుని చేర్చుకొని శరీరమందలి

వెన్ను భాగమును స్పర్శిస్తూ అత్యంత వుత్సాహముతో ఈ విధముగా తన ఆనందమును, వ్యక్తపరచు చుండెను.

**కం॥ నీవంటి ఘట్టి వాడిక। భూవలయము నందు ముందు బుట్టడు వెనకన్। నేనిక లేదున్నాడం। చీవేళ్ళకు నిన్నె చూస్తి నిట భళిశిష్యా॥ 249**

## ప్రతిపదార్థము

నీవంటి గట్టి వాడు = ఈవిధముగా అచల పరిపూర్ణ భావమును వున్నది వున్నట్లుగా విని దృఢపరచుకొని చెప్పగలిగే నేర్పరితనము సంపాదించినవాడు
భూ వలయమునందు = ప్రపంచమునందు
ముందు పుట్టడు = ఇక ముందు వుండడు
వెనుకన్ నేవినలేదు = గతంలోను నేను వినలేదు
వున్నాడంచు = వుంటాడు అనే మాటను
ఈ వేళకు = ఇట్టి పరిస్థితుల్లో
నిన్ను చూస్తి = నిన్ను చూస్తున్నాను
ఇట = ఈసంధర్భంలో
భళీ శిష్యా = చాలా గొప్పదైన శిష్యుడవు గదా

## తాత్పర్యము

పరిపూర్ణ బోధ చాలా అరుదై అపూర్వమై జన్మ శుకృతము చేగాని సాధ్యపడనిదిగా శాస్త్రము నందు చెప్పబడుచున్నది. ఈ ప్రపంచమునందు కోటి కొక్కరుగా చెప్పబడుచున్న ఈ అంశము నీద్వారాబుుజువగు చున్నది.నీవంటి యోగ్యుడు ఈ సమాజమునందు చాలా అరుదుగా కనిపించెదరు. వుండరు కనిపించరు అనుమాట నిను చూచినపిదప అసత్యముగా తోచుచున్నది. నీవంటి యోగ్యుడు గొప్పవాడు ఈ సంద్భముగా వునికి కలిగి యుండుట నేను గమనించి యున్నాను.

**కం॥ చందురుని చీమ ముద్దాడిందని నట్లిపుడు। నీవుయీ సద్బోధన్।
జెందితివి నీకు సరి జగమందెవ్వరు లేరు నిన్ను మది
మెచ్చితిరా॥ 250**

## ప్రతిపదార్థము

చంద్రుని చీమ ముద్దాడిందనునట్లు = జీవో పాదులందు అత్యంత అల్పమైన వుపాధి కలిగిన చీమ భూ మండలమునకు ఎన్నో యోజనముల దూరములో నున్న చంద్ర మండలము చేరుకొన్నది, అను అంశము ఎంత విచిత్రమైనదో
యిపుడు = ఈ సంధర్భముగా
నీవు = శిష్యుడవైన నీవు
ఈ సద్బోధను చెందితివి= శ్రేష్టమైన పరిపూర్ణ భావమును దృఢపరచుకొంటివి
నీకు సరి = నీతో సర సమానమైన వారు
జగమందెవ్వరూ లేరు = ఈ ప్రపంచము నందెవ్వరూ వుండరు
నిన్ను = యిట్టి యోగ్యత కలిగిన నిన్ను
మది మెచ్చితిరా = నా మనస్సులో గొప్పవానిగా గుర్తించుచున్నాను

## తాత్పర్యము

జీవో పాదులయందు అత్యంత సూక్ష్మమైన చీమ భూ మండలమునకు ఎన్నోమైళ్ళ దూరములో వున్న చంద్రమండలమునకు చేరుట అనునది ఎంత అరుదైన అపూర్వమైన విషయమో మానవో పాధికి చెంది, గృహస్తాశ్రమమునందుండిభుక్తి ముక్తి క్రియల రెంటి యందు పరిపూర్ణత్వము సంపాదించుటకు ఈ పరిపూర్ణ భావమును లక్ష్యముగా చేసుకొని కృషి చేసి దృఢ·పరచుకొని, అట్టి స్థితియందు వునికి కలిగి యుండుట కూడా అంతే సమాన మగును. నీతో సరిపోల్చగలవారు ఈ ప్రపంచము నందు వేరొకరుండజాలరు. ఇట్టి విధానము నాకు ఆనంద దాయకమై సంతోషదాయకమై వున్నది. కావున నీ కృషిని ఆరూఢతను, నా మనసు నందు సంతోషముగా అభినందించు చున్నాను.

## గురు దక్షిణ

వేదాంత శాస్త్రమునందు గురుశిష్యన్యాయము కొన్నివిలువలు ఆదర్శముతో కూడి యున్నది. అందున పరిపూర్ణ భావమునందు ఇంకనూ విలువైన ఆదర్శములు కలిగి యున్నవి. సర్వార్పణ బుద్ధితో తన సర్వస్వము గురునివిగా భావించి జీవించ గలుగుట శిష్యధర్మమై యున్నది. శిష్యుని పారమార్థిక పురోభివృద్ధి తప్ప ఎట్టి స్వప్రయోజనము ఆశించక తనకున్న సర్వస్వము తన శిష్యునకు ధారాదత్తము కావించి తన్ను మించిన వానిగా తీర్చి దిద్ది లోక కళ్యాణమునకు, పరంపరాభివృద్ధికి శిష్యుని అందుకు తగిన యోగ్యునిగా మలచుట గురుధర్మమై ఉన్నది. ఒకరి కొకరు ఆదర్శ వంతులై ఒకరి నొకరు ప్రభావితులను కావించు కొనుచు ధర్మా చరణకే వన్నె తీసుకు రాగలిగే విలువలు కలిగి ఉందురు. బోధయందు సమగ్రమైన వివరణ ద్వారా దృఢపరచి ఆరూఢత గాంచిన శిష్యుని నుండి గురువు ప్రతి ఫలముగా శిష్యుని యందు తనకు గల కోరికను కోరుట తడవుగా శిష్యుడు వెంటనే దానిని అమలు పరచుట అతి ముఖ్యమైన అంశముగా యిందు చెప్పబడుచున్నది. పరిపూర్ణ భావమునందు స్థితి కలిగి యుండుటకు శిష్యుని ఎడల గురువు పాటించగలుగు అపూర్వమైన సంధర్భము ఈ గురుదక్షిణ. పురాణ ఇతిహాసములందు ఇట్టి ధర్మ నిర్వహణ గావించి లోకమునకు ఆదర్శ వంతులుగా పురాణ పురుషులే ఆదర్శ పురుషులుగా నిలిచి ఉన్నారు. కోరుట, ఇచ్చుట, అమలు పరచుట అను ప్రక్రియ ఇందు చాలా విశిష్టమైనది.

**కం॥ అన మెచ్చి యేమి యిచ్చెద। వని గురుదక్షిణ నటంచు**
**నతడడిగిన నన్నని పల్కె శిష్యరత్నము। విని యిది యిక**
**బుట్టబోక విహరించుమనన్॥ 251**

## ప్రతిపదార్థము

అని మెచ్చి = పైన పేర్కొన్న విధముగా శిష్యుని ఆరూఢతను ప్రశంశించి ఏమిచ్చెదవు అని గురు దక్షిణ నటంచు అతడడిగిన = గురుదక్షిణగా

తనకు ఏ మిసమర్పించతలచెనో అని గురుమూర్తి శిష్యుని అడుగగా
నన్నెనె పలికే శిష్యరత్నము = నేననే గుర్తెరిగే శరీరముతో సహా నేను మీకు
సమర్పణగావింపబడుచున్నాను అని శిష్యుడు పలుకగా
విని = గ్రహించి
ఇది = ఈ గుర్తెరిగే శరీరమును
ఇక ముట్టబోక = నేను నీవు అను అహంకార మమకారములు విడిచి
విహరించు మనన్ = ప్రవర్తించ వలసినదిగా నడవవలసినదిగా,
జీవించవలసినదిగా, కోరెను.

## తాత్పర్యము

పైన పేర్కొన్న విధముగా శిష్యుని బోధయందు ఆరూఢత, శిష్యుని నోటి ద్వారా విని మనసులో అత్యంత ఆనంద భరితుడై, ఈ విధముగా పరిపూర్ణ బోధచే దిద్ది, తీర్చి ముందుకు వెళ్ళ గలిగేలా ప్రబోధించిన గురునగు నాకు గురు దక్షిణగా ఏమి సమర్పించుకొందువు, అని శిష్యు నడుగగా, ఎట్టి సంకోచము లేక నిర్భయముగా, నేననే గుర్తెరిగే శరీరముతో సహా తనకు తానుగా, గురువు కోరిన విధముగా దక్షిణగా నన్ను నేను సమర్పించు కొను చున్నాను. అని శిస్యుడు పలుకగా అది విని గురు మూర్తి, ఈగుర్తును నేను నాది అను అహంకార మమకారములు విడచి గురుర్వాక్యం యథాతథాగా జీవించ వలసినదిగా శిష్యుని ఆదేశించెను. ఇది యే కర్తృత్వ రహిత కర్మాచరణతో కూడిన అశరీర పద్ధతిగా చెప్పబడు చున్నది.

## బోధ స్థితి నిర్ణయము

గురువు శాశించిన విధము తన్ను తానుగా గురువునకుధర్మమునకు సమర్పణ గావించుకొని పరిపూర్ణ స్థితి యందు వునికి గలిగి, నేను నాది అను అహంకార, మమకారములకు తావివ్వకుండా స్థితి లక్షణము పొందిన విధానము అందలి విశిష్టత, విలువలు లౌకిక జీవనమునందు భుక్తి ముక్తి క్రియల పరిపూర్ణత్వము మున్నగు అంశములను, శిష్యుని వునికి

ఎట్లుండునని ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ విని శిష్యుడు గురుమూర్తిని కనుగొని చిత్తరువు ప్రతిమగా**
**నిలిచున్నన్। తన శిస్యుని హస్తములన్ గొని దగ్గర దీసికొని**
**కొడుకాయనుచున్॥ 252**

## ప్రతిపదార్థము

విని = సద్గురు మూర్తి తననుండి కోరిన విధము, విలువ గుర్తించి
శిష్యుడు = శిష్యుడు
గురుమూర్తిని కనుగొని = తనకుపదేశికుడైన గురుమూర్తి ముందు
చిత్తరువు ప్రతిమగా = చిత్తరువు నందు చేష్టలుడిగి నిలుచున్న బొమ్మవలె
నిలుచునన్నన్ = వునికి కలిగి వుండగా
తన శిష్యుని హస్తములన్ గొని=యోగ్యుడైన తన శిష్యుని రెండు చేతులను పట్టుకొని
దగ్గరతీసుకొని = తనకు అతి సమీపముగా చేర్చుకొని
కొడుకా అనుచున్ = కుమారా అని పిలుచుచూ

## తాత్పర్యము

గురువు కోరిన విదముగా శిష్యుడు తనకు తానుగా అర్పణ గావించుకొని చేష్టలుడిగి చిత్తరువులో బొమ్మవలె గురుని ఎదుట నిలచియుండగా, అట్టి శిష్యుని చేతులను తనకు దగ్గరగా తీసుకొని చేరదీసి ప్రశంశా పూరకముగా తన పుత్రుని తనకు దగ్గరగా తీసుకొన్న విధముగా చేర్చుకొని ఈ క్రింది విధముగా ఆశీర్వదించు చున్నాడు.

**కం॥ పరమ హంసాశ్రమ ధరుని। పరిపూర్ణపుబోధవాని పనులు**
**సమమె। వార్నెరి గెరుగక సుతి నిందలు। గరపిన తత్ఫలము**
**ప్రజలకగు నిజము సుమీ॥ 253**

## ప్రతిపదార్థము

పరమహంశాశ్రమ ధరుడు = తన స్వస్వరూప జ్ఞానము నందు ఆరూఢత చెంది నిర్వాసనా మౌనము, నిష్ఠాస్థితి అగు తురీయ స్తితిని చెంది లౌకిక

వ్యవహారములందు తగులక బ్రహ్మ భావనయందే ఉనికి కలిగి యున్నవారు
పరిపూర్ణ బోధ = జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణ ఎరుకలను ఎరిగి ఎరుకను మాని, సర్వభ్రాంతి రహిత స్థితిని చెందినవాడు
వాని పనులు సమమె+=పైన పేర్కొన్న వారు చేయు పనులు ఒకటిగా కన్పిస్తాయి
వార్నెరిగి = పరమ హంసాశ్రమధరుని గొప్ప తనాన్ని గుర్తించి
ఎరుగక = పరిపూర్ణ భావజ్ఞుని గొప్పతనాన్ని గుర్తిచి
నుతి నిందలు గరపిన = పొగుడుట, నిందించుట అను రెండు క్రియలుజరిపిన ఎడల
తత్ ఫలము = అట్టి పని వల్ల వచ్చిన ఫలితము
ప్రజలకగు = అట్టి క్రియలొనర్చిన వారికి చెందగలదు
సుమీ = ఇది అత్యంత సత్యమైన విషయము

## తాత్పర్యము

హంస అనగా ప్రాణము అని అర్థము. యోగ శాస్త్రపరిభాష యందు హంస అను శబ్దము అచల హంస, కలహంస, జీవ హంస అని పేర్లు కలవు. అజ్ఞానమును వీడి జ్ఞానము పొందుటచే 'కలహంస' అని, ప్రాణ వాయువుతో చేరి జీవ ధర్మమైన చైతన్యము పొందునపుడు జీవ హంస యని, అచల పరిపూర్ణ స్థితి చెంది ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆది దైవిక వ్యవహారము లేక ఏకస్థితి నొందుట అచల హంస అని, గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకంగా పరిపూర్ణము ఎరుకల నెరిగి, ఎరుకను విడిచి అశరీర పద్ధతినందు జీవించుటయే 'పరమ హంస' నిర్ణయము. పరిపూర్ణ స్థితియని శ్రీ దయానందుల వారు తాము రచించిన తారకామృతసార పరమహంస ప్రబోధిని అను గ్రంథమునందు సిద్ధాంత పరచినారు. వేదాంత శాస్త్రమునందు పరమహంప శబ్దము ప్రత్యేకమైన రీతిలో చెప్పబడుచున్నది. గృహస్తధర్మమును విడిచి సర్వసంగ పరిత్యాగియై గురూపదిష్ట మార్గమునందు తాను దృఢ పరచుకొన్న బ్రాహ్మీ స్థితిని నిరంతరము

అనుసంధానము చేయు, పాలనుండీ నీటిని వేరుచేయు హంసవలె లౌకిక వ్యవహారములు విసర్జించి, శరీర ధర్మములు, ఇంద్రియ ధర్మములు దాటి తురీయావస్థయందు జీవన వ్యవహారశైలి కలిగి ఉండును. వీరిని 'పరమహంస పరివ్రాజకాచారులు' అను పేరుతో ప్రాపంచీకులు గౌరవించి వారిగొప్ప తనాన్ని, ఆదర్శాన్ని కొనియాడతారు. ఇక పరిపూర్ణ భావజ్ఞుని స్థితి ఎట్టి దనగా గురుప్రబోధచే ఉన్నపరిపూర్ణమును లేని ఎరుకను స్పష్టముగా దృఢపరచుకొని ఎరుకను విడిచి అశరీర పద్దతిలో గురుర్వాక్యం యథాతథాగా కర్తృత్వ రహిత కర్మాచరణతో కూడిన జీవన విధానముచే భుక్తి ముక్తి క్రియల రెంటినందూ పరిపూర్ణత దనరుచు ఎట్టి భ్రమ, ప్రమలకు లోనుకాక సామాన్యుని వలె రాజయోగ ధర్మమును పాటిస్తూజీవించును. పైన పేర్కొన్న రెండులక్ష్యములూ గలవారి జీవన విధానమునందు బేధము కలదు. ఒకరు సంగత్వము విడిచి అసంగులై జీవించుట, రెండవ వారు సంగాసంగములు రెంటినీ విడిచి అచల పరిపూర్ణ స్థితిని దనరుట అను విధానము తెలియు చున్నది. వీరి జీవన విధానమందు, వ్యవహార శైలి యందు తరతమ బేధము కలవు. ఒకరు గొప్పవానిగా పైకి గోచరించేవారు, ఒకరు సామాన్యుని వలెగోచరింపని వారు. ఈపద్ధతిచే వారిని మహాత్ములని, వీరిని సామాన్యులని అనుట సరికాదు. అట్టి బేధ పద్ధతిచే గుర్తించి వ్యవహరించిన వారికి వారి వారి గొప్పతనములను, విలువలను స్పష్టముగా గుర్తించి గౌరవింప కుండుట అను దోషముచే వాటి ఫలము అట్టి వారికే సిద్ధించును అని భావము. ఈ పద్యము ద్వారా పరిపూర్ణ భావజ్ఞుని యొక్క ఆచరణాత్మకమైన, ఆదర్శ వంతమైన జీవితమును, విలువను స్పష్టముగా తెలియ పరచుట జరుగుచున్నది.

**కం॥ అర్థము దెలియక గ్రంథము। వ్యర్థంబని నిందజేయు వ్యర్థుల**
**మాటల్। వ్యర్థములని యీ గ్రంథం। బర్థము సద్గురుని వలన**
**బాగుగ వినుడీ॥ 254**

## ప్రతిపదార్థము

అర్థము = భావము లేక విషయము
తెలియక = అనుభవమునకు రాక
గ్రంథము వ్యర్థంబని = ఈ గ్రంథమే పనికిరాదని, నిష్ప్రయోజనమని
నిందజేయు = విమర్శించే లక్షణము గల
వ్యర్థుల మాటల్ = విలువ లేని మాటలను
ఈగ్రంథమర్థము = పరిపూర్ణ భావమును స్పష్ట పరచుటకు వ్రాయబడిన
ఈ పుస్తకమును = అందలి వస్తు నిశ్చయ పూర్వకమైన ప్రబోధను
సద్గురుని వలన=అట్టి భావమందు, బోధయందు ఆరూఢత చెందిన మహాత్ముని ద్వారా
బాగుగా వినుడీ=వస్తునిశ్చయ పూర్వకముగా దృఢ పడునట్లుగా శ్రద్ధ కలిగి జనన మరణ భ్రాంతి రహితము కలిగించు కొనుటకు యోగ్యమైన అర్హతతో వినండి

## తాత్పర్యము

ఈగ్రంథమునందు నిక్షిప్తమైన పరిపూర్ణ భావము కేవలము పుస్తక పరిశీలన వలన తెలియబడునది కాదు. చదువుట అను ప్రక్రియ చేత మాత్రమే సిద్ధాంత నిరూపణ తెలియజాలదు. ఇందు వస్తు నిశ్చయపూర్వకంగా పరిపూర్ణ బావము సిద్ధాంతీకరింపబడి సామాన్యులకు కూడా అవగాహన కలిగే పద్దతిలో గురుశిష్య న్యాయములో ప్రబోధనా పద్ధతిచే ఒక క్రమములో నిర్దేశింపబడి రచింపబడి ఉన్నది. జనన మరణ భ్రాంతి రహిత విధానమే దీని చరమ లక్ష్యము. ఇట్టి విధానము జిజ్ఞాసతో ఎవరైనా తెలియ దలుచుకుంటే ఈగ్రంథమును వారిస్వంతఊహాపోహలతో చదివి గ్రహించక, బోధయందు, సిద్ధాంతమందు గట్టి దృఢత్వము కలుగును. తన జీవన విధానము ద్వారా ప్రపంచమునకు అందించ గలిగే మహాత్మునిద్వారా మాత్రమే వివరణ పొందవలస యున్నది. ఈ క్రమ పద్ధతి చేతనే ఈ గ్రంథమందు జనన మరణ రహిత విధానమునకు మార్గముగా చెప్పబడుచున్న పరిపూర్ణ బోధయొక్క స్వరూప స్వభావములు ఆరూఢ విధానము స్పష్టముగా తెలియ గలదు.

**కం॥ ఈచెప్పిన గురుబోధను। తా చెవినెడి బయలుగాంచి తన లేమి నిజంబై చనియె, శిష్యుడప్పుడు లేచెను గురుడవల, మాటలేదా మీదన్॥ 255**

## ప్రతిపదార్ధము

ఈ చెప్పిన గురుబోధను = పైన పేర్కొన్న విధానముగా వస్తునిశ్చయ పూర్వకముగా తానువిన్న పరిపూర్ణ భావమును

తా చెవినిడి = తన మనసునందు బాగా దృఢపరచుకొని

బయలుగాంచి = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము యొక్క ఉనికిని గమనించి

తనలేమి నిజంబై = అందు మూలముగాని స్థానముగాని లేక తోచబడుచున్న గుర్తెరిగే శరీరము లేనిదని స్పష్టముగా గుర్తించి

చనియె శిష్యుడపుడు = తన గుర్తును విడచిన వాడయ్యేను

అపుడు లేచెను గురుడు=ఆవిధముగా గురుడు బోధను చెప్పుటఅను క్రమమును ఆపివేసెను

అవల = ఆపైన

మాట లేదాయె మీదన్ = చెపుట, వినుట అను ప్రక్రియ ఆగి స్థితి మిగిలెను

## తాత్పర్యము

ఈ విధముగా పరిపూర్ణ భావమును అందలి వాస్తవికతను గురుప్రబోధ ద్వారా విన్న శిష్యుడు, అందలి ముఖ్యాంశములు తన మనస్సునందు దృఢపరచుకొని పరిపూర్ణము స్వతఃసిద్ధమై ఉన్నదని అందు గుర్తెరిగే శరీరమునకు మూలముగాని స్థానముగాని లేదని గుర్తించి గురును విడిచిన వాడయ్యేను. వినుట అను ప్రక్రియ ఆగినది గనుక చెప్పుట అను ప్రక్రియ కూడా నిలచి పోయెను. ఈ విధముగా గురుశిష్యుల బోధప్రక్రియలు లేకపోయిన మీదట ఏ నిర్ణయము చేయలేని స్థితి అనునది మిగిలి యుండెను. ఈ విధముగా గ్రంథ రచనఅనునది కూడా ముగియనున్నది అని తెలియ వలెను.

## గ్రంథ సమాప్తి

ఈ విధముగా జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా నిర్దేశింపబడుతూ, చెప్పబడిన పరిపూర్ణ భావము కందపద్య రచన ప్రారంభించిన నాటినుండి ముగించుట కొరకు వున్న సందర్భముగా, సంఘటనలు, గ్రంథపలము మొదలగునవి ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ శరధి కరితురగ శితకర(1784) పరిమితమైనట్టి శాలివాహన।**
**శకమందు రచిస్తి మాఘ పౌర్ణిమ। వరకివి దుందుభి యనేటి**
**వత్సరమపుడున్॥ 256**

## ప్రతిపదార్థము

యా శరధి కరితురంగ శతకర = శరధి అనగా సముద్రము
కరి అనగా అష్ట దిగ్గజములు తురంగమనగా గుఱ్ఱములు
శత కరుడనగా = చంద్రుడు అనగా 1784సం॥
పరిమితమైనట్టి = సంబందించినట్టి
శాలివాహన శకమునల = శాలి వాహన శతాబ్దము నాటికి
రచయిస్తి = రచన పూర్తి గావింప బడినది
మాఘ పౌర్ణమి వరకు = మాఘ పౌర్ణమి నాటికి
యివి = ఈ పద్యములు
దుందుభి అనెడి వత్సరము=అపుడు దుందుభి నామ సంవత్సరము జరుగుచున్నది

## తాత్పర్యము

దుందుభినామ సంవత్సరం, మాఘశుద్ధ పూర్ణిమ శాలివాహన శకం, 1784సం॥ నాటికి క్షరా క్షరోపాధి ద్వయదోషరహిత పరమ తత్వములు అను పేర ఈ పద్యరచన పూర్తి గావింపబడినది.

**కం॥ పది యిరువై యైెదులు యీ। సదమల కందములు**
**వీట్ని(250) సదయా మతులై। ముదమున మీరు వినెదరని**
**మది లోపల దలచి చేస్తి మానవులారా॥ 257**

## ప్రతిపదార్థము

ఓ మానవులారా = మనస్సు విశేషముగా వికసించినవారా
పది ఇరవై అయిదు = 250 సంఖ్య కలిగిన
ఈ సదమల కందములు = జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా చెప్పబడుతున్న
వీట్ని = ఈ కందపద్యములను
సదయామతులై = ఎవతో దూరదృష్థితో ప్రయోజనం కలుగుతాయని
ముదమున = అత్యంత ప్రేమ శ్రద్ధలతో
మీరు వినెదరని = మీరు శ్రద్ధగా వినగలరని
మదిలోపల తలచి = నామనస్సులో గట్టిగా భావించి
చేస్తి = రచియించ గలిగినాను

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గమును ప్రతిపాదిస్తూ అపరిపూర్ణ భావమును 250 సంఖ్యతో అత్యంత భక్తి శ్రద్ధలతో మీరు వినెదరని భావించి వస్తునిశ్చయ పూర్వకమైన పద్ధతియందు రచించి మీముందుంచినాను.

**కం॥ ఇతర మెరుంగని సతమందతి మృషయై కానుపించు। నట్టి మనము। యీాకృతి గురుశిష్యులు। వారల యితరేతర వాగ్విలాసమివి మృసలు సుమీ॥ 258**

## ప్రతిపదార్థము

యితర మెరుంగని = తనగురించిగాని యితరుల గురించి గాని సంబంధపడక స్వత:సిద్ధమైయున్న అచల పరిపూర్ణము నందు
సత మందతి మృషయై కానిపించు = మూలముగాని స్థానము గాని లేక భ్రాంతి కారకముగా తోచబడుచున్న
మనము = విచారించే మనము

ఈ కృతి = ఈ గ్రంథమునందు
గురుశిష్యులు = బోధించినట్టి గురువు, వినునట్టి శిష్యులు
వారల = వారల గూర్చి
యితరేతరవాగ్విలాసము = యితర సాంప్రదాయమునుగూర్చి సిద్ధాంత, రాద్ధాంతములు
యివి మృషలు సుమీ = నిజము కానివని తెలుసు కొనుము

## తాత్పర్యము

సర్వలక్షణ విలక్షణమై స్వత:సిద్ధమై యున్న అచల పరిపూర్ణము నందు మూలముగాని స్తానముగాని లేకనే తోచబడు గుర్తుచే గురు శిష్యులుగా ఈ గ్రంథ రచనయందు పరిపూర్ణ బోధతో పాటుగా, ఇతర సాంప్రదాయక మందలి చర్చలు, సిద్ధాంతములు వాదోపవాదములు నేనెరిగించినవి, మీ రెరిగినవి అన్నియు కూడా అసత్యములుగా భావించవలెను.

## గ్రంథ పలశ్రుతి

అనగా ఈ గ్రంథముయొక్క ప్రయోజనము, నిర్మిత విధానము అందలి బోధనాంశములు మొదలైన అంశములన్నియు గమనించుటచే, దీనిని చదువుట పాడుట,వినుట అను ప్రక్రియల యందు ఆసక్తి కలుగును. ఈ ఆలోచనతో అట్టి ప్రయోజనముల పరంపరను ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ ఎవరీ పద్యములన్నియు। వివరింతురొ వారికెల్లవిద్యా విద్యల్।
దవిలి బాధింప వెన్నడు। భవనాస్థితులు లేక ప్రబలుదు
రెపుడున్॥ 259**

## ప్రతిపదార్థము

ఎవరీ పద్యములన్నియు వివరింతురో = ఎవరైతే ఈ కందపద్యముల యందలి పరిపూర్ణ భావమును వస్తునిశ్చయ పూర్వకంగా వివరించి చెప్పెదరోవారి కెల్ల, అట్టి దారందరికీ విద్యా విద్య, జ్ఞానా జ్ఞానములు
దవిలి= సంక్రమించి

భాధింపవు ఎన్నడు = కర్మ ఫలాలనుభవరూపంగా అనుభవంలోకిరాక
భవనాశస్థితులు లేక = జన్మ కర్మలకు లోను కాక
ప్రభలు మరెపుడున్ = సర్వ భ్రాంతి రహిత స్థితిని చెందియుందురు

## తాత్పర్యము

ఈ పద్యములయందలి పరిపూర్ణ భావమును వస్తునిశ్చయ పూర్వకముగా వున్నదున్నట్లుగా ఎవరు వివరింతురో వారికిజ్ఞానా జ్ఞానముల ద్వారా వుపాదులు సంక్రమించి జన్మ కర్మలకు లోనయ్యే విధానము రద్దయి జనన మరన భ్రాంతి రహితస్థితి పొందెదరు.

**కం॥ పాటసుమీ భక్తులకిది। బాటసుమీ బోధజెంద భ్రమ రాకుండన్। కోటసుమీ కందములను। తోటసుమీ దీన్ని తొలగ ద్రోయక వినుడీ॥ 260**

## ప్రతిపదార్థము

పాటసుమీ భక్తులకిది=శ్రద్ధగలిగి భక్తులైన వారికి పాడుకొనుటకు వీలుగా నుండును
బాటసుమీ బోధ చెంద భ్రమరాకుండున్ = జనన మరణభ్రాంతి రహిత విధానము కలిగించుటకు చక్కటి రాజమార్గముగా నున్నది
కోటి సుమీ కందములను = జన్మ కర్మలనుండి విముక్తి కలిగించి రక్షించుటకు కోటవలెనుండును
కందములను = ఈ కందపద్యములను
తోట సుమీ = పద్య రచనకు తోట వంటిది
దీని తొలగ ద్రోయక వినుడీ = ఎట్టి నిర్లక్ష్యము చేయక మొదటినుండి చివరిదాకా గురుముఖత: వినవలసి యున్నది

## తాత్పర్యము

శ్రద్ధ కలిగి భక్తితో పాడుకొనుటకు వీలుగాను, జననమరణ భ్రాంతి రహిత విధానమునకు వీలైన, శ్రేష్టమైన రాజమార్గముగాను, భ్రాంతి రహిత పరులై రక్షణ పొందుటకు కోటగాను ఈ కందముల తోటగాను రచించటమైనది. కావున ఎట్టి నిర్లక్ష్యము చేయక మొదటినుండి చివర

దాకా గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకంగా వినవలసినదిగా కోరుచున్నాను.

**కం॥ ప్రతిదినము జదివి యెవరీ ప్రతి నర్చన జేతురట్టి ప్రజలకు
బోధ స్థితి కుదర గలదు। గురుకృప కతిపాత్రులు వారు వారి
కడ్డము గలదే॥ 261**

## ప్రతిపదార్థము

ప్రతి దినము = ప్రతీరోజు
చదివి = పారాయణ పూర్వకముగా
ఎవరీ ప్రతినర్చన చేతురో = ఎవరు పూజనీయత కలిగి చదివెదరో
అట్టి ప్రజలకు = అట్టి శ్రద్ధగలవారికి
బోధస్థితికుదురగలదు = పరిపూర్ణ బోధస్థితియందు ఆరూఢత చెందగలరు
వారు గురుకృపకతి పాత్రులు = సద్గురుమూర్తి అనుగ్రహమునకు వారుపాత్రులయ్యేదరు
వారికడ్డము కలదె = ఇహ పరములందు వారికి ఎటువంటి అవరోధములు వుండ జాలవు

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు శ్రేష్టమైన మార్గముగా ప్రతిపాదింపబడి కందపద్యముల రూపంలో రచింప బడిన ఈ గ్రంతమును ప్రతిదినము బక్తి శ్రద్ధలతో చదివిన, పాడిన, పూజించిన, చెప్పిన అట్టి మనుజులకు పరిపూర్ణ బోధ యందు స్తితి కుదర గట్టి పడి దృఢము కాగలదు. గురుకృపకు వారు అత్యంత పాత్రులు కాగలరు. భుక్తి ముక్తి క్రియలందు వారి కెట్టి కష్ట నష్టములకు గురికారు అని తెలియ వలెను